# చిత్రశాల

కొర్లపాటి శ్రీరామమూర్తి






1968

ఆంధ్ర విశ్వకళా పరిష

వెల

# చిత్రశాల

౧

అది స్వయంభూదేవాలయము స్వయంప్రభాప్రభావితము మహేతిహాస మహామాన్వితము మహోన్నత శిఖరవిరాజితము విశాల శిలా ప్రాకార పరివృతము అతిలోకమనోజ్ఞమయిన శిల్పమునకు శిఖరాయమాణము గుడి గోపురము పురనందికి ఎత్తైన మూపురము ఏకశిలానగరమునకు గ్రైవేయము వీరశైవులకు ప్రత్యక్ష కైలాసము

ఆనాఁడు పర్వదినము సాధారణ సంవత్సరమున కదియే శనిత్రయోదశి నిలువెల్ల పూఁచిన మాలతీ మంటపమువలె ఆలయ ప్రకృతి అరుదెంచు అశేష తీర్థప్రజతో అలరారుచున్నది రుద్రాక్ష భూషితులు విభూతి రేఖాతిలక జ్యోతిర్లలాటులు లింగధారులు శూలపాణులు సుదీర్ఘజటాజూట సంశోభితులు నైన ప్రకటలాంఛనులు కేవల పరమేశ్వరధ్యానైక పరతంత్రులయిన ప్రచ్ఛన్న లాంఛనులు, నటకులు గాయకులు కళావేదులు శాస్త్రవాదులు కవులు పండితులు తాత్త్వికులు వేదాంతులు ఆలయములోనికి ప్రవేశించుచుండిరి గర్భాలయములో అర్చక ఘంటలు, మంత్రాక్షరములు ప్రతిధ్వనించుచున్నవి భక్తజన నయనారవిందముల సమ్మదాశ్రుతుషారములు తొణికిసలాడినవి. ఉదయ సంధ్యారోచిస్సుల వలెనె వీరశైవుల విభూతి రేఖలు కలకలలాడుచున్నవి ప్రత్యూష పవనాంకురముల భక్తి పారవశ్య పరిష్వంగములకు ధ్వజస్తంభ ఘంటికాపంక్తులు తైర్థికావళికి ఆశీర్వచనములను శబ్దించినవి

ఆలయప్రాంగణమున కోలాట మాడువారు గొండ్లిసేయువారు, పేరణి కేళిక ఢోక మున్నగు దేశినృత్యములు ప్రదర్శించువారు వేణు వీణాది వివిధ వాద్యవితతులు వినిపించువారు జతిగీతములమీఁద జప్పటలిడుచు శంకర గీతములు పాడువారు ఉప్పొంగిన ఉత్సాహాకృతులవలె నుండిరి మొత్తము మీఁద కోవెలయంతయు కోలాహలముగ నున్నది తదాలయ మహోత్సవ దర్శనోత్సుకతాగాములోయన ప్రాకార శిఖరాలపై ప్రాభాత శోభాప్రాభవము తెగఁద్రాఁక సాగినవి

ఆకస్మికముగ ఆలయ బహిరంగణమున భేరీకాహళ ఢంకా ధమ ధమ ధ్వనులు దిక్కులు ఎక్కటిల్లినట్లు మ్రోగినవి తదాకర్ణనమున ఆలయప్రకృతి నిశ్శబ్దయాగము నెఱపినట్లయినది ఒక్కసారిగ భేరీ ఝాంకృతులను మూఁగ వోయినవి

రత్నఖచితములైన ఖడ్గమేఖలలు ధరించిన రాజభటులు బరాబరులు చేయసాగిరి పారిపార్శ్వకులు పారాహుషారులు పలికిరి వేత్రహస్తులై ముందువచ్చు దండధరులు కటాక్ష వీక్షణ మాత్రమున దారిచేయుచుండిరి భట్టులు స్తోత్రపాఠము అందుకొనిరి నగిషీసొగసులవలె నవరత్నకాంతులు ప్రసరించు స్వర్ణపల్యంకికను వాహకులు దించిరి సహస్రాధిక సంఖ్యాకమయిన చమూసమూహము పల్లకిని పరివేష్టించెను దివ్యదీధితులు వెదజల్లుచు నొక తేజోమూర్తి ఆందోళిక దిగెను

ఆ రత్నకిరీటధారి శ్రీ కాకతి గణపతిదేవ చక్రవర్తి। ప్రభు సాక్షాత్కారముతో ప్రజాహృదయములు ప్రఫుల్లములైనవి శిరములు నమ్రాతి నమ్రములైనవి కరములు ముకుళితములైనవి సమస్త కంఠములు ఏకకంఠముగా జయజయారావములు ఉద్ఘోషించినవి

గణపతిదేవుఁడు గభీర కోమలుఁడు నిండైన విగ్రహము కండలు దిరిగిన దృఢకాయము ఆజానుబాహువు మెలితిరిగిన కోరమీసలు శిల్ప నిగూఢములైన మెలకువలతు మూదల ఆకర్ణాంత విశాలములయిన ఆతని నేత్రాంబుజములలో ప్రస్ఫుటించు రక్తరేఖలు రాగపౌరుష చిహ్నరత్న ప్రభాంకురములు। కనుతెప్పల కదలికకే కాకతీయ సామ్రాజ్య సామస్త్య మాతనికి కయిమోడ్చునట్లు కన్పించును అట్టి దర్శనోజ్జ్వలుఁడు అల్లనల్లన అడుగు లిడుచు పార్శ్వస్థుల ప్రణామశతములందుకొనుచు ఆలయమువంక దృష్టి ప్రసారించెను తదాలోకనములో సుమనోరేఖలు సువాసించినవి భావ స్మృతులు భాసించినవి

"ఎంత విచిత్రమో। పరమపూజ్యులు ప్రపితామహులు నయిన ప్రోల రాజుగారి కాలమది అప్పుడు రాజధాని అనుమకొండ ఒకసారి ముఖ్యనగరము నకు ఆహారపదార్థములు గొనివచ్చు బండి యొకటి తదుపశల్యమున బండరాయి తగిలి బోర్లపడినది శకటము శకలములైనది ఆ శకటాయశ్శకల మొకటి ఆ క్షణమె శిలాఫలక సంసర్గమున స్వర్ణముగ మారిపోయెను ఆ వింత కనులారఁగాంచి సంభ్రమాశ్చర్య చకితులై, రాజభటులా సంగతి ప్రభువు నకు విన్నవించుకొనిరి ఆ స్థలమును మహారాజు స్వయముగా సందర్శించిరి అంతలో హఠాత్సంభూత సహస్ర సౌదామనీరోచిరుజ్జ్వలమై, ధగద్ధగదనంత పవిధారాధారాళమై యొకానొక అపూర్వతేజము ఆవిర్భవించెనఁట। పరమేశ్వర లీలకు పరమానందభరితులై ప్రపితామహులు ఆలయ నిర్మాణమునకు ఆజ్ఞా పించిరఁట। ఆదియే ఈ దేవాలయసృష్టి అందువలన కాకతీయుల వంగడమె గాక యావత్సామ్రాజ్యము ధన్యతామూర్ధన్యము శివలింగ స్వయంభూత్వ సామర్థ్యమున స్వయంభూ దేవాలయ నామధేయము సార్థక్యభాగధేయము।

గాథాస్మృతి కారణముగా గణపతిదేవ చక్రవర్తి గగుర్పాటు నందెను ఆనందమకరందము అంతరాత్మను ఆర్ద్రమధుర మొనర్చెను అనుభూతి వితానముతో అపూర్వ రసోద్గారముతో చక్రవర్తి ఆలయ ప్రవేశముచేసెను అంతలో నచట త్రిపుండ్ర భసితరేఖలతో ముక్తాకుండల తళత్తళలతో జటాకిరీటధారి యొకరు చక్రవర్తిని చూచి మందహాసముచేసెను వెంటనె ఆ జటాకిరీటధారికి రత్నకిరీటధారి నతశీర్ష నమస్కృతి చేసెను జటాకిరీటధారి మౌనవిలోకనములతో దీవించెను ఆ జటాకిరీటధారి గణపతిక్ష్మాపాలుని శివదీక్షాగురువు ఆయనపేరు శ్రీ విశ్వేశ్వరశంభువు గోళకీ మఠాధిపతికూడ స్వయంభూస్వామి సందర్శనార్థము విశ్వేశ్వర శివాచార్యులవా రచటికి విజయం చేసిరి ఆయనకు చేరువలో నొక యువకుఁడు అందఱివలెఁగాక విలక్షణముగ నుండుట ఎవ్వరు గాంచరైరి ఆ యువకుఁ డెవ్వరికోసమో నిరీక్షించును ఏమియో పరీక్షించును ఎందుకో నిస్పృహచెందును అంతలోనె ఔత్సుక్యము పొంది ఆనందముద్ర దాల్చును అనుక్షణమె అతని ఫాలభాగమున విషాదరేఖ విరియును అన్యథా లగ్నహృదయుఁడైన ఆ యువకుని అంతరంగ వైఖరి అది ఇఁక ఎవరికివారు స్వయంభూస్వామి సందర్శనార్థము సమాయత్తపడువారే। సందుచేసికొని జనసమ్మర్దమునుండి యెటులో సందర్శించువారే। అందఱును బ్రహ్మానందభరితులే—ఆ యువకుఁడు వినా।

గణపతిదేవ చక్రవర్తి యాగమనముతో ఆలయ మంటపముకూడ పరిష్కృతమయ్యెను గంభీర గమనమున ఆలయద్వారమువఱకు అరుదెంచి గణపతిదేవ చక్రవర్తి దేవదర్శనము చేసికొని ప్రాంజలి ఘటించెను, ఆలయార్చకులు స్వయంభూస్వామికి తైలాభిషేకము చేయించిరి మారేడు దళములు ఈరేడు లోకముల యధిపతి మౌళిపై నుంచిరి మాచిపత్రి కైసేసిరి రక్తోత్పల మందార కరవీర ప్రభృతి పుష్పాంజలు లొసఁగిరి ధూపదీప నైవేద్యములు చెల్లించిరి నారికేళ కదళీపూగ ఫలములు సమర్పించిరి సమీపములోని పరమ మాహేశ్వరులు సాష్టాంగదండ ప్రణామములు సమాచరించిరి పుంఖాను పుంఖముగా శంఖావళి పూరించిరి ముఖమంటప కాంస్య ఘంట ముమ్మాఱు మాఱుమ్రోఁగినది పూజారులు భక్తులకు విభూతి నొసఁగి శివ నిర్మాల్యము ప్రసాద మిడిరి

శాఖాంతర సంచాలితములైన విచిత్రాకారస్వర్ణ మయూఖ మాలికలు ప్రాకారశిఖరాల వింతయల్లికగొని రంగవల్లికలవలె భాసిల్లినవి యథాగమన వైభవోపేతముగా గణపతిదేవ చక్రవర్తి రాజప్రాసాదాభిముఖుఁడయ్యెను భక్తులొక్కొక్కరె నిష్క్రమింప మొదలిడిరి శిష్యసమేతముగ గోళకీమఠాధిపతి శ్రీ విశ్వేశ్వరశంభువు నాలయమును వీడెను ఆ యువకుఁడు మాత్రమచటనే యుండెను

అపరాహ్ణమైనది ఆలయప్రకృతి చల్లబడినట్లయినది జనసమ్మర్దము చాలవఱకు తగ్గినట్లే। ఆలయాధికారులు అటునిటు తిరుగుచుండిరి అర్చకులు సమారాధన మందిరమున ప్రవేశించిరి దూరదేశాగతులు యాత్రికు దేవాలయ పార్శ్వభాగముల శాద్వల భూములలో విశ్రమించువారు కొందఱు వెనుక భాగమున తరుచ్ఛాయలలో వంటప్రయత్నములు చేసికొనువారు మఱికొందఱు మిగిలిరి యువకుఁడు మాత్రము ఆలయమును వీడలేదు వీడు నుద్దేశమును అతనిలో మృగ్యమే అన్వేషణ ముద్ర యొక్కటే అతని ముఖస్ఫూర్తిలో మూర్తికట్టి ఉన్నది అటులాతఁడు మెల్లమెల్లఁగా ఆలయపురోభాగమునకు వచ్చెను

కొంతసేపు నందీశ్వర విగ్రహముచెంత నిలిచెను క్రమముగా అచటి శిలావితర్దిపయి ఆసీనుఁడయ్యెను సమీపములోనె కదంబతరువు కుంకుమాంకురిత పుష్పగుచ్ఛములు నిలువెల్లదాల్చి నిండుగనున్నది గున్నమావి పునాసపూఁతపట్టి కమ్మతెమ్మరలను పుక్కిలించుచున్నది ప్రాకారముచుట్టును గల బిల్వాశోకన్యగ్రోధ కురవక క్రముకాది వివిధ మహీజములమధ్యను గొల్ల స్తంభముల ఆట ఆడుకొనుచున్న శ్రావణలక్ష్మి చేలాంచల హేలావిలాసమాతనికి పట్టకున్నది మరువము దవనము మాచిపత్త్రి, మందారము విరజాజి చేమంతి కరవీరము మొదలైన ఆలయ పుష్పవాటికలు అతని దీర్ఘ నిశ్వాసములను అవహేళన చేసినను అతనికిఁ గాకున్నది యథేచ్ఛా ప్రసారము లైన భానుభానువుల స్వేచ్ఛాసామ్రాజ్యము సుగంధ శీతల మారుత లహరుల స్వైరవిహారము సాగుచునే యున్నది నిరీక్షా తపోదీక్షా నిమగ్నుఁడయిన ఆ యువకుని నిశితనేత్రాంచల ప్రేక్షణ మాలికలు ఆలయ సింహద్వార చూతాంకుర తోరణ మాలికలే అయినవి

౨

ఆతఁడు రుద్రనాయకుఁడు కళాపిపాసువు సాహిత్య జిజ్ఞాసువు స్ఫురద్రూప యౌవన ప్రాదుర్భావ వేగాసమున్మేషముద్రా ముద్రితుఁడు। ఆలయమునకు వచ్చి అన్వేషణలో లీనమయ్యెను అతని విస్ఫారిత నిర్నిమేష నేత్రావలోకనము లింకను ప్రవేశద్వార పరిబద్ధములే। అతని చేత కుంచెయు అర్ధరచిత చిత్రపటమును కలవు ఎదురుతెన్నులు చూచిచూచి కన్నులు కాయలుకాచినవి అలఁతి కోపము ఇంచుక విసుఁగు జనించెను అయినను శిలావేదికపై చిత్రపటముంచి అరచేత నొత్తి పట్టుకొని అటే దృష్టి నిలిపెను

నిరీక్షా తపోభంగ నిమిత్తమోయన పరిఖాబాహారమైన విశాఖ ప్రాంతమున సంధీన కర్ణీకృత తరుశాఖికలైన శుకదంపతులు కిలకిలా రవములు వించి విపంచికల కించ పలికినవి అందువలన అకస్మాత హృదయాస్ఫాలనమై

రుద్రనాయకుఁడించుక చలించెను పులకిత చందనమున అజ్ఞాతముగా చేయి కదిలెను ప్రతీక్షవీక్షణాఽగోచరమై పత్రము క్రిందపడెను అదేసమయమున సింహద్వారముకడ విద్యుల్లత విరిసినట్లై అతని కన్నులు మిఱుమిట్లు గొలిపెను త్రుటిలో తేరుకొని అటుదృష్టి ప్రసరించెను అప్రయత్నముగ అతని పెదవులపై దరహాసము వెలసెను

ఆ నిర్మేఘ నభోవైద్యుత కాంతిలహరి ఆలయ ప్రవేశముచేయు ఒకానొక బాలిక దేహదీధితి।

ఆమె కాత్యాయని పదునాలుఁగు వసంతముల పచ్చనిప్రాయపు పసిఁడి మొగ్గ ఆ బాలిక ముగ్ధమోమున అప్పుడే భావిసౌభాగ్య సువాసనలు సుప్రకటితములు। సునసోగకన్నులు మెఱుఁగు తీగలై మెఱయ నీలాభ్రశకలములవలె కాటుకరేకలు తీర్చిదిద్దుకొన్న ఆమె నిజముగా శ్రావణ లక్ష్మియే। ఉరస్స్థల త్రిసరకాంతి ప్రసరము లామెకు బరువును మురువును గొలుపుసట్టివి మృణాల మృదులమైన కుటిలకుంతలముల త్రివేణీ సంగమ స్థానమున మొగలిరేకులు మడచి సంపంగి పూవులు సవరించి మల్లెదండ విందుచేసి మధ్యమందారముల పొందుపఱచి బాలికయయ్యు కాత్యాయని జాహ్నవీ సాపత్న్యము నెఱపు నెఱజాణ। పసిఁడి పళ్ళెరమున కుసుమ వితతులరాసులు వోసికొని ఉత్సాహము ఉయ్యెలలూఁగ ఆయ్యెలనాగ సయ్యాటలాడు ఒయ్యారపునడలతో శిలా వేదిక చేరుకొన్నది

రుద్రనాయకుఁ డామె చిటికము మెదిపి చిన్నిస్ఫోటనము చేసెను అదృశ్యహస్తము కాదంబినీ ప్రతిసరోత్పాటనము చేసినటులైనది శరజ్జ్యోత్స్న సుధలు చిమ్మిన విరఁజిమ్ముచు కాత్యాయనీ రాకేందువదనము వింత సోయగమును సంతరించెను

'ఇప్పుడా వచ్చుట? రుద్రనాయకుఁడు తెచ్చికోలు కోపమున గ్రుచ్చి యడిగెను

ఉత్సవముకదా। దేవాలయము జనసమ్మర్దముగా నుండును ఆలస్యముగా వెళ్ళుమమ్మా। అన్నారు నాన్నగారు। ఆయన మాటలు ఎటుల జవదాటఁ గలను మఱి?' అన్నది కాత్యాయని

బుంగమూతినిడి చంటిపాపవలె గారాబము చీరాడ అట్లామె పలుకునెడ కిన్నెరమీటినట్లు వెన్నెల చిందినట్లు క్రొన్ననవిరిసినట్లు తొలి ఉషస్సున తెలివన్నె మలఁచినట్లు విచిత్ర మధురానుభూతి రుద్రనాయకునకు కలిగెను సూటిఁగా అతఁడు కాత్యాయని వంక చూచెను కాత్యాయనియు చూడఁ

బోయినది కాని చూడఁగ బోయినది అజ్ఞాతదశా సంజాతమైన లజ్జాభరమున కంజాత వదనము వాల్చినది అట్లు తలవంచునంతనె ఆమె యులికి పడినది

'అయ్యో! ఇదేమి బావా! చిత్రరచనాపత్ర మట్లు పారవేసితి వేమి?' అని కాత్యాయని కొంచెము పడినది ఆ మాట వినుచునె అట్లు చూచి 'ఆఁ! ఎట్లుపడినది?' అనుచు రుద్రనాయకుఁడు పత్రమునందుకొని కన్నుల కద్దుకొన సాగెను ఆది చూచి కాత్యాయని ఫక్కున నవ్వెను రుద్రనాయకుఁడు తెల్లబోయి చూచెను

బావా! మంచివాఁడవే! అది పూజాద్రవ్యమా యేమి ఆ ప్రాయశ్చిత్తమునకు? అనినది కాత్యాయని

'కాత్యాయనీ! నీకు తెలియదు పూజాద్రవ్యము కంటె నిది పూతచరితము స్వర్గమునకంటె మధురస్వప్నమునకంటె నాకిది ఆనంద సంధాయకము!

ఆ మాటకు కాత్యాయని కనుబొమలు విల్లువలె వంచి క్రింది పెదవికి నెలవంక భంగిమ నేర్పి విచిత్రముగా నవ్వినది ఆ చెయిదము, చెలువమును అరకంట నవలోకించు రుద్రనాయకుఁడు హృదయము స్పందించి అనిర్వచనీయానంద మనుభవించెను

కాత్యాయనీ! ఇది—

అర్థోక్తిలో నతఁడు పత్రము బహిరంగపఱచి 'పూర్తిగా చిత్రించనీ! దీని అందచందములు, నా ప్రతిభాప్రాభవములు పరికింతువుగాని!'' అని సగర్వముగా మందహాసము చేసెను

ఆశ్చర్యము! అదితన చిత్రమే!—కాత్యాయని నవ్వినది ఆ నవ్వు అవజ్ఞాపూర్వకమైనది మేటి చిత్రలేఖకుఁడవు! మేలైనచిత్రమే!!' అని కావలసిన ఎగతాళియే ఆ నవ్వునకు భాష్యము అతఁడు కిరాతవన్య కాఁడవి కాదు కాత్యాయని భావము అదొక అభీష్టవిషయ వ్యతిరేక ముఖప్రకటన ప్రక్రియ ఋజుమార్గమాత్ర గ్రహణమున రుద్రనాయకుఁడు పరాభవదనానల పరితప్తుఁడై పండ్లు కొఱికెను

కాత్యాయని మఱల నవ్వినది ఈసారి నగవు సెలవి నిండుగవచ్చినది ఆ కోమల పరిహాసము ప్రాసమువలె రుద్రనాయకుని గుండెను దూసుకొని పోయెను వెంటనే ప్రతిహాసము చేసెను హసన్ముఖియైన కాత్యాయని కాలు కదిపినది రుద్రనాయకుఁ డనుసరించెను ఇరువురు ఆలయ మంటపములో ప్రవేశించిరి మంటపస్తంభములచెంత నున్న అర్చకులు వారిని చూచిరి

'కృష్ణనాయకుని కుమారుఁడు హేమాద్రిరెడ్డిగా రమ్మాయి వచ్చిరి

అని ఒక అర్చకుఁడు రెండవవానితో చెప్పి గుడితాళము తిచ్చెను రెండవ అర్చకుఁడు ఆలయద్వారము తెఱచుటకు ఉపక్రమించెను

'ఆర్షమత మగుచో ఆలయప్రవేశార్హతయే లేకపోయెడిది మనకు అని కాత్యాయని రుద్రనాయకుని చూచెను

నిజమే భవకర్మసంస్కారులగు ప్రవర్తకులు శివకర్మ సంస్కారులగు నివర్తకులు అని వేదచోదితజాతులు రెండే రెండు కలవు అయినను బ్రాహ్మ్య మతమున చాతుర్వర్ణ్యవిభేదమె ప్రధానమై పోయినది శైవమత మట్లుకాదు శివభక్తులందఱు శివస్వరూపులు।—బ్రాహ్మణులు అబ్రాహ్మణులు పండితులు పామరులు ప్రభువులు ప్రజలు స్త్రీలు పురుషులు అను భేదాచరణములేదు భక్తియే ప్రధానము శివభక్తులందఱు వారి సర్వస్వము పరమేశ్వరార్పణముచేసి శివసాయుజ్యముఁ బడయుదురు ఇది వీరశైవాగమవిశద బోధామృతము కులగోత్ర విస్మృతియే వీరశైవ దీక్షాప్రథమ నియమ స్వీకృతికదా।' అని రుద్రనాయకుఁడు ఉచ్చైస్స్వనమున పలికెను

ఇంతలో నెవరో ఇట్లనిరి

వీరశైవ తత్త్వార్థము క్లిష్టము వైదికమతమందలి దేవతార్చనము, జైనబౌద్ధమతములందలి సంఘారాధనము వివిధమతములందలి కర్మారాధనము మానలేదుకదా।

ఆ వ్యక్తి యెవ్వరా యని రుద్రనాయకుఁడు పరిశీలనగా చూచెను ఎవరోకాదు ఆయన అగ్నిహోత్ర చయనులు। ఎడచకట్టిన ఆర్షమతపండితుఁడు మహావేదాంతివలె అర్చకులతోను మతప్రవర్తకులతోను మఠాధిపతులతోను ఎప్పుడు నేదియో ప్రసంగించునని అందురు ఆయనతో ప్రతివాదము చేయుట శుష్కప్రయాస। అని భావించి రుద్రనాయకుఁడు మౌనము వహించెను

అర్చకుఁడు ఆలయద్వారములు తెఱచెను అది చూచి కాత్యాయనీ రుద్రనాయకులు కదలిరి ఆలయమంటపములోనున్న అగ్నిహోత్రచయనులు కాత్యాయనీరుద్రనాయకుల ఆలయప్రవేశమును అదొకవిధముగా చూచెను అంతలో అర్చకుఁ డాతనిని సమీపించి చయనులుగారూ। మనము పోతన మంత్రిగాఁ రింటికి పోదమా? అనెను అగ్నిహోత్రచయనులు తల ఆడించెను ఆ ఇద్దఱును ఆ చోటు వీడిరి

కాత్యాయనీ రుద్రనాయకులు గర్భాలయములో ప్రవేశించిరి కాత్యాయని పూజాభజనము నొకప్రక్క నుంచెను ఆ చేరువలోనే రుద్రనాయకుఁడు నిలచెను వారు పూజ ముగించుకొని వెళ్ళఁగానే గుడికి తాళమువేయుటకుఁగాను ద్వారములో అర్చకుఁడు నిలిచియుండెను

కాత్యాయని స్వయంభూస్వామి పాదారవిందములు క్షాళనచేసినది పటీర జలము పరీక్షించినది చంద్రచూడునకు చందనగంధ మలఁదినది కస్తూరి తిలకము తీర్చినది కర్పూరనీరాజన మిచ్చినది కాలాగరుధూపము చెల్లించినది స్వయంభూశివలింగమును పూవుపూవున పూజించినది అంజలిఘటించి అరవిందనయనములు మూసికొని నిర్వికారధ్యాన నిబద్ధమనస్విని అయినది రుద్రనాయకున కామె అంతరుజ్జ్వలగురుమూర్తివలె భాసించినది ఆమెతోపాటు రుద్రనాయకుఁడు కూడ స్వయంభూస్వామికి మ్రొక్కెను ముహూర్తకాలము ధ్యానముద్ర ధరించి అనంతరము కాత్యాయని తాను స్వయముగా తెచ్చి భగవదర్పితము చేసిన ప్రసాదము కన్నుల కద్దుకొన్నది శర్కరాసమ్మిశ్రిత నారికేళ కదళీఫలఖండప్రసాద మది రుద్రనాయకున కొసఁగి తాను కొంత దీసికొన్నది

ఆమె కది పరమేశ్వర సాక్షాత్కార ప్రతిమానము ।
ఆతనికి ప్రణయినీ సాక్షాత్కార ప్రతిమానము ॥

౩

కాకతీయసామ్రాజ్యలక్ష్మికి ఏకశిలావరణము కంఠాభరణము అది త్రివిష్టపమునకు జ్ఞాపక పరిపంథి తిమిరావళికి ప్రాగ్దీపిక సప్తప్రాకార సంవలితము ధరణి దర్పణ ప్రతిబింబితైంద్ర ధనుశ్శంకా సంకలితము తొలి ఆరు ప్రాకారములు మట్టితోఁ గట్టఁబడినవి అయినప్పటికి మంచి గట్టితనము కలవి ఉక్కుబల్లెము లా కోటగోడలకు తగిలిన ఎండుటాకులవలె నేల రాలవలసినదే। ఫిరంగిగుండులు గోళీకాయలవలె కేళీవిలాసము నేర్పుకొనవలసినదే। వాని నడిమిభాగము కొబ్బరికోవలతో, మామిడితోపులతో, పోక వరుసలతో అపర పురందరపుర నందనవనము ప్రతి ప్రాకారమునకు నలుముఖముల ద్వారములు కలవు ద్వారమార్గముల కుభయపార్శ్వము లందు కుండాల గండూషజలభ్రాంతిగొలుపు నీఁటినాళములు పెక్కు కలవు ఆరు ఏఁడు ప్రాకారములకు మధ్యమున వాడలు పాళెములు కలవు అవి శూద్ర జనావాస నియతములు

ఏఁడవది శిలాప్రాకారము పెద్ద యెడ్లబండు లొక్కసారి తప్పుకొనఁ జాలినంత పరిణాహము రథ గజ తురగ పదాతి వర్గము లొక్కుమ్మడిగ నడిచినను చెక్కుచెదరని ఉక్కుకట్టడము పశ్చిమ ప్రాకారద్వారము ప్రవేశ ద్వారము ప్రవేశద్వార విశాల శిలాసోపాన పరంపరాధఃపార్శ్వ కుడ్యాచలములం కంటకజలమూలకందకములు సింహద్వారము దాటగనె దక్షిణముగా వీరుల గుడి పూర్వదక్షిణముగా నింకను పెక్కు దేవాలయము లున్నవి అందు ఏకవీరాదేవి చమదేశ్వరీదేవి, ముద్దరాలు మూసానమ్మ గ్రామదేవతలు ప్రాచ్య

శిలాపరిఖపైపు ఇంకను కోవెలలు కలవు అందు భైరవాలయము మైలారు దేవళము స్వయంభూదేవాలయము విష్ణ్వాలయము వీరభద్రాలయము ప్రఖ్యాతములు ఈ దేవళములు తావళములుగా చక్రవాక చక్రవాళవంచనావటు హేవాకసేవాద్యావాపృథివ్యంతర్వ్యాపిత కాలాభ్రిపర్యాయ హోమధూమ ఖోద్దామ వ్యవస్థాపప్రతిస్థాపనాచార్య బోధ్రిక్తలక్షణా మంత్రసూక్తంబులగు నార్యవాటికలు గ్రామదేవతల గుడులు గ్రైవేయములుగా 'విద్వేష భువన విజిగీషారంభ విజృంభమాణ ఋషభధ్వజ భుజపరాక్రమ సముత్సాహ నాటక పస్తావనాప్రథమ నాందీశ్లోకంబులగు వేశ్యవాటికలు కలవు

ఉదీచి దిశగా ఉదీయమానమైన తదీయ దుర్గమున రత్నరాశులవలె రాజ భవపపంక్తు లున్నవి రాజభవనాపరణమంతయు వివిధపుష్పలతా నికుంజ మంజులము మల్లెపొదలనుండి వీతెంచు చిఱుగాలి మంగళగీతము పాడ మొగలిపొంతలనుండి యేతెంచు పెనుగాలి ప్రక్కవాద్యములవలె నరిపడును పెండ్లిపీల లనఁదగు రాజా వసథములపై అనారతము సమున్నతములయిన చంపకతరువులు సువర్ణకుసుమాక్షతావళుఁ బ్రోదిసేయుచుండును అది యేక శిరానగర దుర్గమునకు నిత్యకళ్యాణము పచ్చతోరణమనుటకు నిదర్శనము రాజ భవనరాశిలో ఈశాన్యపుమూలగా సైనికవాటిక, రాజోద్యోగుల ప్రత్యేకవీథులు కలవు మధ్యగానున్న విశాలభవనము ఖుషీమహలు ఆ ప్రక్కనె ఘటికా యంత్రాగారము ఉత్తరశిలాప్రాకారప్రాంతమున నున్నవి రాజాంతఃపురములు రాజనగరులకు ముందుగ నున్నది ఏకాంతమందిరము దానికి ప్రాంగణమున ఖుషీమహలు ప్రాంతముననున్న ప్రత్యేక దేవాలయము కాకతమ్మగుడి కాకతమ్మ పరాశక్తి కాకతీయుల కులదేవత కనుకనె వారు కాకతీయులు ఇంచుమించుగ కోటకు నడుమ నున్నది సభాసదనము

అది నేఁడు పచ్చని తోరణములతో రంగురంగుల పూలహారములతో అలంకృతమైనది శిలాకుడ్యములు శిల్పసముజ్జ్వలములై యున్నవి సదనాగ్ర శిఖరమున వరాహలాంఛనము కల వైజయంతి వాతావధూతమగుచు వైభవమును చాటుచున్నది యౌవరాజ జన్మదినోత్సవ సందర్భనోత్సాహులై ఎందఱో జనులు సభాసదనమునకు వచ్చుచుండిరి వారందఱికి సింహద్వారమునొద్ద సింహకిశోరములవలె విచ్చుకత్తుల ఒడ్డాణములు ధరించియున్న రాజభటులు ప్రవేశమిచ్చుచుండిరి

సభాసదనములో మంత్రికోందఱు రాజప్రముఖులు వారికి స్వాగతము లిచ్చి యథోచితసత్కారము లందఁజేయుచుండిరి సువిశాలమైన సభాసద నాంతరము వెల్లివిరిసినట్లున్నది మధ్యభాగమున ప్రజలు బారులుదీఱి నిలిచిరి చుట్టును ఖడ్గధారులై రాజభటులుండిరి ఒకప్రక్క ములికినాఁడు రేనాఁడు,

సకిలినాఁడు ఏరువనాఁడు, పొత్తపినాఁడు మొదలైన నాఁడుల ఱేఁడులు గ్రామపాలకులైన వీరభద్రులు కూర్చుండిరి వేశాకప్రక్క అప్లే రెడ్లు కరణములు కూర్చుండిరి వారికి ముందుగా సభావేదికకు సమీపముగా విషయాధినాథులు సామంతనృపులు సుఖాసీనులయిరి సభావేదికకు అతిసమీపమున ఉన్నతాసనములపై కార్యభరణుఁడు ధామనామాత్యుఁడు బయ్యననాయకుఁడు తంత్రపాలుఁడు పోలిరౌతు మావుల మంచిరాజు సేనాధిపతి హేమాద్రిరెడ్డి ఉపసేనాధిపతులు కృష్ణనాయకుఁడు ఎక్కినాయకుఁడు ఉపవిష్టులయిరి ఆ మధ్యభాగమున భాస్కరభట్టారక ప్రభృతి పండితులు యథావాక్కుల అన్నమయ్య మొదలైన కవీశ్వరులు అగ్నిహోత్రచయనులు మున్నగు మహాదివిజులు ప్రత్యేకాసనములు అలంకరించిరి

సభావేదిక యంతట రత్నకంబళులు పఱచిరి పైన మణితోరణములు కైసేసిరి వేదిక పురోభాగ పార్శ్వముల అమూల్యమైన సింహాసనములు అమర్చిరి శిరోభాగమున నవరత్నఖచితము అనర్ఘ మణిరచితములై, శరత్కాల మధ్యందిన ఖద్యోతమండల ప్రభాసమాన భాసమానములై స్వర్ణసింహాసనములు రెండు వెలుఁగొందుచున్నవి

ఒక్కసారిగ బహుపరాక్ శబ్దబాహుళ్యముచే సభ కంపమందెను స్తోత్రపాఠకులయిన బర్దులు విజయబిరుదప్రశస్తి నిట్లు చదువసాగిరి 'స్వస్తి సమస్త పంచమహాశబ్ద। మహామండలేశ్వర। రాజపరమేశ్వర। ఉద్దండమండలాగ్రప్రచండ। అద్రికటక వజ్రప్రాకార। శ్రీ యోగానంద నరసింహదేవర దివ్యశ్రీ పాదపద్మారాధకులైన శ్రీ కాకతిరాజ మహా గణపతిదేవ। మహారాజ। విజయీభవ। దిగ్విజయీభవ।—"

ఒక్కొక్క పదమునకు ఒక్కొక్క అడుగువేయుచు మదేభ గమనమున ప్రతి శబ్దలయకు శ్రుతిగలుపుచు భుజానిర్గళిత పటాంచల ధారణముతో ఇరువురు పరిచారికలు వెంటరా పట్టువింజామరలతో కొందఱు చేటికలు అనుసరింపఁగా మరికొందఱు మగువలు పుష్పవృష్టి కురియుచుండఁగా మహారాజా గణపతిదేవచక్రవర్తి యువరాజ ద్వితీయుఁడై సభావేదికమీఁదికి వచ్చునంత మంగళాక్షతలు వర్షించినవి జయజయ ధ్వనులు దిక్కులు మిన్నుముట్టినవి భేరీకాహళ ఢంకాఢమఢమ ధ్వనులు ఎక్కటిల్లినవి సజీవ చైతన్య సంప్రాప్తమైనదియై సభయె కైవారము చేసెను నిండుసభ నిశ్శబ్దయోగము నెఱపెను

గణపతిదేవ చక్రవర్తి యువరాజా వేదికాశిరోభాగమందలి స్వర్ణ సింహాసనములు సమధిష్ఠించిరి అటుపై శివదీక్షాగురువు శ్రీ విశ్వేశ్వరశంభువు, మహాప్రధాని గోవిందనాయకుఁడు, సర్వసేనాని మేచయనాయకుఁడు, మంత్రి

సత్తముఁడు శివదేవయ్య బ్రాహ్మణమంత్రి పోతన సభావేదికమీఁదికి వచ్చి ఉచితాసనములపై నుపవిష్టులయిరి

బారులుతీరి ఖడ్గధారులైయున్న రాజభటులలో సభావేదిక సమీపములో నున్న యొక వృద్ధభటుఁడు యువరాజును తెప్పవాల్చక చూడసాఁగెను ఆ వృద్ధభటుని వేషభాషలు సామాన్య భటునికంటె అధికము రాజపురుషునికంటె అల్పము అతని నిమేషదృష్టి యువరాజుమీఁదనె సంలగ్నమైనది

యువరాజు రూపము అపురూపమైనది ఆ మోము స్నిగ్ధసుందర ముగ్ధమోహనము చికురము సంయుతరత్నముకురము సుకుమార కుసుమకోరక స్ఫోరకమైన ఉరము కఠిన కవచబంధురము అపాంగరమ్య పద్మరాగ ప్రభా కాంతి పుంజములు చారుతావ్యాఘాతక వీరతాద్యోతకములు వీరతావ్యాఘాతక చారుతాద్యోతకములును

ఘటికాగారములో రెండు పదులు కొట్టిరి రాజపురోహితుఁడు సభావేదికపైకి వచ్చెను ఉదాత్తానుదాత్త స్వరితభేదగతిలో వేదమంత్రములు పఠించెను యువరాజు నాశీర్వదించి మంగళాక్షతలు చల్లెను అంతలో యువరాజుపై అక్షతవృష్టి పుష్పవృష్టి కురిసెను ధీరసుకుమారముగా యువరాజు లేచెను రాజపురోహితునకు వందనముఁజేసెను మహారాజునకు నతశీర్షనమస్కృతి చేసెను అమాత్యశేఖరులకు అభివందన పరంపర అర్పించెను అటుపై సభకు అంజలి ఘటించి యథాపూర్వము సువర్ణ సింహాసనాసీనుఁడయ్యెను

అంతసేపును వృద్ధభటుని దృష్టి యువరాజునందే యంకితమై పోయినది ఎడనెడ ఎవ్వరేని తనవంకఁ జూచుచో ఏమియు నెఱుఁగనట్లు తలఁద్రిప్పుచు వచ్చెను యువరాజు సభకు అంజలి ఘటించునెడ వృద్ధభటుఁడు ఆత్రముకొలఁది అందఱి మొగములవంక కన్నులు చించుకొని మఱియు చూచెను అదస్యులయిన సదస్యుల అరవిందనయనాలలో ప్రతిఫలించిన ఆనందరేఖలకు ఆ వృద్ధభటుఁడు అమందానంద మందెను అప్పుడు గణపతి దేవచక్రవర్తి గభీరవదనమున మాత్రము ఎందుచేతనో విషాదరేఖ నీలినీడలు కట్టెను కాని వెంటనె గణపతిదేవచక్రవర్తి ఆనందరేఖనె అచ్చొత్తించుట గమనార్హమైనది

అనంతరము సామంతనృపులు తాము దెచ్చిన ఉపాయనములు సమర్పింపసాఁగిరి సభావేదికమీఁద హాటక నిష్కహాసములు వెలసినవి వజ్ర వైడూర్య మరకత మాణిక్యముల విద్యుత్ప్రభల విరియఁజేసినవి పటపటారవలముతో పణములు కొటారులైనవి నాణ్యములు నాట్యమాడినవి ఆ సువర్ణ కాంతులను రత్నరాశులను అధఃకరించు సువర్ణసుభగములైన నవరత్నములతో

తపీశ్వరులు యువరాజానభివర్ణించి ఆశీర్వదించిరి ఆస్థాన గాయకులు ప్రశంసాగీతములు గానముచేసిరి రాజనర్తకి చరణ నూపురఝుణం ఝుణారవములతో సభాసదనము సమ్మద రసోత్కటమైనది ఆనంద ఝురీవీచులు ధవళరోచులతో విలాసవిహారము చేయుచున్నట్లుగా సభాస్తారులు చైతన్య విస్తారులయిరి

గణపతిదేవచక్రవర్తి గభీరదృక్కులతో మంత్రిసత్తముఁడు శివదేవయ్యను విలోకించెను వెంటనే శివదేవయ్య లేచి సభావందనము జేసి ఆజ్ఞాపత్ర మొకఁడు చదువసాఁగెను—

'శ్రీ శ్రీ శ్రీ కాకత్యన్వయ పయఃపారావార రాకాసుధాకర రుద్రదేవాఖ్య యువరాజ జన్మదినోత్సవానంద సమయమున, శ్రీ శ్రీ శ్రీ కాకతీయ పురవరాధీశ్వర గణపతిదేవ చక్రవర్తి మహారాజులుంగారి ప్రదానములు—

వీరభద్రాలయమునకు సంపూర్ణ వ్యయము గణపేశ్వర విగ్రహ ప్రతిష్ఠాపనార్థము సువర్ణ నిష్క సహస్రము నీయఁబడును స్వయంభూ దేవాలయ సంతతారాధనలకు మాగాణి మాన్యము నొసఁగి శాసనము వేయింపఁబడును ప్రతి దేవాలయమునకు కర్పూర శ్రీగంధ కస్తూరీ ముక్తామూల్య పదార్థములను విదేశప్రాప్యములైన పంచదార పట్టువస్త్రములను పంపుటయు నిర్ణయము వ్యవసాయాభివృద్ధికిఁగాను వాపీకూపతటాకాది నిర్మాణములు పథిశ్రమాయాసనివృత్తికిఁగాను నిచుళామ్లికానీప వటవృక్షాది వనమహోత్సవములు ప్రారంభింపఁబడును సత్రశాలా సంస్థాపనమునకు సంస్కృతవిద్యాపీఠ సముద్ధరణమునకు సంపూర్ణ వ్యయ మొసఁగఁబడును

ఇట్లు

గణపతిదేవ సార్వభౌములుంగారి

యాజ్ఞప్తి

ఆజ్ఞాపత్ర పఠనానంతరము శివదేవయ్య నిజాసనాసీనుఁడయ్యెను సభయందంతట కరతాళధ్వనులు హర్షధ్వానములు చెలఁగెను సూచితాంశ నియమావళీ ప్రణాళికారూపము దాల్చినందులకు అమాత్య శేఖరులు అభినందన వైఖరులు ప్రకటించిరి మాహేశ్వరులు స్వమతవ్యాపనసమ్మత ప్రఫులాసమ్మదులయిరి సర్వతోముఖ సంతోష పులకాంకురితమైన సభలో కృష్ణనాయకుఁడు మాత్రము ద్విధాభావ విధానము నవలంబించెను ప్రభు ప్రకటనమున వైష్ణవ ప్రసక్తిలేదని శైవమత పక్షపాతము కలదని అతని చిత్త మెరిసెను రాజనియమవ్యతికరవ్యగ్రత వహించెను అది ఉగ్రతకు దారి తీసెను కెంపువాతెన కంట బలవంతముగా ఇష్టతనె స్పష్టపఱచెను అంతరంగ సంక్షోభ మెల్లో అణఁచుకోఁగలిఁగెను పార్శ్వస్థితుఁడైన హేమాద్రిరెడ్డివంక పరికించెను,

హేమాద్రిరెడ్డి మోమున ప్రమోదవికాసము నిరవధికమై కనిపించి కృష్ణనాయకుఁడు నిగూఢముగా నిశ్వాసము విడచెను ఇంతలో హేమాద్రిరెడ్డియున్న తావునకు జాయపనాయకుఁడు వచ్చెను కృష్ణనాయకుఁడు జాయపనాయకుని జూచి కొందలపడెను వారు ఉభయుల పరస్పర దరస్మితములకు కృష్ణనాయకుఁడు బిరిమీఁది కృష్ణసర్ప మయ్యెను మాత్సర్య విషద్రవ ప్లావితములైన నిప్పులు గ్రక్కిన నివురుగా తెచ్చికోలు వికాసముతో జాయపనాయకునిపై దృష్టి సంలగ్నము చేసెను

అంతవఱకు ఆనందాతిరేకమున నున్న జాయపనాయకుని మోము ఆకస్మికముగ వైవర్ణ్యమందెను కాతరనేత్రుఁడై జాయపనాయకుఁడు కాలు కదిపి తీక్ష్ణదృక్కులతో తీవ్రగమనమున సింహద్వారము చెంతకు వెడలెను అచట పాతనముగ వచ్చిన వ్యక్తులిద్దఱు భయాందోళనముతో నుండిరి వారు దూరదేశాగతులయిన తాంబూలికులు అదే కృష్ణనాయకుఁడు చూడసాఁగెను ఆ తాంబూలికు లేవియో జాయపనాయకుని కర్ణములలో చెప్పిరి అమాంతము జాయపనాయకుని వీక్షణములు రూక్షరుద్రము లయినవి తత్క్షణమె జాయప నాయకుఁడు సభావేదిక సమీపించెను రాజనర్తకి నృత్యము మఱల సాఁగు చున్నది సదస్యు లందఱు భరతనాట్య పరవశులయిరి కృష్ణనాయకుని దృష్టి మాత్రము జాయపనాయకుని వీడలేదు జాయపనాయకుఁడు క్రుద్ధవ్యాఘ్రము వలె సభావేదిక నధిరోహించి శివదేవయ్య చెవిలో గొణిగించెను శివ దేవయ్య వికటభ్రుకుటియై ప్రధానామాత్యుఁడు గోవిందనాయకుని చేరి చెవిఁ గొఱికెను గోవిందనాయకుఁడు గణపతిదేవ చక్రవర్తిని సమీపించి యేదియో నివేదించెను సింహద్వారము నొద్దనున్న తాంబూలికుల భయకంపితావస్థ అటులే యున్నది రహస్యనివేదనాకర్ణమున గణపతిదేవ చక్రవర్తి తీక్ష్ణ దృక్కులతో తీవ్రాలోకన చేసెను ఆతని నేత్రాంబుజ రక్తరేఖలు అరుణారుణము లయినవి కోఱమీసలు చుఱకత్తులై గగుర్పొడిచెను పౌరుషాగ్ని ప్రజ్వలన జ్వాలాతదాలోకనకు ఎల్లరు విస్మితులై భీతిల్లిరి

శివదేవయ్య కరచాలనము చేసెను రాజనర్తకి నృత్యముచేయుచు నృత్య భంగిమవలెనె నిలిచిపోయెను కృష్ణనాయకుని దృష్టి పర్యాయక్రమములో జాయప నాయకునిపై, శివదేవయ్యపై ప్రధానామాత్యునిపై గణపతిదేవ చక్రవర్తిపై ప్రసరించుచున్నది ఆ కృష్ణనాయకునిపై అగ్నిహోత్రిచయనుల దృష్టి స్తంభించిపోయెను స్వర్ణసింహాసనమునుండి గణపతిదేవ చక్రవర్తి ధీరగంభీ రముగ లేచెను మత్తశుండాలమువలె కాలు కదిపెను సభావేదికపైనున్న అమాత్యశేఖరులు అనుసరించిరి యువరాజుకూడ సింహాసనము వీడెను యువరాజు సమీపమునకు వృద్ధరాజభటుఁడు వచ్చెను శివదేవయ్య సభ సమాప్త

మైనదని ప్రకటించెను అప్రయత్నముగ కృష్ణనాయకుని దృష్టి అగ్నిహోత్రచయనులపై ప్రసరించెను అగ్నిహోత్రచయనుల దృష్టి సభావేదికనుండి నిష్క్రమించు బ్రాహ్మణమంత్రి పోతనవంక ప్రసరించెను

సదస్యులు సామంతనృపులు స్తబ్ధులయిరి అస్పష్ట విషయాందోళనతో శంకిత ప్రమాద విహ్వలతతో లేచిరి అగ్నిహోత్రచయనులు కృష్ణనాయకుని సమీపించెను కృష్ణనాయకుడు హేమాద్రిరెడ్డిని సమీపింప దలచెను కాని సమీపించలేదు వసంతోదయమువలె ప్రారంభమైన సభ శిశిరనిశీథమువలె ముగిసినది

౪

సంధ్యాసమయము ప్రోషితభర్తృకయైన ప్రతీచీసతికి ప్రియాగమన వార్త గాలికబురుగా తెలిసినదికాబోలు । కుంకుమ తిలకము తీర్చి దిద్దుకొన్నది మేఘ మాలికను మేలి ముసుగు వేసుకొన్నది తటిల్లతాప్రభలు తారహారములవలె తారాడసాగినవి అలతి అలతి కాంతుల తారకలు అక్కడక్కడ ప్రతీచీసతి జలతారు చీర అంచుల జరీపువ్వులవలె మిలమిల లాడుచున్నవి అది ప్రశాంత నీలాకాశ ప్రణయ ప్రకృతి అందుకు ప్రత్యామ్నాయముగా అవనీతలమున నానాసంక్షోభము ముఖ్యముగా రాజవీధి వారణఘటా ఘోటక శకటికా భటకోటీసంకులమై యున్నది అది ప్రకృతిలోని ద్వంద్వభావములకు ప్రమాణమగునేమో । సంధ్యారాగ సాపత్న్య భ్రమాస్పదమై ఉద్ధృత ఝంఝామారుతమువలె ఎఱ్ఱని ధూళి ఎగురుచున్నది ఆ ధూళి నెటులో ఎదుర్కొనుచు రాజపురుషు లిరువురు అశ్వారూఢులై ఈశాన్యదిశగా ప్రయాణము చేయుచుండిరి

వారిలో దీర్ఘకాయుడు కృష్ణనాయకుడు రెండవవ్యక్తి హేమాద్రిరెడ్డి వారిద్దఱును బావమఱదులు జవనాశ్వములపై వచ్చి వారు విష్ణ్వాలయము చేరుకొనిరి ఆలయ ప్రాంగణమున అశ్వరాజములను వేపచెట్టు నీడను నిలిపి ఇద్దఱును ఆలయములోనికి ప్రవేశించిరి మాటయు మంతియు లేకుండ కృష్ణనాయకుడు బావమఱదిని ఆలయావరణ మంతయు త్రిప్పెను హేమాద్రిరెడ్డికి ఏమియు నర్థము కాలేదు అడుగ నెంచియు అడుగువేయుచుండెను శిథిల శిల్పములు పతనోన్ముఖ పరిఖాశిలాఫలకములు పరిష్కార విహీనమైన మంటపాంతరము ధూళిధూసరితమైన కాంస్యదీపస్తంభము చూచి హేమాద్రిరెడ్డి మనస్సు చివుక్కు మనెను వెళ్ళిన చోటికే వెళ్ళుచు ఇద్దఱును కొంతసేపటికి ధ్వజస్తంభము దగ్గఱకు వచ్చిరి అదియు శిథిలావస్థలోనే యున్నది చిఱుగంటలకు బదులు ధ్వజస్తంభాగ్రమున పిచ్చుకగూండ్లు ఊగిసలాడుచున్నవి

విద్యాలయ మిటులున్నది. ప్రభువులచిత్త మిటులున్నది. సమదృష్టి పూజ్యము. పక్షవాతమువలె పక్షపాత మచికిత్సలేని చిరగ్లాని. అధికారయుతమైన అధిక సంఖ్యాకుల పీడన తాడనములకు అల్పసంఖ్యాకులు అణఁగారిపోవలసినదే। పాడుకాలము దాపురించినది. ఆలసలేని పాలన। అనుచు నచట నొక గండశిలపయి కృష్ణనాయకుఁడు కష్టతమముగా క్లిష్టాసీనుఁడయ్యెను. అతని వాగ్ధాటి హేమాద్రిరెడ్డికి వజ్రఘాతమైనది. మనసు నొచ్చుకొనెను. మాఱు మాటాడక మౌనముద్ర దాల్చి సమీపమున పరాఙ్ముఖుఁడై కూర్చుండెను. మరల కృష్ణనాయకుఁ డారంభించెను.

'అదృష్టవశమున మనకు కులవిచక్షణ పుంటపడినది. వర్తమానమున మనము బావమఱఁదులమే కాని ఇఁక మన సంతానమైన కాత్యాయనీ రుద్రనాయకులకు కళ్యాణము చేయవలసినవారము. మన మధ్యను పాత సమస్య లేకపోలేదు. కాని తోకొట్టఁబడినది. అందుకు నేనేమియు అనను. ఆ తాయపనాయకుని అడుగుజాడలలో నీవు మెలఁగుట వాని మెప్పునకై నీవు శివభక్తుఁడవగుట నాకు నచ్చని విషయములు. ఆ తాయపనాయకుఁడు నాకు పరమశత్రువు మహాపాపి. వాఁడు కారణముగ నాకు వెఱ్ఱిపెంగలివలె గొంగళి సామ్యమైనది. కాకున్న గజసాహణి బిరుద పదవి నాకు లభించెడిది. అప్పుడు ప్రభుప్రశంసలు నేనును పొందెడివాడనే। అది యటులుండఁగా విద్యాలయమునకు వీసముపాటి చేసెడివాఁడను. ఇంతఁగా విద్యాలయము హీనస్థితిలో నుండకపోయెడిది. సర్వసమర్థులు సమస్కంధులు అయిన విమలకీర్తు లీ విధముగా నేఁడు విద్వేష విలయ విజృంభణలో వినాశమగుట ఎవ్వరికిని అవాంఛనీయమే।' అని కృష్ణనాయకుఁడు ఉద్ఘాటించెను.

హేమాద్రిరెడ్డి బదులు పలుకలేదు. ఎట్టి వికారము నాతని మోమున ప్రకటితము కాలేదు. అది గమనించిన కృష్ణనాయకునకు ఆగ్రహావేశము కలిగెను. కాని అణఁచుకొనెను.

"మొన్నటి సభాసమాచారము చూచితిరికదా। జాంఘాలిక వృత్తాంతము ప్రాయికముగ మీకు విశదమై యుండును" అని సాభిప్రాయముగఁ జూచెను.

'రాజ్య సంబంధమైన రహస్య మెట్లు విశదము కాఁగలదు?' — హేమాద్రిరెడ్డి ఎట్లో ప్రశ్నించెను.

ఎంత రహస్యమైనను ఎప్పుడో ఒకప్పుడు బహిరంగము కాకపోదు '

ప్రభువుల రహస్యము ప్రకటమగుట దుర్ఘటము '

అన్యులకు నాకు మాత్రము కాదు "

హేమాద్రిరెడ్డి ప్రశ్నార్థకముగఁ జూచెను. కృష్ణనాయకుఁ డిట్లు చెప్ప సాగెను.

'మహారాజుగారి అంతరంగికులలో బ్రాహ్మణమంత్రి పోతన యొకఁడు కదా! ఆయనకు అగ్నిహోత్రియయనులు ఆత్మబంధువు. యయనులుగారు మాకు కుటుంబ మిత్రులు. పోతన మంత్రిగారి యయనులగారి సంబంధము మనవంటిదె. అనాఁటి జాంఘాలిక వృత్తాంతము ఆ విధముగ నాకు విశదమైనది. జరిగిన దొకటి రాజోద్యోగులకు చెప్పని దింకొకటి. అద్దంకి పాలకునిపై దండయాత్రకు రాజకీయ కారణముకంటె మతవిషయకమైన హేతువు ప్రబలమైనది. అద్దంకి పాలకుని పేరు ప్రతిష్ఠయు జగద్విఖ్యాతములే. ఆయన శాలంకాయన గోత్రుఁడు. చక్రనారాయణ బిరుదాంకితుఁ డయిన మాధవదేవుని కీర్తిచంద్రికల మహీరసము పూయుటే కాకతీయ ప్రభువుల అపార కృపారసదృష్టి.

ఏమది?"

'ఏమున్నది? ఎవరో దుండగులు మన ప్రభువులు మోటుపల్లి రేవునకు పంపిన బండ్లను దోచికొనిరి. అది మాధవదేవుని రాజభటులు అర్థగించి చేసిన అల్లరిగా మన ప్రభువుల నిర్ధారణ. మీదుమిక్కిలి ఆ దుండగులు ఎగుమతి సరకులను సర్వనాశనము చేసినది చాలక శేషపదార్థములను అద్దంకి పాలకుని అధీనము చేసిరని మన జాంఘాలికుల కల్పనను వారు వార్త మోసికొని వచ్చిరి. అది వీపున కట్టుకుని గజసాహిణింగారు గణపతిదేవచక్రవర్తిగారికి నిండు సభలో భద్రముగా అందిచ్చిరి. ఫలితము సభ ముగింపు. అమాత్యశేఖరులతో అంతరంగికులతో చక్రవర్తిగారు రహస్యమందిరమునకు విచ్చేసిరి. మంతనములు సల్పిరి. తుదకు అద్దంకి పాలకునిపై యుద్ధము ప్రకటింప నిర్ణయించిరి. ఏకగ్రీవముగ నందఱు దండయాత్రకు సిద్ధపడిరి. ఇంతటను మూలకారణము అద్దంకి పాలకుఁడయిన మాధవదేవుఁడు వైష్ణవమతావలంబి యగుటయే!'

"కాదు. మాధవదేవుఁడు విష్ణుపీఠుఁ డగుట మాత్రమే. సామంత నృపుల తిరుగుబాటును సమాప్తి లజాఁచుటన్నది అపరిహార్యము. ఈ క్లిష్ట దినములలో అత్యావశ్యకము.'

క్లిష్టదశ ఏమి వచ్చినది?"

ఆధ్యాత్మిక సంపత్తికి ఆర్యావర్త మాలవాలము. దివ్యాతిదివ్యమైన హిందూమతమున కిది పరీక్షాసమయము. మహమ్మదీయులప్పుడే ఉత్తర భారతావనిలో ఉక్కిఱి గట్టికొనిరి. దక్షిణభారతము వారివలని ప్రమాదమునకు ప్రతిక్షణము భయకంప మందుచున్నది. ఇట్టి సమయములో సామంతనృపులు

తిరుగుబాటు చేసినచో అంతఃకలహములు పెచ్చుపెరిఁగి రాజ్యము సులభముగా అన్యాధీనము కాఁగలదు పరాధీనత యెంతయు గర్హ్యము సామంతరాజులను అనుకూలురను జేసికొనుటయో అణఁచివేయుటయో సామ్రాజ్యాధీశ్వరుల అవశ్య కర్తవ్యము ఉపేక్ష వహించిన కాకతీయ సామ్రాజ్యముయొక్క ఉనికియే ఊహ కాఁగలదు దక్షిణభారతము తురుష్కాక్రాంతము కాకుండ కాపాడవలసిన బాధ్యతకలవారు కాకతీయప్రభువు లొకరే ప్రథమగణ్యులు।

అది ప్రధానామాత్యులు వల్లెవేయించిన పాఠము

రాజ్యవిస్తీర్ణ ప్రయత్నమిది కావచ్చునేగాని ఎంతమాత్రము వైష్ణవ మతవైరము కాదని నా నిశ్చయము

' అది మీ అపభ్రమ

అని ఖండించిన అనఁగలిగినది లేదు

అక్కరయు లేదు వైష్ణవ ద్వేషము ప్రతిఘటనార్హము కాదనుట వీరశైవ మతావేశ విజృంభణమే।

'కావచ్చును కాని ఇది కానిసమయము

ప్రభుపక్షపాత మటులు పలికించుచున్నది కానిమ్ము ఏమైన నేను తగిన చర్యలు తీసికొందును

ఏమి చర్యలు ?

అర్ధంకి పాలకునకు అండదండగా నిలిచి—

' రాజద్రోహము

కృష్ణనాయకుని అర్ధోక్తిలో ఖండించి హేమాద్రిరెడ్డి లేచెను దెబ్బతిన్న పామువలె కృష్ణనాయకుఁడును కస్సున లేచెను

'బాగుగా ఆలోచించునది మన యిద్దఱిపైన ఎల్లల భావిజీవితములు ఆధారపడియున్నవి నిశ్చితాభిప్రాయము ఎదలను అందుకు మీ సాహాయ్యము ఆపేక్షించితిని శైవమత ప్రాతికూల్యము నా భావముకాదు వైష్ణవమతము నకు జరుగుచున్న అన్యాయము నెదుర్కొనుటే నా సంకల్పము అహర్నిశలు కృషిచేసి అది సాధించి తీరెదను ఆని నిష్కర్షగా కృష్ణనాయకుఁడు పలికెను

దుస్స్వార్థము దుస్సహము '

హేమాద్రిరెడ్డి ఖండితముగ చెప్పెను

'ప్రభువులు పరమేశ్వర పట్టాభిషేకములు సేయుట సుస్వార్థమా? "

హేమాద్రిరెడ్డికి సమాధానము తోచలేదు

"ప్రభువులనుబట్టి ప్రజలు।

కృష్ణనాయకుఁడు మరల వక్కాణించెను

'ఏమైనను రాజద్రోహము రాజద్రోహమే కాకతి గణపతిదేవ చక్రవర్తిగారికి మత సమన్వయదృష్టి కలదు ఏకమతావలంబులని గర్హించుట సాహసము

అవును సాక్ష్య మీ శిథిల విష్ణ్వాలయమే।'

కృష్ణనాయకుని తీవ్ర సమాధానమునకు హేమాద్రిరెడ్డి ప్రాణము కటుక్కుమనెను జీర్ణావస్థలోనున్న దేవాలయము నొకసారి పర్యాలోకన చేసెను ప్రభు నిరాదరణపాత్రమై విష్ణ్వాలయ మెకఁడేల దురవస్థపాలయ్యెనో హేమాద్రిరెడ్డికి దురవగాహమయ్యెను జన్మదినోత్సవ సందర్భ ప్రదాన ప్రకటన మాటికింతకు వచ్చెను అయినను హేమాద్రిరెడ్డి హితోపదేశమునకు సిద్ధపడెను

అద్యతన దేశకాల పరిస్థితులు పరిశీలించినచో అంతర్విభేదములు అతిప్రమాదకరములు స్వల్పవిషయ స్పర్ధలమైనచో ఆత్మహీనుల మగుదుము పర్యవసానము దుఃఖావిల మగుటేగాక స్వదేశము మహమ్మదీయుల వశమగు భయము లేకపోలేదు కనుక—"

"పరమత జాతులయిన ప్రభువులకు పట్టాభిషేకము చేయమందురా? అని తీవ్రముగ కృష్ణనాయకుఁడు ప్రశ్నించెను

హేమాద్రిరెడ్డికి గుండెలో రాయిపడెను గుటకలు మ్రింగుచు మీనమేషములు లెక్కపెట్టుచు ఇంటివంకఁ జూచుటే గత్యంతర మయ్యెను కృష్ణనాయకుని పృచ్ఛా గర్జనమువలె పశ్చిమదిశాతటమున ఎప్పుడు గూడుకట్టెనో కాలజీమూతము ఘర్ఘరించెను

'ప్రొద్దు వోయినది మబ్బులు ఎట్టుచున్నవి ఇంటికి పోదము' అని హేమాద్రిరెడ్డి భయోత్పాదక స్థితిని తేటపఱచెను కృష్ణనాయకుని మోము నల్లఁబడెను దీర్ఘశ్మశ్రువులు ధిక్కారముద్రలవలె నిగిడెను తెప్పవాల్పని అతని చూపు బాణాగ్రనిశితమై హేమాద్రిరెడ్డి మోమున గాటముగ నాటుకొనెను నిర్జీవ ప్రతిమవలె రెడ్డి నిలఁబడిపోయెను

కృష్ణనాయకుఁడు గాఢశ్వాసము వదలి 'పద' అని కఠినముగ పలికెను ఆ రెండక్షరములమాట ఉచ్చరించునెడ అతని ముఖము పైకిని క్రిందికిని ఊఁగి శీఘ్రగతి నతివ్యాప్తమయ్యెను అట్లే అతఁడు కాలు కదిపెను హేమాద్రిరెడ్డి మెల్లగా కదిలెను విభిన్న హృదయములు విప్రతిపన్న

విషయ విషమములై నిగూఢ విలయతాండవ కేళీ నిర్భరములై వ్యత్యస్త ప్రత్యయ సమర్థన ప్రచండ తరోష్మలతాపాణింధము ధురంధరములై, నగచ్ఛేదిత నదీస్పృథఝ్ముఖ పృథుల ప్రవాహ శయ్యాంతర ఘూర్ణమాన భయద ఘోషములై ఉభయులు రహోవేదనల గృహోన్ముఖులయిరి

౨

మునిమాఁపువేళ అసూర్యంపశ్యయైన రజనీకుమారి అదృశ్యాంతఃపురమును వీడినది నిండు చూలాలివలె నీలాలనింగి నిర్భర ప్రావృడంభోధర భారభరాయాస నిర్ఘాత ఝంఝానిల నిస్స్వానయై నిద్రితవైనది వీరభద్రాలయములో మందిరాళిందమున స్నేహదీపిక అలఁతికాంతులు ప్రసరించుచున్నది ఆవెలుఁగులో భాస్కర భట్టారకులు వ్యాసపీఠముపైనున్న తాళపత్ర గ్రంథమును తదేక ధ్యానముతో పఠించుచుండిరి ఆ బ్రహ్మవర్చస్వ విశాల ఫాలము ప్రతిక్షణ విజృంభితాక్షర ప్రభారాగ పంక్తులలో మఱింత ప్రకాశించుచుండెను ఆయనకు చేరువలో యథావాక్కుల అన్నమయ్య ఆసీనుఁడయ్యెను అన్నమయ్య ఏదో ఆలోచనలో మునిఁగెను వారికి సమీపములో రుద్రనాయకుఁడు ఉపవిష్టుఁడయ్యెను

భాస్కర భట్టారకులు బ్రాహ్మీపుంభావమూర్తి షట్ఛాస్త్ర నిష్ణాత వేద వేదాంగ పారంగతుఁడు ఒక్క మాటలో చకిత విద్యాకలాపాధోరాశి దిగ్దంతులవంటి పండితప్రకాండు లెందఱికో ఆయన గురువు అదృష్టవశమున రుద్రనాయకుఁడు భట్టారకుని శిష్యుఁడు భట్టారకునకు రుద్రనాయకుఁడనిన అపారమైన ప్రేమ అది కేవల శిష్యవాత్సల్యమే కాదు పుత్రవాత్సల్యముకంటె మిక్కుటము రుద్రనాయకునకు పాఠముచెప్పు టనిన భట్టారకునకు ప్రత్యేకాసక్తి భాస్కరభట్టారకుని సమ్ముఖములో రుద్రనాయకునకు శాస్త్రపాఠానుభవముకూఁడ బ్రహ్మానంద సబ్రహ్మచారియే రుద్రనాయకుఁడు పాఠమునకు వచ్చుట క్షణమాలస్య మయినచో భట్టారకులు తల్లడిల్లిపోవుదురు భట్టారకునివద్ద కావ్యపఠనము రుద్రనాయకునకు కాత్యాయనీరూప సాక్షాత్కారము ఆ గురుశిష్యుల వింత అనుబంధము ఎందఱికో ఆనంద సంధాయకము కొందఱికో ఈర్ష్యాహేతువు ప్రథమశ్రేణిలో యథావాక్కుల అన్నమయ్య ప్రథముఁడు అన్నమయ్య తానుగా విద్వత్కవి అయినప్పటికి భాస్కరభట్టారకుని సాన్నిధ్యము సరస్వతీసాన్నిధ్యముగా భావించును భట్టారకు లెప్పు డెంతటి ప్రౌఢపాఠము చెప్పినను ఏదియో క్రొంగ్రొత్త విశేషమునుండి తీరుననియు, ముఖ్యముగా రుద్రనాయకునకు కావ్యపాఠము చెప్పునపుడు తప్పనిసరిగా భట్టారకుని సమక్షములో నుండవలెననియు అన్నమయ్య ఉద్దేశము ఉత్కంఠరము

రుద్రనాయకుఁడు కావ్యముల పఠించెను అలంకారశాస్త్రములలో ప్రభుత్వము సంపాదించెను వ్యాకరణము కరతలామలకమైనది అయినప్పటికి తనివితీరక భట్టారకునివద్ద సంస్కృత నాటకములు చదువసాఁగెను అభిజ్ఞాన శాకుంతలము పూర్తికావచ్చినది భరతవాక్య వివరణకు భాస్కరభట్టారకుఁడు యత్నించునంతలో రుద్రనాయకుఁడొక విలక్షణమైన ప్రశ్న వేసెను

'శకుంతల కణ్వాశ్రమములోవలె ప్రేమహృదయి కాదు మారీచాశ్రమమున మాతృహృదయి మాత్రమే। ఇఁక దుష్యంతుఁడన్నచో నిరసనదోష దూషితుఁడు ఇద్దఱిమధ్య పెద్ద అఖాతమున్నది అట్టి వియుక్తజీవులకు చిరకాల వియోగానంతరము ఆకస్మిక పునస్సమాగమము అంత తేలికగా సంభవమా? అన్నది రుద్రనాయకుని ప్రశ్న

అది చిలిపి ప్రశ్నగా అర్థములేని విషయముగా అన్నమయ్య భావించెను ఎంత చిలిపి ప్రశ్నయైనను మఱెంత కొంటెకోణంగి ప్రశ్నయైనను రుద్రనాయకుఁడు అడిగినచో భాస్కరభట్టారకునకు అపరిమితానందము అదొక పాతాళప్రశ్నవలె తానొక పార్థివమూర్తియై తర్కగాండీవము సంధానించి సమాధానగంగను ప్రసాదించనిదే భాస్కరభట్టారకునకు తృప్తియుండదు కాని ఆయన సమాధానమిచ్చుటకు ముందు అక్కడెవ్వరైన నున్నచో వారివలన సమాధానము రాఁబట్టించుటకు ప్రయత్నించును అది భట్టారకునకు విలక్షణ విద్యావినోదము ఒక్కొక్కప్పుడది ప్రక్కనున్న వారికి ప్రమాదము కలిగించకపోదు అన్నమయ్యకు అంతటి అవస్థ తటస్థపడినది తానుమాత్రము మఱొక శాస్త్రసంబంధమైన తాళపత్రగ్రంథ పరిశీలనలో నిమగ్నుఁడయ్యెను రుద్రనాయకుఁడు జ్ఞానముముక్షువుగా మూఁగ పాంచాలికవలె నుండెను

యథావాక్కుల అన్నమయ్య ఇట్లు చెప్పెను——

'అయఃఖండము అరుణారుణముగా అగ్నిలో కాల్చినఁగాని అభినవము సుదృఢము కానట్లే విరహాగ్నితప్తముకానిదే ప్రేమహృదయము పరిష్కృతము పటిష్ఠము కాఁజాలదు విరహ మొక్కటే ప్రేమకు నికషోపలము

అది విని భాస్కరభట్టారకుఁడు సాభిప్రాయముగ రుద్రనాయకునిఁ జూచిరి రుద్రనాయకుఁడు అన్నమయ్యవంక దృష్టి మఱల్చెను అంతలో అగ్నిహోత్రిదయనుఁడు అచటికి వచ్చెను ఉన్నట్టుండి ఆకాశము ఉఱిమెను ఆ ధ్వనికి ఆలయము కదిలినట్లయ్యెను రుద్రనాయకుఁడది గమనించలేదు

మీరు చెప్పినది నిజమే కాని ప్రశ్నోచిత సమాధానము కాదు నా ప్రశ్న ఆకస్మికముగానైన విభిన్నహృదయుల పునస్సమాగమము గుఱించి

మీరు చెప్పునది విరహప్రాముఖ్యమేకదా। అని రుద్రనాయకుఁడు పలికెను

'పాదుకాలము ఎదప బుద్ధుఁడు అందఱికి ధర్మసందేహములే। అన్నియు శాస్త్రసమ్మతములే। సంప్రదాయ బద్ధములే।' అని అగ్నిహోత్రచయనులు రుద్రనాయకునిఁజూచి గొంతుకవిదళించి గోంత్రించెను

భాస్కరభట్టారకులు నిమేష మాత్రము దృష్టి నిలిపిరి మఱల ఆశాతటమున ఉఱుము వినఁబడెను ఉన్నట్టుండి ఉఱుములు ఉధృతము లయినవి దూరదిశాముఖమున కాలజీమూతనిష్ఠ్యూతమై దంభోళిపాతము జరిగినట్లు విశదమైనది అగ్నిహోత్రచయనుల ముఖమున ఆగ్రహావేశ మింకను తాండవమాడుచున్నది యథావాక్కుల అన్నమయ్య మౌనవ్రతము దాల్చెను భాస్కరభట్టారకులు శిష్యునిఁ జూచిరి వాతావరణము భీతావహముగ నున్నది ఝంఝాప్రభంజన శంకావహము నీవిఁక జాగుసేయక జాగరూకుఁడవై ఇంటికి వెడలునది భద్రముసుమా। అనిరి

రుద్రనాయకుఁడు తలపంకించి తన తాళపత్ర గ్రంథములు తీసికొని లేచెను గురుదేవునకు ప్రాంజలిఘటించెను యథావాక్కుల అన్నమయ్యకు నమోవాకము అర్పించెను అగ్నిహోత్రచయనులకు సహితము అభివాదము చేసి అటనుండి నిష్క్రమించెను

యథావాక్కుల అన్నమయ్య మౌనము మానలేదు భాస్కరభట్టారకులు మఱల శాస్త్ర గ్రంథ పరిశీలన కుపక్రమించిరి అగ్నిహోత్రచయనులు అట్టుడికి నట్టుడికి పోవుచుండెను హఠాత్సంభూతములైన వజ్రఘట్టన భీషణ ధ్వనులతో మేఘావృత నభోవీధి భయదబీభత్సమైనది అగ్నిహోత్రచయనులు మఱల ఆరంభించెను

'ఆచారపరాయణు లనుకొంటిని భాస్కరభట్టారకులవారింతటివారనుకో లేదు సాహిత్యరహస్యములు శాస్త్రమర్మములు నిఁకఁ జెప్పవలసినది శూద్రులు కాఁబోలు। ఈ కుట్టకుంక మహాపండితుఁ డగును దేశము మండిపోవును ఇప్పటికే సాహిత్యము సన్యాసాశ్రమ స్వీకారము చేయుచున్నదని నా బాధ ఆ శివకవు లెక్కడ దాపురించిరో। ఆంధ్రసాహిత్య మడుగంటుచున్నది సంస్కృతవాసన సోఁకరాదఁట। అప్రాచ్యులు। గీర్వాణభాష దేవభాష యని ఎఱుఁగరు కాఁబోలు। సంస్కృతచ్ఛందస్సులే స్వీకార్యములు కావఁట। నయమే। ఛందోవిద్వేషులు కాలేదింకను ద్విపదకే ఇహపరములను ద్విపదములఁట। అహా। మార్గకవితామార్గము కంటకావృత మహారణ్యమై పోయినది నేఁటికి అందఱికి తెలియునట్లు అచ్చతెనుఁగులోనే కావ్యములు వ్రాయవలెనఁట।— ఏమండీ। అన్నమయ్యగారూ। మీరుండికూడ మాటాడరేమి' అని అన్నమయ్యవంక తీవ్రముగ చూచెను

'భవిజన సమాదరణ సంభాషణాది సంసర్గము పాపహేతువుగా భావించు వారి నెవ్వరు హర్షింతురు? అని మాత్రము యథావాక్కుల అన్నమయ్య జవాబిచ్చెను

'అవునుకదాంతే నేఁడు పెచ్చు పెరిగిపోవుచున్న నాస్తిక మతముల కారణముగ ఆర్షమతము నాశనమగుటలేదా? జైన బౌద్ధముల జైత్రయాత్రకు వీరశైవమత విలయతాండవమునకు అనాదిప్రసిద్ధమైన ఆర్యమతము అన్యాయముగా సర్వనాశన మగుచుండ అభిజ్ఞులెవ్వరు చూచుచు ఊరుకొనరు శక్తియుక్తులు ప్రయోగించి సనాతనమత సముద్ధరణము కావించుకొందురు" అని తీవ్రముగ చయనులు అందుకొనెను

భాస్కరభట్టారకులు మెల్లగ ఇట్లనిరి

"పురుషకారము శాస్త్రమున చెప్పఁబడినదే కాని అది దైవనిర్ణయాతీత మనుకొనుట దురహంకారము కాక ఆదిమధ్యాంతరహితుఁడైన ఆ భగవంతుడే సృజించిన ఆర్షమతము ఎవ్వ రెన్ని ప్రయత్నములు చేసినను మాయమగునదియు కాదు ఉద్ధరింపఁబడునదియు కాదు జైనాదీతరమతము లన్నియు బౌద్ధమతసంతానములే! ఆర్ష బౌద్ధముల అన్యోన్య సమరము మానవప్రయత్నమున మానిపోవునది కాదు దైవికముగనె ఆర్షమతము స్వీయౌన్నత్య సిద్ధాంతసముపేతముగా సర్వజనులకు శిరోధార్యము కాఁగలదు అదియే శుభోదర్కము'

దైవము దైవమని పురుషకారము వదలినచో సర్వభ్రష్టుల మగుదుము ఆర్షమతము క్షణములో నామరూపరహితము కాఁగలదు అని మరల అగ్నిహోత్రిచయను లనెను

అంతవఱకు ఆకాశమువంక దృష్టి ప్రసరించిన అన్నమయ్య చివాలున లేచి భట్టారకులుగారూ! వర్ష మారంభమైనది ఉండుకొలఁది ఉద్ధృతమగు సూచనలే కానవచ్చుచున్నవి" అనెను

భాస్కరభట్టారకులు దిశావలోకనముచేసి 'నిజమే' అనుచు వ్యాసపీఠమును దీసి భద్రపఱచి తాళపత్ర గ్రంథమును తాళచ్ఛత్రమును పరిగ్రహించి—

'చయనులుగారూ! మీరు లేవరేమి? అని ప్రశ్నించిరి

'వచ్చెదను మీరు నడువుఁడు'

చయనులు నిష్కర్షగ చెప్పెను భాస్కరభట్టారకులు బయలుదేరిరి యథావాక్కుల అన్నమయ్య అనుసరించెను

అగ్నిహోత్రిచయను లక్కడే యుండెను

భాస్కరభట్టారకు లెంత నిగర్వచూడామణియో చయను లంత అహంకారి అన్నమయ్య ఎంత నిరాడంబరజీవియో అంత దాంభికుఁడు అంతేకాదు అగ్నిహోత్రచయనుఁ వసపిట్టవలె వాచాలుఁడు విద్యావిహీనుఁడే కాని అసమగ్రవిజ్ఞాన మహోద్రేకి ముక్కోపి మీఁదుమిక్కిలి తంత్రజ్ఞుఁడు కృష్ణనాయకుఁడు హేమాద్రిరెడ్డికి చెప్పినప్రకారము రాజమందిర రహస్య వృత్తాంతము స్వీకరించిన దిట్ట అర్షమతోన్మాది తదర్థము రాజకీయమైన మార్పును కోరి కుట్రలన్నిటిలో కుయుక్తు లెల్లెడలో అందెవేసిన చేయి అర్దంకిపాలకునిపై కాకతీయ గణపతిదేవచక్రవర్తి ప్రకటించిన యుద్ధములో కృష్ణనాయకునకు ఒక క్రొత్త పాత్ర నిచ్చెను ఆ పాత్ర రంగప్రవేశము చేయుటకుముందు హేమాద్రిరెడ్డి సూత్రధారియగుట ఆవశ్యకమని యెంచి అందునిమిత్తము కృష్ణనాయకునే నియోగించెను ఆ సమాచారమేమైనది తెలిసికొనుటకు వీరభద్రాలయమున కిప్పుడు విచ్చేసెను వీరభద్రాలయము భాస్కరభట్టారకునకు విద్యానిలయమైనది అగ్నిహోత్రచయనులకు సంకేతస్థలమైనది కృష్ణనాయకునికోసము నిరీక్షించుచు అగ్నిహోత్రచయనులిట్లు తలపోయసాఁగెను—

'ఇంకను రాఁడేమి వీఁడు ? ఎన్నివిధములుగ హెచ్చరికచేసితినో ! 'నీవు సామాన్య నాయకుఁడవు కావు నాయకవంశ నాయకమణివిరా ! అంటిని నీ జాతకచక్రమున రాజయోగము కలదని రుద్రనాయకునకు మహారాజయోగమే పట్టనున్నదనియుఁ' జెప్పితిని చెప్పినమాట వినువాఁడే ! ఇంకను రాకున్న హేతువేమో !'

పరిపరివిధముల తలపోయుచు అగ్నిహోత్రచయనులు ఆలయప్రవేశ ద్వారమునకు దృష్టి అంకితముచేసెను

'అయ్యా ! చయనులుగారూ ! మే మిండ్లకు పోవుచుంటిమి ఆలయమునకు తాళము వేయవలెను అను మాటలు వినఁబడి చయనులు వెనుదిరిగి చూచెను గృహోన్ముఖులయిన అర్చకులు కనబడిరి విసుఁగుకొనుచు అగ్నిహోత్రచయనులు ఆలయమువీడి బైటకి వచ్చెను అర్చకులు ఆలయద్వారములు మూసి వెడలిపోయిరి ఆలయప్రాంగణములోనె అగ్నిహోత్రచయనులుండెను అంతకంతకు వర్షము హెచ్చ వాతావరణ మేర్పడసాగెను ఇంటికి పోద మింక అనియు రాకపోఁడు నా మాటప్రకారము అనియు గాలిలోని దీపమువలె తబ్బిబ్బు లగుచుండెను

వర్ష మధికమైనది చేయునదిలేక చయనులు ఆలయము అరుగుపై నిలఁబడెను అంతలో కృష్ణనాయకుఁడు తడిసిన బట్టలతో అచటికి వచ్చెను అగ్నిహోత్రచయనులకు ప్రాణము లేచివచ్చినది

ఏమోయి నాయకమణీ! నీకు తెలియుటలేదుగాని గత బహుధాన్యలో గజసాహిణివి కావలసినవాఁడవు ఆ జాయపనాయకుఁ డెవఁడోయి? అనెను

ప్రభువులకు ఆత్మబంధువు ఉత్తమ క్షత్రియకులసంజాతుఁడేని కాదు అయ్యవంశీయుఁడఁట। కృష్ణాముఖద్వారప్రాంతమున వారు పాలకులు జాయపనాయకునితండ్రి నారయ్యయఁట ఆయన రాజ్యము ఒక పెద్ది గ్రామముపాటికాదు ఏమైననేమి కాకతీయవంశమువారికి ఆప్తులయిరి నారయ గారి కుమార్తెలు నారమ్మ పేరమ్మగార్లు పట్టమహిషులయిరి జాయపనాయకుఁడు రాజుగారి బావమఱఁది గజసాహిణికాక గగనసాహిణి కూడ కాఁగలఁడు

ఓయి ఎచ్చివాఁడా! అది నీ ఉపేక్షవలన సరే విచారించి గతజల సేతుబంధనము ఇంతకు నీకు అదృష్టలక్ష్మి అదృశ్యమైనది అయిననేమిలే! ఆజాయపనాయకుఁ డెంత రాజుగారి బావమఱఁదియైన మనకున్న బలము మన కున్నది సమయము మించిపోలేదు నీ కొడుకు రుద్రనాయకునికి పట్టాభిషేకము తప్పదు చంద్రగుప్తునకు చాణక్యుఁ డెట్లో రుద్రనాయకునకు నే నట్లు నే చెప్పినప్రకారము హేమాద్రి రెడ్డితో మాటాడితివా?"

మాటాడితిని ఏమిలాభము? కొఱుకుపడని కొయ్య

ఓహో!— సరే!— మార్గాంతరము లేకపోలేదు '

మార్గాంతరమా?

'అవును మహారహస్యము ఇక్కడెందులకు? మాఇంటికి పోదము వర్షమింకను జోరుగనున్నది

ఇదేమి వర్షము? కుంభవృష్టి కురియవలెను కురిసితీరును ఏండ్లు పూండ్లను ఏకరువుగాక పోవు నాయకమణీ! చయనులు అపరచాణక్యుఁడే! తెలిసినదా? పర ఆస్వాదమృతమ్ విషమ్

ఆ వానలోనె అగ్నిహోత్ర చయనులు కృష్ణనాయకుఁడు బయలుదేరిరి

౬

రాజప్రాసాదము చెక్కుచెదరని చెక్కడములతో చెన్ను మీఱినది సింహద్వారము వాలఱాఁతి ద్వారబంధములతో పాలవెల్లివలె నున్నది సౌత్యగ్రపుష్పవల్లికలు రంగవల్లికలవలె విన్యస్తములు లేఁజాబిల్లి వెలుఁగు జాలున జాలువారు ఆ గడపలవలె అనేక రమణీయ శిల్పముద్రలు ముచ్చట గొలుపు గోడుఁబల్లఁగా అమర్చిన గండశిల క్రిందిభాగమునఁ గల శిల్ప విన్యాసము అతిలోక మనోజ్ఞము నలుకెలంకుల ద్రాక్షగుచ్ఛములు నోటఁ గఱచుకొన్న కీరదంపతులను తీర్చిరి అటు నిటు అన్ని ఫలజాతుల మేలి అచ్చులు చెక్కిరి మధ్యను రత్నమాణిక్యములు పొదిగిరి వాని కుదురున

చిన్ని చిన్ని జీబులు కూర్చి చుట్టును చేమంతిదళములు చికిలిచేసిరి ఆ దృశ్యము కాకతీయసామ్రాజ్య ప్రాభాత శోభాప్రభవ ధిక్కారమునకు దిక్కాంత తారక చంద్రహారధారిణియై తదంతరమున దాఁగినట్లనిపించును

సింహద్వారమునొద్ద సింహకిశోరములవలె రాజభటు లిరువురు విచ్చు కత్తులతో పారా కాయుచుండిరి రాజసేవకుఁ డొకఁడు పంచకళ్యాణిగుఱ్ఱమును ప్రాంగణమునకుఁ దీసికొనివచ్చెను ఆ వెనుక అశ్వారూఢుఁడై వృద్ధుఁడొకఁడు వచ్చెను అతఁడు జన్మదినోత్సవ సందర్భమున యువరాజును ఎచ్చిగాఁ జూచిన వృద్ధ రాజభటుఁడు కొంతసేపటికి రాజప్రాసాదమునుండి బాలభానువువలె నొక వ్యక్తి బైటికి వచ్చెను ద్వారపాలకులు చేతులుజోడించి పైఁదొలఁగిరి ఆ వ్యక్తి ఎవరో కాదు ఆనాటి యువరాజే। సరాసరి జవనాశ్వమును సమీపించెను రాజసేవకుఁడు అశ్వము నాయత్తపఱచి జూలువిదిల్చి చెంత నిలిచెను ఆ యువరాజు అశ్వారోహణ చేసెను చెణుకు ఝళుమన్నది వెంటనే హయహేష దిగ్గోళ విధ్వస్తమయ్యెను తృటిలో యువరాజు తురంగము దూసిఁగైనది ఆ గుఱ్ఱమువెనుక వృద్ధ రాజభటుని అశ్వము దౌఁడుతీసినది వారి కెదురుగా అశ్వారూఢుఁడైన మఱొక వ్యక్తి వచ్చెను ప్రఘాణతలమున అతఁడాఁగెను అశ్వారోహణము చేసెను రాజసేవకుఁ డా అశ్వమును ప్రక్కకుఁ దీసెను ఆ వచ్చిన వ్యక్తి జాయపనాయకుఁడు అతడు 'మహారాజులుఁగారికి మా రాక తెలియఁజేయునది అని ద్వారపాలకు నాజ్ఞాపించెను ద్వారపాలకుఁడు చేతులు జోడించి తలపంకించి లోనికి వెడలెను కొంతసేపఁటికా ప్రతీహారి తిరిగి వచ్చి ముదలయైనది అని తెల్పెను జాయపనాయకుఁడు రాజప్రాసాదములో ప్రవేశించెను ఏకాంతముగా దీర్ఘాలోచనలో మునిఁగి ఎందుచేతనో కించిత్ఖిన్నవదనుఁడై యున్న ప్రభువునకు భద్రేభదర్ప విలాసకర సముత్కీర్తన విధానముగా కయిమోడ్చెను

గణపతిదేవచక్రవర్తి గంభీరవదన మించుక వసివాడినది ఆలోచనా ధూమపటలి చిటిలి ఆయన మోమున నొక జ్వాల యెగసినది చక్రవర్తి దృష్టి నిశాంతత్య నిర్గమన మింకను ఛాయారూపము గట్టుచున్న ద్వారమార్గమువంకకె ప్రసరించుచున్నది 'సామ్రాజ్య విస్తీర్ణ ప్రయత్నములు వ్యర్థము అన్యరాజ మనఃఖేద ప్రతిపాదకములు మాత్రమే। అనవసరాయాస మను మాట లప్రయత్నముగ చక్రవర్తినోట గద్గదస్వరమున వెలువడెను

కాదు పవిత్రభారతావని పరాధీనము కారాదు మహోజ్జ్వలమైన కాకతీయమహాసామ్రాజ్యము దక్షిణాపథమును తురుష్కాక్రాంతము కానీయదు ఆ వింధ్య కన్యాకుమారము కాకతీయసామ్రాజ్యాధీశ్వరైకచ్ఛత్రచ్ఛాయాచ్ఛాదితము

కావలెననరే । సర్వదా కాకతీయసామ్రాజ్యము దేవేంద్రవైభవద్వైరాజ్యము" అని జాయపనాయకుడు ఉద్ఘాటించెను

గణపతిదేవచక్రవర్తి అరమోడ్పు కనుదోయితో జాయపనాయకునిపంక్తి దృష్టి ప్రసరించెను జాయపనాయకుడు నమ్రశిరస్కుడై కంపితస్వరమున ఇట్లు పలికెను

మహారాజులకు సంతాన సమస్య ఇట్లు సంతాపకారణమగు టెంతయు మాకు విచారకరము కాని మీ వంశవృక్షము నిష్ఫలము కాదని మాత్రము మా మనవి

కావచ్చు కాని చక్రవర్తి శిథిలజీవి శిలాహృదయుడు ముందు వెనుక లాలోచింపక మొండిధైర్యముతో అనాడట్లు ప్రకటించితిమి అబద్ధము కప్పిపుచ్చుకొనుటకు బ్రహ్మప్రళయ మగుచున్నది యథార్థవిషయ ప్రకటనమె చేసినచో ప్రమాదము వాటిల్లునని దురవల్లవలెన ఈ దురవస్థ కలిగెడిది కాదు

సిరసులు వారసులో స్వేచ్ఛలు మ్లేచ్ఛులో కాకతీయసామ్రాజ్యము కబళింతురనికదా అట్లునేను కల్పించినది

అదియే మనకు ఆంధ్రారా ప్రీతమైనది ఆ వృద్ధభటుని అనుకంప లేనిచో ఏమయ్యెడివారమో । ఘోరవ్యాఘ్రవిహార భూములయిన కాంతారములలో మృగయావినోదము రాజోచితమే కాని అందువలన పసిబిడ్డ కెన్నిపాట్లోకదా?'

'ఆ విషయమున జాగరూకత వహించితిమి అవసరమైన వసతులు కల్పించితిమి సర్వసదుపాయములతో మహారణ్యమధ్యమున నందనవనమె సృష్టించితిమి '

ఏమో । అంతయు అగమ్యము '

' అధైర్యపడవలదు అందరి బాధలు బాధ్యతలు నావి '

రహస్యము వెల్లడియగుచో ?'

అసంభవము '

జాయపనాయకుడీమాట వక్కాణించు సమయమున ద్వారము దగ్గఱ ఒఱనుండి కత్తిదూసిన శబ్దమైనది అనుక్షణమె వారిదృష్టి అటు ప్రసరించినది గుమ్మములో ప్రతీహారి ప్రవేశించి వీరోచిత వందనముచేసి దండలుకట్టి నిలిచెను గణపతిదేవచక్రవర్తి వానిని గాంచి పక్ష్మల సంచలనమాత్ర సంజ్ఞావిశేషమున ఆగమనహేతువు పృచ్ఛించెను ప్రతీహారి మఱల ప్రాంజలి ఘటించి ' జాయపనాయకులుంగారి దర్శనార్థము సేనాపతిగారు వచ్చిరి ' అని

చెప్పెను గణపతిదేవుఁడు కటాక్షవీక్షణమున అనుజ్ఞనిడెను జాయపనాయకుఁడు అటనుండి కదిలెను ప్రతీహారియు నిష్క్రమించెను

గణపతిదేవచక్రవర్తి గంభీరవదనము మరల విషాదమేఘావృతమైనది కాని ప్రయత్నపూర్వకముగా వికాస విద్యుత్ప్రభలు విరియఁజేసెను అంతస్సన్న నయనాంతరములలో నిర్వికార నిమీలనములు కష్టసాధ్యములైనవి చల్లని సముద్ర గర్భమున దాఁగిన చండప్రచండ బడబాగ్ని శిఖాగోళమువలె సమస్తైశ్వర్య సంపన్నుఁడైన సామ్రాట్టునకు దుఃఖహేతువైన సమస్యసహారము నిగూఢ దురవగాహమే।

జాయపనాయకుఁడు మరల రాజప్రాసాదము లోనికి వచ్చెను ఇప్పు డాతని వదనశ్రీ జాయమానసముత్సాహ జాగరితమైయున్నది నేత్రములు విస్ఫారితములైనవి హాసమరీచిక లాతని గండకపోలమున గిరికీలు కొట్టుచున్నవి

శుభవార్త మన సేనలు మాధవదేవు నోడించినవి అద్దంకి పాలకుఁడు మనకింక సామంతకోటిలో నొకఁడు మన సేనావాహిని విజయోత్సాహినియై మృత్యుకృతవైరి మృణాళములతో ముకుళిత పరిపంథి పద్మములతో గతరాత్రమున చైత్రరథయాత్రముగ జైత్రయాత్ర సాగించి వచ్చినది వీథివీథుల వీరవరుల విజయోత్సవములు చేసికొన సముత్సుకులై తమ అనుమతికి వేచియుండిరి అని గ్రుక్కత్రిప్పుకొనకుండ జాయపనాయకుఁడు పలికెను

మంచిది, సామ్రాజ్యభారవహులయినవారి ఆనందమునకు మా అభినందనము వీరవిజయోత్సవమున కిదే మా అనుజ్ఞ' అని గణపతిదేవ చక్రవర్తి మందస్మితస్మేరవదనుఁ డయ్యెను అనుక్షణమె జాయపనాయకుఁడు అనుజ్ఞాప్రకటనార్థము వెడలఁబోయెను గణపతిదేవచక్రవర్తి కనుసంజ్ఞమెయి వారించెను జాయపనాయకుఁ డాగెను భయసంకోచము లందెను కొంతవరకు గణపతిదేవచక్రవర్తి మౌనమె వహించెను జాయపనాయకుఁ డాందోళనపడ సాగెను కొంత తడవైన అనంతరము చక్రవర్తి 'కాంచీపురము కళింగ దేశము జయింపవలసియున్నది అనెను జాయపనాయకునకు ప్రాణము లేచివచ్చెను

'అవశ్యము '

జాయపనాయకుఁడు బదులు చెప్పెను

'మా కాంక్షితము సత్వరముగ కార్యరూపము దాల్చవలెను

మరల గణపతిదేవుని హెచ్చరిక జాయపనాయకుఁడు మాటాడలేదు ఇంచుక శీర్షము వంచెను

'సందేహ కారణము ?'

గణపతిదేవుఁడు ఎంహాగర్జనమువలె ప్రశ్నించెను అప్పటికిని జాయప నాయకుఁడు ప్రతి చెప్పలేదు గణపతిదేవచక్రవర్తి గంభీర మదేభ గమనమున ముందునకు వచ్చెను

ఇంతవఱకు కాకతీయ సామ్రాజ్యాధిపతులకు సందేహ పారము లెవ్వరును జెప్పలేదు ఎప్పుడును జెప్పఁదగనివియే అంతే కాదు సమర సన్నాహము కాకతీయ సామ్రాట్టులకు వియ్యంకుల ఎదిరింపు సన్నాహమని ఎఱుఁగరో ।—వెసుకంజన్నది వెలివేసితిమి

విజయదుందుభి నిస్వనములై వినఁబడిన చక్రవర్తి మాటలకు జాయప నాయకుఁడు తలయెత్తెను

విదిత పూర్వమైన విషయమునే పునరుద్ఘాటించితిరి నాకు కాకతీయ ప్రభువుల జయభేరీ నినాదములు సుపరిచితములే ; కాని—'

జాయపనాయకుని గొంతుక జీరవదెను ఎట్లో గొంతుక సవరించుకొని మెల్లగా కాలము కలిసిరానిది కార్యము ఫలప్రదము కాఁజాలదు అనెను

అమాంతము గణపతిదేవచక్రవర్తి జలద గంభీరస్వరమున విజయ యాత్రకు విఘ్నమై నాధారపడవలెనా ?' అని ప్రశ్నించెను

జాయపనాయకుఁడు స్మితముగ సమాధానమొసఁగెను

'అద్దంకివలె అవి అల్పరాజ్యములు కావు అంతేకాదు ప్రస్తుతము వర్షాకాలము శరదాగమముతో శరసంధానము లెస్స పులకాంకుర సుధా పూరములలో ఈదులాడుటకు వీరులకది తగిన సమయము అందాక వేచి యుండుట శ్రేయస్కరమని మా అభిమతము అని

గణపతిదేవచక్రవర్తి అంగీకారసూచక శిరఃకంపనము చేసె అయిన సైన్యము నధికసంఖ్యాక మొనర్చు ప్రయత్నములు జరిపించునది పంచశత పరిమితశతాంగములను సహస్రాధికము చేయవలెను శతసహస్రమదనాగ యూథములు ద్విగుణీకృతములు కావలెను అశ్వకోటి అసంఖ్యాకమగుట అవసరము అని చెప్పెను

జాయపనాయకుఁడు ఆజ్ఞావిధేయత ప్రకటించెను మఱల గణపతిదేవ చక్రవర్తి మందహాస పూర్వకముగా 'వీరవిజయోత్సవమునకు ఎమన్న సదుపాయములు కలిగించునది' అని జాయపనాయకుని ఆజ్ఞాపించెను సంజ్ఞా మాత్రముగ సంతోష ప్రకటనముచేసి చక్రవర్తిని వీడ్కొని జాయపనాయకుఁ డరిగెను

గణపతిదేవచక్రవర్తి మోమున గంభీరత మఱల ముద్రవైచుకొనెను తన్మేఘగంభీర ముద్రలో ఆనందవికాస విద్యుల్లతలు విరిసి అంధతమః పుంజములను రాల్చెను అకస్మాత్తుగ ప్రాసాదబాహ్యప్రాంగణమున పెద్దపెట్టున కోలాహలము వినవచ్చెను గణపతిదేవుఁడు వీనువొసఁగెను జయజయ ధ్వనులు ముహుర్ముహూ రచ్చరితములగుచున్నవి అది విజయశ్రీ సమపేతులయిన వీరవరుల ఆజ్ఞాప్రకటనాకీర్ణ మహానంద సంరంభముగ చక్రవర్తి గ్రహించెను

ఆహా! ఏమి వారి ప్రభుభక్తి పరాయణత! విజయగర్వ విలాసము! నిస్స్వార్థప్రభుసేవా తత్పరులయిన వీరేకదా ఈ బృహదాంధ్ర సామ్రాజ్య సౌధ మూలస్తంభములు! ఈ కాకతీయ సామ్రాజ్యాధీశ్వరుల దిగ్జయస్తంభ శంకుస్థాపన శిలాన్యాసము వారి విన్యాసము! మా కీర్తిచంద్రికల అమృతాంశువులు! వారి చల్లని చూపులే విశాల సామ్రాజ్య వైభవసూచక వరాహలాంఛన పతాకాంతర పరిదృశ్యమాన స్వచ్ఛతా విభూతి వారి ఉత్సాహ జలధితరంగ సంక్షాళన జన్య శోభాస్పదమే! అస్మాకీన రాజ్యానందరసవర్ధికి ఉద్దీపనాలంబనోభయ విభావములు వారలే!' —

ఆత్మగతభావోదయమున గణపతిదేవచక్రవర్తి అరవిందనయనములలో ఆనందమకరందములు తొణికిస లాడినవి

౩

కృష్ణనాయకుని గృహము ప్రాగభిముఖము సైనికవాటిక నడుచక్కినున్నది కెంపు లహరివలె ఇంటిప్రహరి శోణశిలాఫలక నిర్మాణము విశాలమైన వాఁకిలి యొక పూలవనమే! గృహద్వారము కట్టెదుట తులసికోట యున్నది దానికి చేరువలో పెద్దమల్లెపందిరి కలదు తూర్పు ప్రాకారమునకు చేరి వేఱొక ప్రత్యేకమైన శాల అదియే రుద్రనాయకుని చిత్రశాల గవాక్షద్వార ప్రసారితములగు మయూఖమాలిక లా శాలనుండి మందమందముగ వచ్చిన దారినే వింతగా తిరోహితములగుచున్నవి రుద్రనాయకుఁడు నిత్యవిధిగా శ్లోకములు కొన్ని కంఠస్థము చేయుటైనది తాళపత్ర గ్రంథమునను త్రాఁడు బిగించి తాటాకుపెట్టెలో నుంచెను వ్యాసపీఠము మడచి కవాటీ ఫల్లపై నిడెను అసంపూర్ణముగ నుండిపోయిన కాత్యాయని చిత్రపటము పూర్తిచేయ నెంచెను కుడ్యకోటరమున దాచిన ఆపత్రము బైటికి తీసెను వర్ణద్రవపాత్రలు వరుసగా నిడుకొనెను పఁటికుంచె వలుమఱు సవరించెను

చిత్రణము పూర్తిచేయవలెను సమగ్రముగా రసాకృతిఁ దాల్చిన చిత్రమును కాత్యాయనికి చూపించవలెను అదిచూచి కాత్యాయని ఆశ్చర్య

పడవలెను ఆనందరసాబ్ధిలో మునిఁగి తేలియాడవలెను అదియే తన కళాసేవకు సాఫల్యము అప్పుడే తనజన్మ ధన్యము ఈవిధముగా రుద్రనాయకునిలో కొన్ని ఊహలు జనించినవి అర్ధరచిత చిత్రపటమువంక నతఁడు దృష్టినిలిపెను నిష్ప్రత్యూహము నిమిత్తము పరమేశ్వరుని ధ్యానించెను ధ్యానసమాధి మెల్లఁగా భావసమాధి యైనది రుద్రనాయకుని మనోవీధిలో కాత్యాయని చిఱునవ్వులు చిందుచు మూర్తి కట్టినది సప్తవర్ణ స్యందన మారోహించినట్లు కల్పతరుశాఖాలంబ కదంబసుమడోలపై ఊగుచున్నట్లు అతఁడు పారవశ్యమందెను క్రమముగా తన్మయరసతరంగములు తప్పించుకొని యెదుకొనివచ్చి ఇహలోకస్పృహ నందెను వెంటనే కుంచె పట్టెను పట్టుపచ్చను పద్మరాగ ప్రభాసదృశ వర్ణద్రవమున ముంచి ఆర్ద్రము చేసెను చిత్రపటమున భావసుందరి మధురాధరములకు మృదురేఖ లిడఁబోయెను

అంతలో 'రుద్రయ్యా!' అను పిలుపు శ్రవణపుటభిదురమై వినవచ్చినది రుద్రనాయకుఁడు ఉలికిపడి అటుచూచెను కృష్ణనాయకుఁ డచటికి వచ్చెను రుద్రనాయకుఁడు పిలిచితిరా! అని తండ్రిని పరామృశించెను

నేఁడు వీరపూజకదా యని నీమామను పిలిచితిని కాత్యాయని వచ్చినది అతఁ డింకను రాలేదు కారణము నీవు కనుఁగొనిరావలెను అంతరంగిక విషయమిది సేవకులను పంపుట శ్రేయస్కరము కాదు వెంటనే బయల్దేరునది అని కృష్ణనాయకుఁడు శాసించెను

కాత్యాయనీ చిత్రరచనకు మరల విఘాతము!!

ఒక్కసారిగ రుద్రనాయకునకు ఒడలు మండినది కాని కాత్యాయని వచ్చినదన్న వార్త చందనచర్చ చేసినది కన్నెదుట పితృమూర్తి సాక్షాత్కారము కర్తవ్యమును రెట్టించినది మామ రాలేదన్న సంగతి మనఃక్లేశము కలిగించినది తప్పనిసరిగా నతఁడు శిరఃకంపన మాత్రముగ ఆజ్ఞానువర్తనము ప్రకటించెను కృష్ణనాయకుఁడది గమనించి అటనుండి నిష్క్రమించెను గత్యంతరములేక రుద్రనాయకుఁడు పరికరములను భద్రపఱచుటలో నిమగ్నుఁడయ్యెను యాదృచ్ఛికముగ అతనికి 'ఎంతమాత్రము వలదు' అన్నమాట వినవచ్చెను అది తల్లి బద్రాంబ కంఠము ఆ కంఠములో అధికారస్వరము ముద్రవైచుకొన్నది అందుకు విచికిత్సకలిగి రుద్రనాయకుఁడు వీను లప్పగించెను

'అదేమి అత్తా!' అని జవాబు

ఆ కంఠస్వరము రుద్రనాయకుని అంతరస్నాయువులను కదిపినది

కాత్యాయనీ సుకుమారకంఠ వీణానిక్వణాకర్షితమైన హృదయ స్పందనము కలిగినది. మనస్సు హాయిమన్నది.

వలదుగాక వలదు

మాటల తల్లికంఠము ఉగ్రాతి గ్రామరూపమై తీవ్రత ప్రతిధ్వనించినది. ఎందునిమిత్తమో తల్లి ప్రతిఘటనము? రుద్రనాయకునికి ఆందోళన కలిగెను. సంశయ మనఃప్రవృత్తి చాలదూరము సాగినది. తమ వివాహము గురించి కాదుగదా అన్నంత పర్యంతము అనుమానము కలిగినది. వెంటనే అతఁడు బైటకు వచ్చెను.

తులసికోట చెంత తల్లి భద్రాంబ, మల్లెపందిరిమీఁద కాత్యాయని. — రుద్రనాయకునకు వారి వాదము వ్యక్తమైనది. ఇంతయుఁదేలి అది ఉపచారధూమమైనందుకు నవ్వుకొనెను.

అమ్మా! స్వయముగా పుష్పాపచయము చేయకున్నఁగాని సంతృప్తి కలగదులే కాత్యాయనికి! అనెను.

చాలింపరా నాయనా! దాసీజనము లేనట్లు ఉండఁగా తనకీయాతన యెందులకు? ఎంతవలదన్న వినుటలేదురా! అన్నది భద్రాంబ.

రుద్రనాయకుఁ డది వినికూడ విననట్లే యుండిపోయెను. అతని దృష్టియంతయు మల్లెపందిరికి అంకితమైనది. ఎండిన రాటమురాటి గాలిలోని తెగఁబ్రాకి ఊర్ధ్వాభిముఖముగ ఎత్తుననున్న మల్లెతీఁగను వంగిన చిట్టచివరి పూఁగుత్తి కొరకు కాత్యాయని ఆయాసప్రయాసలతో ఎగఁబడుచున్నది. చలిగాలి తరఁగలకామె పల్లెవాటు చిందులాడుచున్నది. ఆమనోజ్ఞ దృశ్యము పరికించనాభ్యర్థముగా రుద్రనాయకుఁ డటు చూచుచునె యుండెను. ఎగిరి ఎగిరి పూఁగుత్తి అందదాయె. కాత్యాయనికి విసుగు జనించి అప్రయత్నము వినిపించినది. రుద్రనాయకుఁ డదిచూచి కేళాకోళముగ కరతాళధ్వనులు చేసెను. తన ఓటమికి తోడు హేళనకు కాత్యాయనికి కోపమువచ్చెను. మరొకవైపు సిగ్గువెల్లువ పెల్లుబికెను. ప్రక్కవాటుగా మోము దాఁచుకొని అంతకు మున్కోసిన పూవులను దోసిళ్ళతోఁ దీసికొని మేనత్తచెంతకు వచ్చి నిలిచెను.

ఎంత అభిమానమో!

రుద్రనాయకుఁడు ఎత్తి పొడిచెను.

కాత్యాయని మేనత్త చాటుననుండియే 'తమకు లేనట్టు' అని వెలవంక వంపున ఎగతాళిగా మూతివిరిచెను. దొంగవాటుగా చూచిన రుద్రనాయకుని కది మొగ్గమొలిచినట్లనిపించినది. పరిహాస పరాయణత్వము ప్రతీకారవిశేషమైనది. వారిఁజూచి భద్రాంబ మురిసిపోయినది.

'పూజాసమయమైనదత్తా!' అని కాత్యాయని భర్తను త్వరపెట్టినది. ఆమాటవిని అదురుపాటుగ భర్త కాలుకదిపినది. కాత్యాయని అనుసరించినది. రుద్రనాయకుడు నిశ్శబ్దముగా వీధిముఖము పట్టెను.

పూజామందిరములో భర్త ప్రవేశించినది. కాత్యాయని మరొక గదిలో పువ్వులమాల కట్టసాగినది. వంటగదిలోనుండి యొకవంక పంచభక్ష్య పరమాన్నముల ఘుమ ఘుమార్భటులు, పూజామందిరమునుండి కర్పూర సువాసనలు గుప్పుమన్నవి. వానికి నాయము సుమసుగంధలహరి కాత్యాయనికి ఒక విధమైన మత్తు కలిగించినది. మాలికారచన పూర్తిచేసి కాత్యాయని ప్రక్క గదిలోనికి వెళ్ళినది. నిలువుటద్దము ముందు నిలబడినది. వాలుజడ నొయ్యారముగా ముందునకు లాగి మల్లికావల్లరి కీలించినది. అప్పటి ప్రతిబింబము కాత్యాయనికి అర్ధరచిత చిత్రపటమును జ్ఞప్తికి తెచ్చెను. అంతలో కాత్యాయనికి ఎవరో చిబుకస్ఫోటనము చేసినట్లనిపించినది. ఎవరట్లు చేసినది? కాత్యాయని బిత్తరపోయినది. అదరు గుండెతో అటునిటు పరికించినది. ఎవ్వరునులేరు. మరి తనకీవిచిత్ర విభ్రమమేమి? అది కేవలము తన విభ్రాంతియేనా! కాదు నిజముగా ఎవరో చిటికవేసిరి. తన కయ్యెద హృదయము జలదరించినది. ఒడలు పులకరించినది. ఆహ్లాదకరమైన ఆనందముకూడ కలిగినది. అంత జరిగి భ్రాంతియెట్లగును? భ్రాంతికాకున్న అమాంత మచటికి అంటారి మెత్తివచ్చిన నవనీతచోరుడెవరు? ఎవ్వరును లేకున్న ఈవిచిత్రానుభవము సంభవమా? అంతయు మాయగానున్నది. అసలు తన చిబుకముమీద ఎవ్వరైన చిటికవేయువారు ఉండిరా? లేరు? కొంటెబావ స్వయంభూ దేవాలయమున నాడుచేసిన ఘనకార్యమిదేగా! అయిన అతడెందుకట్లు చేసియుండును?

కాత్యాయనికి అర్ధముకాలేదు. కాలేదా? బావయన్న తనకు మధుర భావము. తానన్న బావకు తారకమే! సమీపములో తానున్నచో బావ ముఖ కోరకమే ప్రకోపించును. బావ తన్నుచూచును. తనకును బావను చూడవలెనను తమకము లేకపోలేదు. అట్టిండులలోని ఆంతర్యమెట్టిది? బావకు తానన్న ఎందుకంతమక్కువ? అవును బావకు తాను భార్యకావలెనను భావముకలదు. అందుకే అట్టిపైభరి! మరి తనకో?—ఏమో!—

ఆరాటాన కాత్యాయని ఊహా ఆగిపోయినది. ఆమె సుందర వదనారవిందము లజ్జావనతమైనది. అపాంగ లక్ష్మీయ రోచిస్సులలో ఒక నూతన తేజస్సు పొటమరించినది. హృదయ కుట్మలము విరిసినది. ప్రాయపు సౌకుమార తరంగములు సంచలన మందినవి. అప్రయత్నముగ సంగీత స్వరములు ఏకస్వర వివక్స్వరము లయినవి. మనసు నిండుగ కాత్యాయని మధురగానము

సల్పినది ఆ గాన సుకుమార మాధుర్యము వాగీశ్వరీదేవి వీణాతంత్రుల శుశ్రూషా ముముక్షువులయి కోమల్లినంతటి గురుస్థానీయము

* * *

కృష్ణనాయకుని ముఖములో నీలిరేఖలు పొడమినవి కన్నులు చింతనిప్పు లయినవి చేతిలో ఖడ్గము ధగధగ లాడుచున్నది హృదయములో బడబాగ్ని హోత్రము ప్రజ్వరిల్లుచునె యున్నది విప్పారిన వక్షముతో వీధిచావడిలో నిలిచెను

హేమాద్రిరెడ్డి రుద్రనాయకులు వచ్చిరి తన గుమ్మములో తమ్ముని కాలిడినంతనే భద్రాంబ అర్ఘ్యపాద్యములు అందజేయించినది రుద్రనాయకుడు లోని కేగెను హేమాద్రిరెడ్డి పాద ప్రక్షాళనాదికము ముగించుకొని కృష్ణనాయకుని సమీపించెను బావమఱదుల నడుమ కుశల ప్రశ్నల వర్షము కురిసినది కృష్ణనాయకుని హృదయరంగములో గర్విత విష పురుషుడు గాద్గర్యయవనికాభ్యంతరమున విచిత్రముగా పాత్రాభినయము నెఱపెను అనంతరము వారు లోకాభిరామాయణమున కుపక్రమించిరి పరిచారిక యొకతె అటకు వచ్చి ఖడ్గపూజకు వేళకావచ్చినదని చెప్పి వెడలిపోయినది వారుమాత్రము పట్టించుకొనలేదు లోకాభిరామాయణము రాజకీయరంగమునకు మరలినది

'మీరు దుర్యోధనుడు పన్నిన ఇంద్రజాలములో చిక్కిన శల్యునివలె జాయపనాయకుని వైష్ణవమాయలో పడితిరి అందుకు నాకు విచారముగాని విరోధముగాని లేదు ఆ శల్యునివలెనె మీరు సారథ్యము కొనసాగించినచో మహాభారత విజయమే నాకు ప్రాప్తించగలదు తన్మాత్ర సాహాయ్యము చేయకపోరని నా యభిప్రాయము అందుకు ప్రాతికూల్యము కలదా?' అని కృష్ణనాయకుడు ప్రశ్నించెను

'రాజద్రోహము కానిచో నేను సర్వసన్నద్ధమే' అని హేమాద్రిరెడ్డి మెల్లగా బదులు పలికెను

'చాలు మాటాడిన రాజద్రోహము! మర్యాదకొఱకు ఎంత మంచితన మవలంబించినను నన్ను అపార్థము చేసికొనుటే అలవాటైనది మీకు ఆ జాయపనాయకుడే మీకు గురువు బంధువు అయినచో వాని ఇంటికే వెడలుడి

కృష్ణనాయకుని వాగ్ధాటికి భవనము దద్దరిల్లినది అప్పటికి కృష్ణనాయకుని హృదయము ప్రజ్వలనాగ్నికుండము చూపులు శూలాగ్ర నిశితములు వాచకము కఠోరకుఠార సదృశము ఆమాటలకు హేమాద్రిరెడ్డి గుండె తల్లడిల్లినది ఆ భీషణ ధ్వనికి తలుపు తెఱచిన భద్రాంబ తలుపు తెఱచినట్లే నోరు తెఱచి

రాపడిపోయినది ఏమని మాత్ర మెటులో తప్పని అడిగినది హేమాద్రి రెడ్డి మాటాడలేదు కృష్ణనాయకుఁడు మఱల గొంతుక విప్పెను

'మీకును మాకును పొత్తు పొసఁగదు కత్తు కలవదు ఆఖరి ప్రయత్నముగ అడిగి చూచితిని ఎప్పటి సమాధానమే ఇచ్చితిరి అది మన బాంధవ్యమునకే మంగళహారతి! ఎల్లల పెండ్లికోసము మిమ్ము ప్రాధేయపడుటకూడ నా చేతగానితనమే కాఁగలదు' అని హఠాత్తుగా అతి భయంకరముగ కటారివలె ద్వారమార్గమును దూసికొని లోనికిఁబోయెను

భద్రాంబ భయవిహ్వల యైనది హేమాద్రిరెడ్డి మోమున కత్తివాటునకు నెత్తుటిచుక్క కఱువైపోయినది అమాంత మచటికి కాత్యాయనీ రుద్రనాయకులు వచ్చిరి కాత్యాయనిని చూడగనె హేమాద్రిరెడ్డికి ఏదియో భీతి కలిగెను ఎదను క్రొక్కుచున్న పరాభవ దవానలము నార్పుటకై స్వోపశమన నిశ్వాసములు విడుచుకొలఁది మంట లెక్కువై హేమాద్రిరెడ్డి మహోద్రేకమునకు పాల్పడెను

చెల్లీ! చెలవు కాత్యాయనీ! రా

ఒక్కసారిగ హేమాద్రిరెడ్డి సింహగర్జన చేసెను

కాత్యాయనికి గతము అజ్ఞాతము ఆగతము గహనము ఎత్తుమూర్తి చందరానసము పిడుగువలె నెత్తిన పడినది చైతన్యరహితమైన చిత్రప్రతిమవలె కాలు కదిపినది భద్రాంబహృదయము బావురు మనిపోయినది రుద్రనాయకుఁడు వెలవెలఁ బోయెను సర్వము తిమిరాంధకారబంధురమై గాఢమేఘావృతమై కనిపించినది ఆ కాఱుచీఁకటిలో కీకారణ్య మధ్యమునఁబడి దారిగానక ఎటకో పోవుచున్నటు లనిపించినది ఎటులో గుండెధైర్యము వహించి 'మామా!' అని పిలిచెను కాని ఆ పిలుపు పైకి వినఁబడలేదు ఎంతగట్టిగా పిలిచితినని రుద్రనాయకుఁడు భావించెనో అంత హీనస్వరమై అంతరాత్మలోనె అంతరించిపోయినది

ఆగు మన్నయ్యా! నీ వెఱుఁగనిదా మీ బాపగారి దురాగ్రహము కాత్యాయనినికూడఁ దీసికొనిపోయెదవేమి? అన్నయ్యా! ఆగవా? అని భద్రాంబ తల దాదుకొనుచున్నది అయినప్పటికి హేమాద్రిరెడ్డి అంతిమసోపానము సమీపించెను కాత్యాయని సింహద్వారమును దాటినది రుద్రనాయకునకు మతి పోయెను మఱల మామా! అని అఱచెను భద్రాంబ నిర్జీవ ప్రతిమవలె నిలఁబడిపోయినది అకస్మాత్తుగ రుద్రనాయకుఁ డటు పరుగెత్తఁబోయెను అంతలో ఆగు అని వెనుకనుండి తండ్రి కంఠము సహస్రవజ్ర నిర్ఘోషముల సమైక్య ధ్వనివలె వినిపించినది

రుద్రనాయకుఁ డటు చూడలేదు వీధినిఁబడిన కాత్యాయని పంక్తికై అతని దృష్టి అచటికి వచ్చిన కృష్ణనాయకుఁడు సరాసరి రుద్రనాయకుని ఎదుటికి వచ్చెను పాషాణకఠినమైన విశాలవక్షము విరిచి ఆజానుబాహువులు ద్వారబంధ సంబద్ధములుగా సింహద్వారములో నిలిచెను రుద్రనాయకుఁడు స్థాణువయ్యెను భద్రాంబ భయకంపితగాత్రి యైనది

మామకు మనకు సంబంధము నేటితో సరి! ఆ ఎల్లతో మాటాడుట నీవు మానివేయవలెను గౌరవభంగము చేసినవానికంటె వఱిలల కతుఱ్ఱివు మతొకఁడు లేఁడు అంతటి నీచుఁడు నీ మామ ఛీ! ఇఁక నీవును మామయనుట మర్యాదకు తక్కువ అని కృష్ణనాయకుఁడు పెద్దపులివలె గాండ్రించెను రుద్రనాయకుఁడు మేకపిల్లవలె చెవులాడించెను భద్రాంబ ఏదియో అనుటకు నోరావలించి భర్తవంక చూచెను ఎఱ్ఱనయాభీల గభీర శిఖిశిఖా గోళమువలె భర్త్రముఖము దర్శన దుస్సహమై భద్రాంబగుండె దడదడ లాడినది

ఫెళ్ళుమన్నది వీథి పరిచంద నరిభంజన తాడితమై ఎగసిన సైకతము వలె సైనికమండలి ప్రాంగణమున వెల్లివిరిసినది సౌరకొమ్ములపంటి పలు కత్తులు పైకెత్తి తాండవ మాడుచు వీరభటులు వీరోత్సవానందముతో పెట్టి యెత్తినట్లు గంతులు వేయుచుండిరి జయజయ ధ్వానములు చేయుచుండిరి వీరోత్సాహము విహార వికార వివిధారవములు భేరీకాహళ ఢంకా ఢమఢమ ధ్వనులు దిక్కులు పిక్కటిల్లినట్లు మ్రోగుచున్నవి అదంతయు సింహద్వారం విస్ఫారిత నేత్ర ధునాయత్తంభాంతర పరిదృశ్యమానమై రుద్రనాయకుని మనఃఫలకము బీటలు వాఱెను కత్తులతో గుండె కెల్లగించినట్లుల కలుకలు మనెను జయ జయధ్వానము లాతనికి జర్ఝరీభూతము లయినవి వివిధ వాద్యములు విలయాబ్ధి ఘోషలైనవి భద్రాంబ అంతరిక్ష విస్ఫుర నిర్మల నీవోష్ఠ బాష్పకణార్ద్రము లైన కరుణావలోకనములతో కుమారుని జూచి కుమారిలినది సైనికప్రపంచ మందునకు సాగినది వీరోత్సవ దర్శన మత్సరి మలినాంతఃకరణుఁడై కృష్ణ నాయకుఁడు గబాలున ద్వారకవాటము బంధించెను ఆ ధ్వనికి భద్రాంబ గుండె అదిరినది రుద్రనాయకుని ప్రగల్భత పటాపంచలైనది గోకదేవత ఓదార్పు నిట్టూర్పులు విడిచినది గృహాంతరము నిగూఢ వేదనారవ తమోనిబిడ గుహాంతరమైనది

౮

మసక చీఁకటితెర మసలినది మహీతలమున మషీజలము ప్రవహించినది దిక్తటమున స్ఫటికాణుప్రభాపరిస్ఫుటములై తారకలు తారాడినవి కాకతరుశిఖర శాఖాముఖర సముఖములై మందపవనములు తాళగతికి శ్రుతులు గలిపినవి

అశ్వత్థకోటరములలో ఘూకముల భయదఘోషములు మొదలిడినవి ఖద్యోత రింగణములు విహంగణముల శ్యామీకృతతరుశాఖలపై మిణుమిణుకుమను వెలుగులు వెదజల్ల సాగినవి

ఆర్యవాటికలో నొక పందిరాంతమున అంతరుజ్జ్వలులైన ధాన్యకూర భట్టారకులు వేదాధ్యయనము చేయుచుండిరి ఆ మంత్రపఠనమెంతయు మనోజ్ఞ మధురము అగ్నిహావలలపై పల్లకిగా కలవింకికల నాదములు తదనుకంఠములు

భట్టారకుల ఇంటికి కట్టెదుట నున్నది తాటాకుటిల్లు దాని అరుగుమీద ఆముదపు ప్రమిద వెలుగుచున్నది అగ్నిహోత్రచయనులు పోక కంబము నకు జేరగిలబడి కూర్చుండెను చూరుకొనిగలలో ఊరబిచ్చుకలు రణగోల మొదలుపెట్టినవి ఆ గోల చయనుల హృదయనాళములలోని అగ్నిగోళములకు యిదోడు అతనికి అనార్యమత నిర్మూలన మొకటే ఆవేదన అహోరాత్రము అందుకే ఆలోచన పన్నుగడ ప్రకారము కృష్ణరాయుడు తనకు కీలుబొమ్మ అగుట తటస్థపడినది ఇక అధించుటకు తగిన సమయసీమల అన్వేషణమె చయనుల ప్రస్తుత కర్తవ్యము

యథావాక్కుల అన్నమయ్య ఆ దారిని ప్రొద్దుపోయి వచ్చుచుండెను నిత్యకర్మానుష్ఠానమై ధాన్యకూరభట్టారకులు అరుగుమీదికి వచ్చిరి వారిని చూడగనె అన్నమయ్య ఆగి వందనముచేసి అరుగుమీదికి వచ్చెను

ప్రొద్దు పోయినది ఇంతసేపు ఎక్కడనుంటిరి అని భట్టారకులు ప్రశ్నించిరి 'శాస్త్రులుగారింటికి చేతన వచ్చినాడని తెలిసినది ఇంతసేపు లయనతో కాలక్షేప మయినది' అన్నమయ్య జవాబిచ్చెను చేతన వచ్చి నాడన్నమాట చెవులు నిక్కించిన చయనులకు వినిపించినది చఱ్ఱునలేచి అక్కడికి వచ్చెను ధాన్యకూర భట్టారకులు చేతన యెవరు? అని ప్రశ్నించిరి దానికి చయనులు ఆంధ్రభాషా భూషణమను వ్యాకరణ గ్రంథ మొకటి వ్రాయు దునని స్వాతిశయము ప్రకటించుకొను పండితుడు చెంచి। అనెను చయనుని హేళనము అన్నమయ్యకు బాధ కలిగించెను అయినప్పటికి ఆ భావము బహిర్గతము కానీయలేదు భట్టారకుల పంక్తి దిరిగి చెప్పదొడగెను

'చేతన గొప్ప పండితుడగుటో కాదో గాని ప్రతిభావ్యుత్పత్తులుగల కవి మాత్రమగును సంస్కృతాంధ్రములందె గాక కర్ణాటక భాషలోగూడ నాతనికి మంచి అభినివేశమున్నది కమ్మని కవిత్వము చెప్పును చక్కని వాగ్మి వేంగిమండల మతని జన్మస్థలము ఇచ్చట బంధువులు కలరు తరచుగ వచ్చును సాహిత్యజీవియగుటచే గోష్ఠి నెరపుట మొదటినుండి నాకు అభ్యాసము ఎవరెంత కాదన్నను చేతన ఏమియుదీసిపోనివాడె అంతెందుకు?

అతఁడు తిక్కనగారి శిష్యుఁడు. ఒకవేళ కేతన ఏమైనను తిక్కనగారి శిష్యుఁడు కనుకనైన మాటాడవచ్చును మన్నింపవచ్చును గురువును బట్టి శిష్యుఁడు కదా।'

'గురువు గొప్పవాఁడే కావచ్చు శిష్యుఁడు ఎందుకును పనికిరానివాఁడు కాఁగూడదని యెక్కడున్నది?' అని అగ్నిహోత్రచయనులు ఎదురుప్రశ్న వైచెను

'కవికుల తిలకుఁడు కాళిదాసందులకే చెప్పెను శిష్యుని ఎన్నుకొనుట లోనె గురువుగారి గొప్పతనము విదిత మగునని' అని అన్నమయ్య కొంచెము తీవ్రముగనె చెప్పెను

అప్పుడు భాస్కరభట్టారకు లందుకొనిరి

'అనేక పర్యాయము లనుకొందును బాహ్యవిషయాసక్తులము పారమార్థిక చింతనకు భంజకమని కాని అప్పుడప్పుడు కేవల పారమార్థిక దృష్టి వలన మనము జీవయాత్రచేయు బాహ్యజగత్తునె విస్మరించుచుండ వచ్చుట బాహ్య జీవనమున క్లిష్టమగుచుండును ఇంతయు నెందుకుఁ జెప్పితి నందురేమో! నాకు స్మరణ మాత్రమున సమస్త ప్రాశస్త్యము సువ్యక్తము కావలసియున్న తిక్కనగారి విషయము నాకు తెలియనిదగుట నాకే న్యూనత అనిపించినది'

'ఆ తిక్కనగారినిగురించి సర్వవిషయములు మీకు నేను మనవి చేయ గలవాఁడను' అని యథావాక్కుల అన్నమయ్య భట్టారకులవారిని చూచెను ఆయనలో ఆకర్ణనోత్సుకత స్ఫుటముగా కనిపించెను వెంటనె ఇట్లు చెప్పఁ దొడఁగెను—

'తిక్కన మహాకవి గుంటూరువిభుఁడు సాంకవితాభిరాముఁడు అయిన మంత్రిభాస్కరుని మనుమఁడు పాండిత్య సంపత్తియేగాక ప్రభుత్వాదరణముగల కుటుంబము వారిది మంత్రిభాస్కరుని అనంతర మాయన కొడుకు కొమ్మనా మాత్యుఁడె నెల్లూరు మండలాధిపతి యైన మనుమసిద్ధి మహీపాలుని మహా మంత్రి వారిది విచిత్రమైన పవిత్రమైన అనుబంధము అది కేవలము రాజ కీయ పరిమితము కాదు అన్యోన్యము ఆత్మబాంధవ్యము కలది మనుమసిద్ధి గారి తండ్రిపేరు తిక్కభూపతి కొంతకాల మాయనకొలువులోకూడ నుండిన కొమ్మనామాత్యుఁడు తిక్కభూపతిగారి పేరు కొడుకునకు పెట్టెను తన కొడుకు నకెగాక సోదరుని కొడుకునకు పెట్టెను ఆ సోదరునికొడుకు మహావీరుఁడు ఖడ్గతిక్కన అని అతనికి వ్యవహార నామమే కలదు అతఁడు కత్తి త్రిప్పుట లోని మెలకువలు అనితర సాధ్యములఁట రణరంగమునకు వెడలెనా రక్త సరస్సులో జలక్రీడ సేయునఁట। అబ్బ। అదేమి పూర్వపుణ్య జన్మవిశేషమో

గారి తిక్కనామధేయ మైనందుకు ఒకరు ఖడ్గతిక్కన వేరొకవ్యక్తి కవి తిక్కన సంస్కృతాంధ్ర భాషలలో అఖండమైన పాండిత్యమాయనిది ఆయన మహేశ్వరాంశకములభ్యాస్తైకశీలుఁడు। మనుమసిద్ధిగారాయనను మామా। యని పిలుతురఁట చోళ రాజులకు మంత్రిభాస్కరుని కుటుంబమునకు ఆత్మీయత అట్టిది అనునెడ అన్నమయ్య కన్నులు పారవశ్యమున మూఁతలు పడెను

'మామా। యని పిలుచునా? కారణము?' అగ్నిహోత్ర చయనులు అడిగెను

భాస్కరభట్టారకులు సావధానముగ వినుచుండిరి

అన్నమయ్య మరల ప్రారంభించెను

అంతట తిక్కనామాత్యగారే దాయఁదైన తిక్కనగారిని జూచి మామఁడిగా భావించి యుచ్చట పిలుచుండువారఁట। తెనుఁగువారికి మామమఁదుల బాంధవ్య మెంత తీరులేనిమకదా। అది పురస్కరించుకొని మనుమసిద్ధిగారు 'మామా। యనుట అనుటే కాదు ఆయన పిలుపు పంస్థాయిగా పెంపొంది నిలువఁబోయెను ఒకనాఁడు నిండుసభలో మనుమసిద్ధి మహీపాలుఁడు తిక్కనగారిఁ జూచి ఇట్లనెనఁట। 'నేను మామా। యని పిలుచుటకు సార్థకము చెయుటకుఁగాను కృతికన్య నీయరాదా? అని ప్రభు వాక్యము తిక్కనగారికెంత ఆహ్లాదకరమైనదో। మనుమసిద్ధిగారి అభీష్టసిద్ధికి కావ్యరచన మారంభించిరి ఆ కావ్యము నిర్వచనోత్తరరామాయణము అది మనుమసిద్ధి మహీపాలునకు అంకితమిచ్చిరి దానితో వారి బాంధవ్యము తీర్చబాంధవ్యమైనది ఆ కావ్యమునఁ మహాకవి తిక్కనగారు మణిపూసవంటి మాటలు చెప్పిరి అవి స్మరింపకపోవుట అపచారము

అన్నమయ్య క్షణమాఁగెను అగ్నిహోత్రచయనులు వికటముగ భ్రుకుటి విరిచెను భాస్కరభట్టారకులు ఏమది? అని మాత్రము ప్రశ్నించిరి

యథావాక్కుల అన్నమయ్య గొంతుక సవరించుకొని మొదలిడెను —

నన్నయభట్టు నందనోద్యానములో తెనుఁగు వసంతోదయమైనది కవితావల్లరులు కుసుమించినది ఫలించినది కూడ నన్నయగారి కవిత సంస్కృతాంధ్ర సమ్మిశ్రమైన విశిష్టము సంస్కృత మార్యభాష గనుక ఆర్యమతాభిమానులయిన వర్ధమాన కవులు నూతనకవితాసంప్రదాయము నెలకొల్పిరి నన్నయభట్టు కి అను మార్గకవిత యనిరి అనార్యమతప్రధాను లయిన అద్వితీయ దేశకవులు మార్గకవిలను నిరసించిరి విశిష్టమహాభారత రచనాప్రయత్నమె మృగ్యమైనది కావ్యము అటువంటి కవితలోనె దృక్పథము

మాటినరికరా। దేశికవితావాదము వెలసినది. దేశియమైన సంప్రదాయము కలది దేశికవిత. అచ్చతెనుఁగు మాత్రమె కాని ఆరాధ్యభాష. అదియే జాను తెనుఁగు వాదము. ద్విపదాదిదేశీయఛందస్సులే స్వీకార్యములని శాసించిరి. అంతకు నయసే ఆ వాదము నేఁటికి తీవ్రరూపము దాల్చి వెఱ్ఱితలలు వేసినది. మార్గకవిత ఉరుతరగద్య ప్రౌఢోక్తిప్రాయమని అధిక్షేపింపసాగిరి. 'గద్యం కవీనాం నికషం వదంతి' యను నాభాణకమె వారికి గహనమైనది.

అంతేకాదు ఛందస్స్వాతంత్ర్యము బాహాటమైనది. ఏకహల్సామ్య ప్రాసఘటనము ఎక్కువ సమ్మతమైనది. అనఁగా 'ఇంద్రసుమతి—సర్వజ్ఞ' శబ్దములలోని ద్వితీయాక్షరముల శ్రుత్యనురూపమాత్ర ప్రాసఘటితములు. యతిమైత్రి ఎట్లుకూడ విశృంఖల విహారమె. ఇఁక భాషాసాంకర్యము వ్యాకరణస్ఖాలిత్యములు కోకొల్లలు. సంస్కృతాంధ్రపదముల విరుద్ధసమాసఘటనము చెల్లుఁబడియైనది. 'వృథయౌ' దీపగంధములు మట్టెదావి ముల్లోకినాథుఁడు మొదలగు వైరిసమాసములు వ్యవహృతములయినవి. క్త్వార్థకాద్యనిష్టసంధులు కర్తవ్యములయినవి. రేఫ శకటరేఫల పరిగణనమె అంతరించినది. ఇట్లు బహుముఖముగ భాష అధ్వాన్నస్థితికి పాల్పడినది. ఈ భాషాశైథిల్యమునకు వీరశైవమతప్రభావమె ప్రబలహేతువు. ఇట్టియెడ భాషాసంస్కరణాభిలాష యున్నప్పటికి అట్టిప్రయత్నము చేయఁగల సాహసము గాని, ప్రయత్నము ఫలసిద్ధి పొందునట్లు చేయఁగల శక్తిగాని యెవ్వరికిని లేకపోయినవి. ఆ సాహసము అంతటిశక్తి ఒక్క తిక్కన్నగారికే ఉన్నవి.

మార్గకవితలోని మాన్యతను దేశికవితలోని దేదీప్యతను సమగ్రదృష్టితో సమన్వయపఱచిన అద్వైతి తిక్కనమహాకవి। సంస్కృతభాషానియంతృత్వమును ప్రతిఘటించెను. సంస్కృతభాష యెడఁగల నిరసనమును ప్రతిఘటించెను. 'జాత్యముగాని నొప్పయిన సంస్కృతమెయ్యెడఁ జొన్పి చెప్ప'నని శపథముచేసిరి. లయాన్వితమైన ఛందస్సున సంకుచితదృష్టిని సడలించిరి. లాక్షణికభాష మాత్రమె కావ్యభాషగ స్వీకరించిరి. శ్రుత్యనురూపప్రాసఘటనము దౌర్గత్యమనిరి. జానుతెనుఁగు వాదములోని అతివేలతను ఖండించి అందలి నిసర్గరమణీయత సంస్కృతప్రాగల్భ్యముకంటె వరణీయమనిరి. ఆ ప్రకారమె వారికావ్యము ఆద్యంతముగ సహజలలితమధురము. మార్గకవితామార్గము నందలి కవిత్వపులోతులు దేశికవితావాదమునందలి అల్పాక్షరముల అనల్పార్థరచన అనునవి పరమగమ్యము మహాదర్శమునుగా నిర్వచనోత్తర రామాయణ కావ్యమును వ్రాసి ఉభయకవితామార్గములందలి ఉత్తమ గుణములను ఉదాహరణపూర్వకముగ సమైక్యపఱచిన తిక్కనమహాకవి అన్వర్థబిరుదముగా ఉభయకవిమిత్రుఁడు। ఉభయకవిమిత్రుని ఉదాత్త

సమన్వయములో మార్గకవితాకల్పతరువున దేశకవితాపారిజాతలతిక ప్రాఁకినది నన్నయనాఁటి తెనుఁగు నందనోద్యానవనము మరల మధుమాసమాధురీ నవనవోన్మేషమైనది

యథావాక్కుల అన్నమయ్య కన్నులు చెమ్మగిల్లినవి హృదయ మానందతన్మయత నందినది భాస్కరభట్టారకుల తేజఃఫాలము విస్ఫారిత మైనది

భాషోద్ధరణమునకై మీ కేతన ఆంధ్రభాషా భూషణమను వ్యాకరణ గ్రంథము వ్రాయఁదలంచెనా ? అని హేళనగ అగ్నిహోత్రచయనులు ప్రశ్నించెను

యథావాక్కుల అన్నమయ్య మాటాడలేదు

భాస్కరభట్టారకులవారు మాత్రము నన్నయ రచితమైన ఆంధ్రశబ్ద చింతామణి యున్నదికదా ! అనిరి

యథావాక్కుల అన్నమయ్య ఆమాట వినునెడ ఏదో చటుక్కున మెఱసెను కొంతవడి యోచించెను వాస్తవ మనిఎంచెను వెంటనే చెప్పసాఁగెను

ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతమె తెనుఁగున కదియే ప్రథమ వ్యాకరణగ్రంథము ఎందులకో నేఁట తాను వ్రాయునదియే ప్రథమాంధ్ర వ్యాకరణమని చెప్పెను నేఁటి యుగప్రభావమున తెనుఁగువ్యాకరణము తెనుఁగులో నుండుట అభిలషితము ప్రాయశః అందుకే కేతన ప్రయత్నము. ఇప్పటికే కేతన దశకుమారచరిత్ర వ్రాసి అభినవదండి బిరుదాంకితుఁడైనవాఁడు కనుక సమర్థుఁడనుటలో సందియ మనవసరము కాని అతఁడు మున్నె తెనుఁగునకు లక్షణము చెప్పరుఁ చెప్పనందులకు నేనాంధ్రభాషాభూషణము వ్రాయుచున్నాననుటే నాకు వింతగ తోచును మీఁదు ఒక్కరి నన్నయభట్టారకుని కవుల కరుణముతో వ్రాయుదునని చెప్పుచు తెనుఁగున లక్షణమనిన విశేషము లేకపోయెడిది తెనుఁగునకు లక్షణము సంస్కృతమున చెప్పెను అందులకు నేను కేతననే యడిగితిని నాగసునాసుల ఆంధ్రశబ్దచింతామణి కలుగఁగా మరి నీ ఆంధ్రభాషాభూషణమెట్లు ఆద్యగ్రంథము కాఁగలదు ?' అని దానికతని సమాధానము దరహాసము

భాస్కరభట్టారక లది విని కీర్తికాంతా విహర్తి గొప్పవారికి గుణమో దోషమో సహజమైపోయినది అది లౌకిక పరిధుల నతిక్రమించని అల్పత్వ మనక తప్పదు అనెను

అగ్నిహోత్రిచయను లదేమియు వినలేదు. అన్యథా ఆలోచనలో మునింగెను. నేను పండితుండను. మహాపండితుండను. షట్ఛాస్త్రములు చదివితిని. కాని యీకాలమున నాకుఁ దక్కవలసిన అర్థయశస్సులు దక్కుట లేదు. కారణము జైన బౌద్ధ మతముల జైత్రయాత్రలె. మనుమసిద్ధికి ఆర్షమత పక్షపాతము మెండనిపించును. అందుకే కేతన అహంకారమునకు చెల్లుఁబడి. అతనికే కాదు. ఎవ్వరికి నేనేమి తీసిపోతిని? శాస్త్రములను శాసింపఁగలను. అలంకార గ్రంథములకే అలంకారములు ప్రసాదింపఁగలను. వ్యాకరణశాస్త్రమహాక్షేత్రము నాకు క్రీడారంగము. ఇఁక తర్కమా? నాతలయే। అయినప్పటికి ఆర్షమత ప్రాభవశూన్యతవలన నా ధీశక్తి ప్రకాశింపకున్నది. చూచెదఁగాక। ఎంతకాలం మీ అనార్యమత ప్రాభవము?' అని తలపోయు చివాలున లేచెను.

భాస్కరభట్ట రఘునాథ అన్నమయ్య సెలవు తీసికొనెను. అగ్నిహోత్రిచయనులు అరుగుదిగెను. భాస్కర భట్టారకులు మందిరాంతమునకు వెడలిరి.

నిశీథము నిర్మానుష్యముగ నున్నది. నిశ్శబ్దములే ఘనీభవించినవి. అగ్నిహోత్రిచయనులు మాత్రము అరుగుపైఁ గూర్చుండి యుండెను. కొంతసేపైనది. కాటుకచీఁకటిలో కృష్ణనాయకుఁ డచటికి వచ్చెను. అతనిని చూడగనె చయనులకు కొండంత ఓపిక ఏనుఁగంత బలము వచ్చినది.

హేమాద్రిరెడ్డితో తెగతెంపులయినది. ఇక మీ సామర్థ్యముతో విజయయాత్రయే। అని కృష్ణనాయకుఁడు చయనులకు చేతులు జోడించెను.

మంచిసమయమునకు వచ్చితివి. రమ్ము. రహస్యముగ మాటాడుకొందము. ఇఁక నీపుత్రుఁడు ఏకశిలానగరమునకు ఏకచ్ఛత్రాధిపతి — చయనులు నిర్ధారణగ చెప్పెను.

కృష్ణనాయకుని గర్వము గగుర్పొడిచినది. ఆశ ఆమ్రేడితమైనది. దర్పము దండెత్తినది. భావ మరీచికలు భాస్వంతములై కనిపించినవి.

అగ్నిహోత్రిచయనులు అరుగుదిగెను. కృష్ణనాయకుని వీపుతట్టెను. మనకు చక్కని పాచిక దొరికినది. ఇఁక మనమాడవలసినది రాజకీయపు జూదము. అందులో మనుమసిద్ధిమహీజాని అక్షప్రియుఁడు. మన విజయసిద్ధికి శిఖండి. రమ్ము. విశేషములు చెప్పెదను. అని కాలు కదిపెను.

కృష్ణనాయకుఁ డనుసరించెను.

హఠాత్సంఘాతమారుతావేగమున అరుగుమీఁది అలఁతి దివ్వె కొండెక్కినది.

ప్రతిదినము కాత్యాయని స్వయంభూదేవాలయమునకు వెళ్ళుచున్నది వచ్చుచున్నది రుద్రనాయకుఁడు మాత్రము వచ్చుటలేదు బావ రానందుకు కాత్యాయని బాధపడుచున్నది తన భక్తిభావములో పరమేశ్వరు ధ్యానముకంటె నితరమును పరిగణింపదు ఇంత చిన్నవయస్సున అంతభక్తి పరవశత్వ మెట్లు కల్గినదో! మధ్యేమార్గమున దానును మాత్రము స్మరించును బావకు కోపము వచ్చెనేమోయని తొందరపడును కొంతతడవు నిరీక్షించును దాని గుఱించి తానెందుకు బాధపడవలెనని కూడ భావించును సమాధానము స్పష్టాస్పష్టమగును ఫలితముగ ఇంటిముఖము పట్టును

అట్లు పక్షము దినములు గడచినవి ఆలయమునకు వెళ్ళిన కాత్యాయని ఇంటికి వచ్చినది హేమాద్రిరెడ్డి కుమార్తెను పరిశీలనగాఁ జూచెను కాత్యాయని చిక్కిపోవుచున్నట్లనిపించెను శరీర కార్శ్యముఖ వైవర్ణ్యమునకు మనస్సు చివుక్కుమన్నది అనేక విధములుగా రెడ్డికి ఆలోచనలు సాగినవి బావమఱఁది పరాభవించెను బాంధవ్యము దూరదూరమగుచున్నది ఆ బాంధవ్యము సాధారణమైనదికాదు సంతానభవితవ్య సమస్యాత్మకము ఎల్లల పసిహృదయములలో పాదుకొనిన ఆశాలతలకు తండ్రియయిన తాము ప్రోది చేయుట మాని పెల్లగింపవలసిన దుర్గతి పట్టినది అదెంత అనుచితము? అయిన గత్యంతరము? ఆత్మాభిమానము చంపుకొని బావను బ్రతిమాలవలె అంతకంటె నీచమది నీచమేకాదు నిష్ఫలముకూడ కృష్ణనాయకుఁ డిపుడు ఈర్ష్యాకృష్ణసర్పదష్టుఁడు! కలిపురుషవికలుఁడు! మాత్సర్య రాహుగ్రస్తుడైన కుముద బాంధవుఁడు! కాని—

హేమాద్రిరెడ్డి ఆలోచనా ప్రవాహము శయ్యాగతి మార్పుమలఁపున నింకను తన్నివెట్టినది ఎంతసేపో అట్లుండలేక పోయినది ఉద్గారనకొనుచు ఆలోచనాస్రవంతి సాగినది

ఆశాపాశబద్ధుఁడైనవానికి త్యజనశీలము అరిది కృష్ణనాయకుఁ డట్టి వాఁడు కనుక తానే సామరస్యమునకు ముందంజ వేయవలసియున్నది అట్లు వెళ్ళిన ఆత్మగౌరవభంగము అదంత సులభముగ విస్మరింపవలసినది కాదు అసలే కృష్ణనాయకుఁడు సుస్వాగత మొసఁగియు అవమానించిన అవివేకి అతనితోనా సామరస్య ప్రయత్నము అసంభవము—అయిన ఎల్లల భవితవ్యము

భవితవ్యమున కేమి? కాత్యాయనికి తగిన వరుఁడు కాత్యాయనికి వచ్చును రుద్రనాయకునకు తగిన వధువు రుద్రనాయకునకును వచ్చును ఇందులో పెద్ద ఆలోచింపవలసిన విషయమే లేదు లేదా?

హేమాద్రిరెడ్డి లేదనుకోఁబోయెను. కాని ఉన్నదను ఊహ అంతరాంతరములో ఎక్కడో మెదిలి నట్లయినది. ఆ మెదిలిన ఊహ అట్లే ఆఁగిపోలేదు. ఆలోచనకే నిలిచెను.

రుద్రనాయకునకు కాత్యాయని యన్న ప్రాణము. పాప యనిన కాత్యాయనికి ఇష్టమే. వారిద్దఱు దంపతులైన ఎంత అన్యోన్యముగనుందురు! ఇరుగుపొరుగువారు బంధువులు ఉబుసుపోకనా కావలెనయి కాత్యాయనీ రుద్రనాయకులు భార్యాభర్తలనుట కలదు. అది తానెఱుఁగును. ఎఱుంగుటే కాదు ఒకసారి ఎవ్వరో అదేమాట యనిరి. అప్పుడు రుద్రనాయకుని వదనమెంతగా తేజఃప్రఫుల్లమైనది। కాత్యాయని లజ్జావనతమైన వదనమెన్నిగడుసుపోకలు పోయినదో। అట్టి కాత్యాయనీ రుద్రనాయకులు భార్యాభర్తలైనచో ఆ దాంపత్య మెంత మధురాతిమధుర మగునో।—ఏమి లాభము? విధిఘటన మెట్లున్నదో?—విధివిధానముకంటె ముందుపురుషకారము కదా। తాను ప్రయత్నించిన కృష్ణనాయకుఁడు బిడ్డల ఉజ్జ్వలభావికి అంతరాయము కలిగించఁడేమో? ఒకవేళ కలిగించినప్పటికి ముందు తాను ప్రయత్నించుట కర్తవ్యము తప్పదు. కావున బ్రతిమాలియైన ఆసుఁగు బిడ్డల శుభ భవితవ్యమును సాధింపవలెను. ఆత్మగౌరవము భంగపడిన బాధలేదు. ఒకవేళ రాజగౌరవము భంగపడవలసి వచ్చిన? బాధయేమి గాని ప్రమాదము సంభవించును. కనుక రాజవిషయ వ్యతిరేకము లేకుండ బావదగ్గఱ ప్రాధేయపడుటే కర్తవ్యము. కారణము కాత్యాయని ఎట్టమహారాణి యగునని కాదు. కష్టగృహిణి కాకపోవునని మాత్రమే—

తర్కవితర్కములతో హేమాద్రిరెడ్డి తల తిరుగుచున్నది. అంతలో వీధివాకిట గుఱ్ఱములాఁగిన చెక్కుచప్పు డయినది. అనంతరము తలుపుతట్టిన శబ్దముకూడ వినవచ్చినది. హేమాద్రిరెడ్డి వీథిద్వారము తెఱచెను.

ముందు రాజభటులు! వెనుక జాయపనాయకుఁడు!! వారిని చూడగ హేమాద్రిరెడ్డికి ఆశ్చర్యము భయముకూడ కలిగెను. ఎప్పుడును రాని జాయపనాయకుఁ డటుల తనయింటికి వచ్చుటే అందులకు హేతువు. భావద్వంద్వము బహిర్గతముగాకుండ హేమాద్రిరెడ్డి స్వాగతమిచ్చెను. రాజభటులు వీధివాకిట ఆఁగిరి. జాయపనాయకుఁడు లోనికి వచ్చెను. హేమాద్రిరెడ్డి ఆందోళిత హృదయ మింకను అదురుచున్నది. అటులే జాయపనాయకుని గౌరవ పురస్సరముగా ఉచితాసనమునఁ గూర్చుండఁజేసెను.

‘విశేషములేనిది స్వయముగా విజయంచేయరు. మీరు కబురుపెట్టిన రెక్కలుగట్టుకొని వచ్చి వ్రాలెదువాఁడను కదా।’

హేమాద్రిరెడ్డి వినయవిధేయత లుట్టిపడునట్లు పలికెను

"విశేషమే! వ్యవధిలేమి స్వయముగా వచ్చితిమి. మన యిప్పుడు మనుమసిద్ధి మహీపాలుఁడఁట! వానిపై యుద్ధము ప్రకటింపవలయున్నది. సర్వసేనాధిపత్యభారము వహింపవలసిన బాధ్యత మా హేమాద్రిరెడ్డి భుజస్కంధములపై నిడుచుంటిమి' అని గాయపనాయకుఁడు జలదగంభీర స్వరమున పలికెను. అప్పుడతని నేత్రములు క్రోధవిస్ఫారితములై కెంపు వాలినవి.

హేమాద్రిరెడ్డి శిరఃకంపనమాత్ర విధేయుఁడయ్యెను. 'సామంతుఁడైన మనుమసిద్ధికి స్వాతంత్ర్యము కావలసివచ్చినదఁట! వానిరాజ్యము కాకతీయ సామ్రాజ్యములో సహస్రాంశమన్న సంగతి విస్మరించెను కాఁబోలు! కానిమ్ము. ఎవ్వరో ఇక్కడివారె పురిగొల్పియుందురని మన జాంఘాలికుల సంశయము. అది యిజాపుకావలె. ఆ వంచకుఁడు ఆ స్వామిద్రోహి శిరస్సు ఓరుగంటి కోటగుమ్మమున వ్రేలాడక తప్పదు.

గాయపనాయకుఁడు మరల మేఘగర్జనముచేసి లేచెను. హేమాద్రిరెడ్డి అనుసరించెను. ఉభయులు గృహప్రాంగణమునకు వచ్చిరి. రాజభటులు వారిని సమీపించిరి.

"యుద్ధభూమిలో ప్రతియోధునిజాడ కనిపెట్టవలయున్నది. ఆ ద్రోహిని పసిగట్టి పట్టి బంధించు బాధ్యత నీది" అని గాయపనాయకుఁడు ఆజ్ఞాపత్రము హేమాద్రిరెడ్డిచేతి కొసఁగెను.

రాజభటు లిద్దరు అశ్వమును ఆయత్తపఱచిరి. గాయపనాయకుఁడు అశ్వారోహణము చేసెను. హేమాద్రిరెడ్డి ప్రణామ మొనర్చెను. రాజభటులు కూడ అశ్వారూఢులయిరి. గాయపనాయకుని యానాశ్వము సకిలించినది. హయహేషకు హేమాద్రిరెడ్డి కంపితుఁడయ్యెను. అశ్వత్రయము దౌడు తీసినవి. అతివేగజనితాట్ట తురంగఖురపుటము హేమాద్రిరెడ్డి హృదయమున ప్రతిధ్వనించినవి. కంటి కగపడువఱకు రయవిలసత్తురంగములను చూచుచు నిలిచెను. స్మృతిపథమున గాయపనాయకుని పలుకులు వాడిములుకులై మెరసినవి. హేమాద్రిరెడ్డి కెందుకో కృష్ణనాయకునిరూపము కన్నులకు కట్టినట్లు కనుపించసాగినది. ఇల విలపించుచున్న తల్లిప్రతిబింబము ఎదురుకుండెను. ఇతరరాజులకు అటెరిపడని కాకతీయచమూసమూహములో పరరాజపాదసంవాహనమా? అను ప్రశ్న వేధింపసాగెను. అట్లే హేమాద్రిరెడ్డి లోనికి వచ్చెను.

కొంతసేపటివఱకు హేమాద్రిరెడ్డికి మనస్సు స్థిమితపడలేదు. ఏమియు

తోచక లోనిగదిలోనికి వెడలెను. అక్కడ కాత్యాయని కంబళిపరచుకొని ముఖవీణ ముందిడుకొని కూర్చుండియున్నది. హేమాద్రిరెడ్డి ఏమియు పలుకక నిజతనయవంక చూడసాగెను. ఒకటిరెండుపర్యాయములు కాత్యాయని ముఖవీణ శ్రుతిని సవరించబోయినది. మరల ఎందులకో మానివేసినది. అది చూచి హేమాద్రిరెడ్డి హృదయము ద్రవించిపోయినది. అంతర్బాష్పములతో అక్కడ నిలబడలేక ముఖ్యగదిలోనికి వచ్చెను. ఎప్పుడు వచ్చెనో అక్కడ రుద్రనాయకుడు వచ్చి నిలిచెను. రుద్రనాయకుని జూడగనె హేమాద్రిరెడ్డికి కృష్ణనాయకుడు గుర్తుకువచ్చెను. ఇంకను గాయపనాయకుడు అజ్ఞాపించు చున్నట్లే అనిపించినది.

మామా!'

రుద్రనాయకుడె పలుకరించెను.

హేమాద్రిరెడ్డి పరాఙ్ముఖుడై సంజ్ఞతో కూర్చుండమని తెలిపెను.

రుద్రనాయకుడు ఆసీనుడుకాలేదు. మౌనగంభీర దృక్కులతో మామను తిలకించెను. కింకర్తవ్యతామూఢుడయి హేమాద్రిరెడ్డికూడ మేనల్లుని మరల పలకరించలేదు. కనీసము చూడలేదు.

లోనిగదిలో వీణానిక్వాణకణనము వెలువడి అంతలోనె నిశ్శబ్దమైనది. అమాంతము హేమాద్రిరెడ్డికి కాత్యాయని జ్ఞప్తికివచ్చెను. అనుక్షణమె మేనల్లునివంక చూచెను.

అవ్వారింప పరాభవించుట అతిదారుణమే! అంతకంటె మా నాన్న మమ్ము గిరిసగీటు దాటరాదని శాసించినాడు. మామా! కంటకావృత శిఖిం శిలాపరిధిలో బంధీకృతులమగుట మీరును అభిలషితమా? అని రుద్రనాయకుడు ప్రశ్నించెను.

హేమాద్రిరెడ్డికి సహజన్మురాలు భద్రాంబ జ్ఞప్తికి వచ్చినది. భద్రాంబ ఎట్టి అమాయకురాలు! కష్టము కల్గిన కడివెడు కన్నీళ్ళు నించునదే కాని ధైర్యమువహించగలునది కాదు. ప్రతికూలశక్తులను ముందే ప్రతిఘటింప లేదు. భర్తృశాసనము శిరసావహించును. అది ఎంత అనర్థకమైనను కాదు కాదనగల స్వాతంత్ర్యము లేనిది. పాపము!—భద్రాంబస్మరణము హేమాద్రిరెడ్డికి జాలిగొలిపెను. అభిమానపూర్వకముగా రుద్రనాయకుని పలుకరించెను.

చదువే జన్మకు చరితార్థమనుకొందును. నా కళారంగమె నాకు నాక లోకమని తలపోయుదును. కాని—

అను నొక భావము సుపరిచితము కాఁబోయి గాద్గద్య మత్తువడినది ఏదో హెచ్చరిక ఎవ్వరో గాఢముగా—గూఢముగా—చేసినట్లయినది హేమాద్రి రెడ్డికి వెంటనే మేనల్లునిఁ జూచెను కాత్యాయని అటు రాసాగెను హేమాద్రి రెడ్డి చివాలున లేచెను కాత్యాయని చేయిపట్టుకుని రుద్రనాయకునివంక తిరిగి "వైవాహిక వాంఛ విడిచిపెట్టినది' అని కాత్యాయనిని లోనికిఁ గొనిపోయెను

అమాంతము భూకంపము వచ్చినట్లు రుద్రనాయకునకు అయోమయమై పోయినది దిర్దిరావేగమున దిశాగోళము పరిభ్రమించిన ట్లయినది హృదయములో హాలాహల భుగభుగలు పొగలు వెదఁజిమ్మిన ట్లనిపించినది కొంత సేపతఁ డట్లే స్తబ్ధుఁడయ్యెను క్రమముగ చైతన్యము కలిగినది బరువుగా కదుష్ణ దీర్ఘ నిశ్వాసము విడిచెను

'కాత్యాయని! కాత్యాయని!

రుద్రనాయకుని హృదయము శతధా ఛిన్నాభిన్నము కాసాగినది ఇంకెక్కడి కాత్యాయని? ఒకవంక తండ్రి దురహంకారము మఱొకవంక మామ దురభిమానము పర్యవసానము ప్రణయము ఆశల అలలు చెదరినవి కమ్మని కలలు చెరిగినవి ఉత్సాహపు టుయ్యెలలు ఊడిపడినవి కాత్యాయనీ ప్రణయ నీరాజనము లేక స్వప్న సందర్భములు! కాత్యాయనీ సుకుమార సుందర విగ్రహ సంభావనావకాశము తన కిక మిథ్య!! కాత్యాయనీ కల్హార వదనాలోకము తనకిఁక సినీవాలీ దివసనమునందే!!! కాత్యాయనీ చరణనూపుర వినూతన ఝణంఝణారవము లేక పూర్ణానుస్వారములే!!! ప్రణయినీ మధుర మానసహాసమరీచివీచికలు మరు మరీచికలే!!!

రుద్రనాయకుని హృదయ ముద్రిక్తమయినది నిర్ఝరీసలిలోర్మిచ్ఛటా మహోజ్జృంభణమువలె మానస మూఁగులాడినది కాలు కదిలినది ఎల్లో గుమ్మము దాఁటెను వీధిని పడెను వర్షాకాలపు టెండ వడగొట్టుచున్నది రుద్రనాయకుని గుండెదడకు గుడులు గోపురములు ఊఁగుచున్నట్లుండెను ఆవేశపు పొంగులో రుద్రనాయకుఁ డట్లే నడచుచుండెను అంతర్మథనము చెందుచుండెను అట్లెక్కడికో అతని అనిర్దిష్ట వృథావేశ వ్యథాకల్పిత ప్రస్థానము?

౧౦

'కాకతి గణపతిదేవ చక్రవర్తిగారికి ,మత సమదృష్టి కలదా?" ఒకనాఁ డిష్టాగోష్ఠిలో యథావాక్కుల అన్నమయ్య భాస్కరభట్టారకుల నడిగెను భాస్కరభట్టారకు లందుకు నవ్విరి యథావాక్కుల అన్నమయ్యకు తాత్పర్యము దుర్గమమైనది మఱల పృచ్ఛ చేసెను

'మీ రడిగిన ప్రశ్న 'సూర్యరశ్మికి చతురంబోధిపరీతభూతల సామ్రాజ్య మొకటేనా' యన్నట్లున్నది అన్నమయ్యగారూ! మన చక్రవర్తికి మత సహనము లేదని యెట్లనఁగలము? ఆర్షమతాభిమానమునకై ఆయన జరిపిన యజ్ఞాదికము ప్రత్యక్ష సాక్ష్యముకదా! సర్వకర పరిహారముగా ప్రభువులు ప్రదానముచేసిన అగ్రహారములు మరిమాన్యము లెవ్వరెఱుఁగనివి? ఇతర మతము లందునూ బౌద్ధ స్థానములయం దాయనకు నాదరము లేదా? జైను లెందఱికి ఆశ్రయ మీయలేదు? శైవ వైష్ణవ మతావలంబుల నెందఱిని ఆదరించుటలేదు? మహారాజుగారికి మతసహనము లేనిదే ఇవి సంభవములా? ప్రభుత్వ భద్రతకనుట కిట్టింతయును అత్యధికమైన సైనికబలమున్న చక్రవర్తి కట్టి ఆవశ్యకము హాస్యాస్పదము కాదా?' అని భాస్కరభట్టారకు లనిరి

కొంతసేపు మౌనము వహించి మఱికొంతసేపు అటునిటు దిక్కులు చూచి యథావాక్కుల అన్నమయ్య మఱల ఇట్లడిగెను

అది నిజమే సర్వవిదితమే కాని భట్టారకులగారూ! ఒక సందేహము నివృత్తికొఱకే నా ప్రశ్న క్షమించుఁడు మొన్న యౌవరాజ జన్మ దినోత్సవ సందర్భమున ఒక్క వైష్ణవ దేవాలయ ప్రసక్తి ప్రభువులు తీసికొని రాలేదు కారణ మేమందురు?"

అదేమి మాట! అప్పటి ప్రదానములు అన్ని దేవాలయములకు సమానముగా జరిగినవి కాదనిన పునర్నిర్మాణమునకు సర్వవ్యయభారము వహించిన దొక్క శైవాలయమునకు ప్రాయశః వైష్ణవ దేవాలయములు శిథిలావస్థలో లేవేమో!'

లేకేమి? కృష్ణనాయకుఁడు జీర్ణవైష్ణవదేవాలయోద్ధరణ ప్రయత్నము ప్రభువులకు కష్టమైనదని మన వయస్యుగారి దగ్గఱ అనినాఁడఁట కాకతాళీయ ముగ నే నొకనాఁడు విష్ణ్వాలయము చూచుట తటస్థించినది నిజముగ దిక్కు లేని దేవాలయ మది ,

ఎక్కడిది ఆలయ మది?

'స్వయంభూదేవాలయము దాటి వీధి మలుపు తిరిగిన కనిపించు మొట్ట మొదటి దేవాలయమే!

అదియా?

భాస్కరభట్టారకులు తేలికగాఁ జూచిరి

యథావాక్కుల అన్నమయ్యకు జిజ్ఞాస గాఢముగ నున్నది ఒకటి రెండు

పర్యాయములు భట్టారకు నెమ్మోము నరసెను భట్టారకులు నిర్వికారముగా కనిపించిరి

'అంత పెద్ద దేవాలయ మది మీ రింత అల్పవిషయముగా ఒక్కసారి నోరు చప్పరించితిరి గాని జవాబిచ్చితిరి కాదు' అని మరల అన్నమయ్య ప్రశ్నించెను

భాస్కరభట్టారకు లిట్లు జవాబిచ్చిరి

'మీరు చెప్పిన దేవాలయము శిథిలమైన దీనాఁడు కాదు మన ప్రభువు గారి తాతముత్తాతల కాలమున అప్పటినుండి అది యట్లే యున్నది పాలకులకు వైష్ణవాభిమానులు లేకగాదు తగిన కారణమున్నది ఒకసారి గణపతి చక్రవర్తిగారు సహితము తదాలయ పునర్నిర్మాణ ప్రస్తావన సభలో తెచ్చిరి అప్పుడుకూడ అణఁగియున్న ప్రాఁతకారణమె తిరిగి తలయెత్తినది ఆ కారణ మేమందురా? అన లా దేవాలయ మతి పురాతనము దాని నిర్మాణము గురించిన ఇతిహాసము తెలిసినవారు రెండుమూఁడు తరము లిటీవల లేరు వైష్ణవులది విష్ణ్వాలయమందురు బౌద్ధులది యొకనాఁటి బౌద్ధస్తూప మందురు బౌద్ధస్తూపమును చతురస్రాకృతిగ పూడ్చి మీదిభాగమున విష్ణ్వాలయమును బలాత్కారముగా నిర్మించిరని వాదింతురు నిజమున కా ఆలయము క్రింది భాగము సాంద్రఘనచతురస్రము కదా। విష్ణ్వాలయములలో నది విలక్షణము వైష్ణవుల నాదిగ విష్ణ్వాలయమే అందురు అదే కాదు మరొక శివాలయము లోని శివలింగము అశోక స్తంభరూపాంతరమని బౌద్ధులు ఉపపత్తులు చూపిరి అదృష్టవశమున ఆ రెండు దేవాలయములు శిథిలజీర్ణములు ప్రస్తుతస్థితినిబట్టి ప్రభువు లెంత ప్రయత్నించినను బౌద్ధులు మహోద్దండవేదండకరతాండవము మానలేదు అన్యాధీనము అనుటకు ఆధారము లున్నచో అంగీకరింతు మనిరి వివాదగ్రస్తమై అనిర్ణేయమైన విషయమున ఉభయమతసమ్మతశీలియగు పరిష్కర్తకు ఉపేక్షయె ఉత్తమసాధనము కదా। అందువలననె గణపతి చక్రవర్తిగా రీ విష్ణ్వాలయమె గాక శివాలయమును సైతము విస్మరించిరి అట్టియెడ వారికి పక్షపాతదృష్టి నారోపించుట అవివేకమే కదా।'

యథావాక్కుల అన్నమయ్య కా సమాధానము ఇంత గ్రంథ మున్నదా యనిపించి సంతృప్తి కలిగించినది ఆస్థానపండితులు గనుక మీ కా సంగతి తెలిసినది అల్పజ్ఞులము మమ్ము మన్నించునది' అని యథావాక్కుల అన్నమయ్య కరములు మొగిడ్చెను

'యథావాక్కులవారయినందుకు మీరు యథావాక్ప్రియత్వము మిక్కుటముగ కలవారే।" అని భాస్కరభట్టారకులు సంతోషించెను

అంతలో నచటికి అకాలపరిళయమేఘోదయమువలె అగ్నిహోత్రి చయనులు అవతరించెను ఇంకను అవతరించకయె "ఆర్షమతోద్ధరణమునకు నాందివాచకమైన..' అని ఘర్ఘరధ్వని వినిపించెను

'దైవదత్తవరప్రసాదమైన ఆర్షమతము ఒకరి ఉద్ధరణకు ఒదిఁగి యుండునది మతొకరి నిరాదరణకు పరిప్లవమందునది కాదు పవిత్రములైన ఆర్షమతధర్మములు స్వయంప్రకాశములు" అని భట్టారకు లనిరి

అగ్నిహోత్రిచయను లూరకొనలేదు

వ్రకాశకసామగ్రి లేక వ్రపంచములో నేదియు ప్రకాశింపదు" అనెను

ఆట్టిది కేవల భౌతికము అధ్యాత్మికమహత్త్వము గల ఆర్షమత సూక్ష్మత మీకు అందునట్టి పదార్థము కాదు వాదము వృథావాగ్వ్యయమె కాఁగలదు ' అని మరల భాస్కరభట్టారకు లనిరి

యథావాక్కుల అన్నమయ్య ఆకర్ణనకుతూహలుఁడయ్యెను

"ఆర్షమతసూక్ష్మత నాకే అందునట్టి పదార్థము కాదా ? అచ్చపు బ్రాహ్మణుఁడనే। అని చయనులు తీవ్రముగ అడిగెను భాస్కరభట్టారకులు ఇట్లు జవాబిచ్చిరి

'ఆ మమకారమె అబ్రాహ్మణత్వము

జాతి గుణప్రధానమా ?'

మరల చయనులు తీవ్రముగ వ్రశ్నించెను

'సుదూరము యోచించిన ధర్మసూక్ష్మ రహస్య మదియే।" అని భాస్కరభట్టారకు లనిరి

అప్రామాణిక విషయ చాలనము అని చయనులు ఘూర్ణిల్లింపెను

భాస్కరభట్టారకులు మాటాడలేదు

యథావాక్కుల అన్నమయ్యకు వాదమాగిపోవునేమో అనిపించినది

అట్లు జరుగనిచ్చునా అగ్నిహోత్రిచయనులు ?

మీరు చెప్పునది అశాస్త్రీయము మనుధర్మ వ్యతిరేకము '

మనువే సర్వజ్ఞుఁడు కాదు సర్వజ్ఞుఁడే మనువుకాదు మనవలె నతఁడును విద్వాంసుఁడు శాస్త్రకారుఁడు।'

అయిన బ్రాహ్మణ్యమన్న మీ భాష్యము ?"

ఒకరి భాష్య మెందులకు ? ఏ శబ్దమునకును తదర్థవివరణమే భాష్యము. బలవదాకృష్టబహూకార్థములు వ్యాఖ్యాతృధీవైశద్యమునకు మేధాకౌశలమునకు మాత్రమే నిదర్శనములు రాగద్వేషరహితమైన వినిర్మలాంతఃకరణపావిత్ర్య మున్నచో బ్రాహ్మత్వము సువ్యవస్థితమగును కనుకనె సంకరజన్ముఁడయిన వేదవ్యాసుఁడు నిషాదకులజుఁడైన వాల్మీకియు బ్రాహ్మణ్యులు "

'వ్యాస వాల్మీకులు మీ రన్నట్లు గుణప్రాధాన్యమునఁ గాక జన్మతః బ్రాహ్మణులని నా నిశ్చయము

'అదెట్లు సంభవము '

'ఎట్లు సంభవమా ? ఉదాహరణకు వాల్మీకిని తీసికొనుఁడు నిషాద కులస్థుఁడయిన 'విజయుఁడు తపోవినిహతపూర్వదేహుఁడై 'వాల్మీకి అయ్యెను నిషాదశరీరముకంటె వాల్మీకిశరీరము భిన్నము పూర్వజన్మమును ఉత్తరజన్మమును మృతి పృథగ్భూతము చేసినట్లు నిషాదజన్మమును బ్రాహ్మణ జన్మమును తపస్సు వేఱుచేసినది కనుక నిషాదుఁడు విజయుఁడే। వాల్మీకి బ్రాహ్మణుఁడు కారణము తపస్సు జన్మ సదృశమగుటయే।'

జన్మపావకత్వశక్తిగల తప స్సెట్లు జన్మసదృశము ? మీ రన్నట్లు తపస్సు జన్మసదృశమగుచో తదతీతజన్మపావకత్వశక్తి యెట్లు ఎర్యవసిత మగును ?'

సాదృశ్యము పూర్వోత్తరగతి పృథక్కరణమువఱకే।'

'అంతవఱకు అవసరమైనదన్నమాట।'

'కారాదా ।

'అదెట్లు పొసఁగును చయనులుగారూ ? అని అంతవఱకు వారి వాదము మూఁగవోయి వినుచున్న యథావాక్కుల అన్నమయ్య ప్రశ్నించెను అగ్నిహోత్రిచయనులు మోము జేవురించుకొనెను

భాస్కరభట్టారకు లిట్లనిరి

'శాస్త్రము హఠాత్స్వయంసముత్పన్నము కాదు జనవర్తనాధారము ధర్మప్రమాణము అనుసంధించిన మానవమేధాయంత్రనిర్మాణము నిర్మాత యొక్క వ్యక్తిత్వము కాలముయొక్క కాలుష్యము సమాజస్థితి ప్రభావించి సహజత్వమును కృతకముచేయును కృతకమన్నది సత్యశివేతరసుందరము కృతకత్వవిలసితమైన శాస్త్రములు వైదికమతపరమప్రమాణములు కాఁజాలవు అపౌరుషేయమైన వేదవిహితధర్మమె నిజమైన ఆర్షమతధర్మము అపౌరుషేయ

ఘటనత్వ మూలకమైన దివ్యతచే ఆర్షమత ధర్మములు సర్వదా స్వయం ప్రకాశమానములు సత్యశివేతరసుందరములు గాక సత్యసమ్మతములు. శివేతరక్షతములు ఆర్యమతలక్షణము విశ్వకల్యాణముగాని వినాశనముకాదు. ఆర్షమతపరమావధి పరమేశ్వరసాయుజ్యము అదే మోక్షసాక్షాత్కారము '

ఇంతలో ఆ దారి నెవరో వెళ్ళుచుండిరి యథావాక్కుల అన్నమయ్య ఆతనిని పిలిచెను అతఁడు దగ్గఱికి వచ్చెను మువ్వురకు ప్రాంజలి ఘటించెను ఆతనివైపు తర్జని ప్రసారించి అన్నమయ్య భట్టారకులవంక తిరిగి ' ఈతఁడు రాజోద్యోగి బహువృద్ధు అని మరల ఆ వృద్ధరాజభటుని వంక తిరిగి ఏమోయి! నీకంటె పెద్దవారు మనరాజభటులలో మఱొకరు కలరా?' అని ప్రశ్నించెను లేరని సమాధానము

అగ్నిహోత్రిచయనులకు ఆ వృద్ధరాజభటుని చూడఁగా ఏమో అనిపించినది ఎందుకో అతనిలో ఏదో విశేషమున్నదని తోచినది అక్షి రెప్ప వాల్చక వృద్ధభటుని చూడసాగెను

' ఎన్నఁడు నొంటరిగ బైటికిరావు ఈనాఁడు వచ్చినకారణము?' అని అన్నమయ్య వృద్ధరాజభటు నడిగెను

రాజవేషధారణము కనిపించదేమి?" అని భట్టారకులు సంశయమును ప్రకటించెను

అగ్నిహోత్రిచయనుల దృష్టి మాత్రము ఆ వృద్ధ రాజభటుని మీఁదనె లగ్నమై స్తంభించి పోయినది

సాధారణమానవునివలె సంచారము చేయుటకు నాకు స్వాతంత్ర్యము లేదా! అని వృద్ధభటుఁడు నవ్వెను

కాదు ఏదో కార్యాంతర నియుక్తుఁడవైగాని ఇట్లు వేషరహితముగ వీధికి రావు '

అనేక వేషములలో వచ్చెదను '

గూఢచారివా!

రాజభటుని వేషము లేనంతలో గూఢచారినా?'

' విచిత్రముగ మాటాడుచున్నావే!

సెలవు దయసేయుఁడు

సరేగాని మనుమసిద్ధిపై దండయాత్ర ప్రకటించిరా?"

మీ కింకను తెలియదా? పెద్ద దండయాత్రను ప్రకటించుటకు మనుమసిద్ధి ఏపాటి మహారాజా? సాహసోపేతుఁడై స్వాతంత్ర్యము ప్రకటించెను. మన సేనలు హెచ్చరిక చేసినవి. మనుమసిద్ధి సామంతుడుగ నుండుటకు కప్పములు గట్టుటకు అంగీకరించినాఁడు. అంతయు మూడు క్షణములలో ముగిసినది. కాని సామంతుల స్వాతంత్ర్య ప్రకటనమునకు మన సామ్రాజ్య స్థితిగతులను తెల్పి సమయానుకూలత కలుగఁజేయుచున్నది మనవారేనఁట. చారులు సమాచారము తెల్పిరి. రాజద్రోహపరాయణుల అన్వేషణమునకు విశ్వప్రయత్నములు సాగుచున్నవి. మరింక సెలవు. ఇంటికిపోయి వెంటనే కోటకు వెళ్ళవలసిన సమయమైనది' అని వృద్ధరాజభటుఁడు వారియొద్ద సెలవు దీసికొని వెడలిపోయెను.

విశ్వాసపాత్రుఁడైన రాజసేవకుఁ డితఁడు. మా నాయనగారి కితఁడు మంచి నమ్మకముగల మిత్రుఁడు. అందువలనఁగాని లేకున్న ఇతనితో మాటాడుట మనకు కష్టమే అయ్యెడిది' అని యథావాక్కుల అన్నమయ్య వృద్ధరాజభటుని గురించి చెప్పెను. భాస్కర భట్టారకులు తలపంకించిరి.

అగ్నిహోత్రి చయనులమనస్సు కలకబారినది. ఊరివెలుపలి గోమాయు రుతము అతని గుండెలోనుండి వెలువడుచున్నట్లయినది. పాడువడిన ప్రక్క యింటిలోని గబ్బిలపుఱెక్కల చప్పుడుకూడ గుబులుకొనెను.

'పొద్దు పోయినది. ఇఁక ముగింతము' అని భాస్కర భట్టారకులు లేచిరి. యథావాక్కుల అన్నమయ్య కూడ లేచెను. అగ్నిహోత్రిచయనులు వారి ననుసరించెను. పరస్పర ప్రణామ ప్రకటనములతో అన్నమయ్య అగ్నిహోత్రిచయనులు అరుగు దిగిరి. భాస్కరభట్టారకులు లోనికి దారి తీసెను.

"సామంతుల తిరుగుబాటు కాకతీయ సామ్రాజ్యమునకు లెక్కకు రాకుండఁబోవుచున్నది. సరే కానిమ్ము. అన్నిటికిమించిన మందు అంతః కలహము. అప్పు డర్థము కాఁగలదు అగ్నిహోత్రిచయనులెవరో। సమయము రావలెను. మహారాజు శైవరాజు కావలెను. అప్పుడు భట్టారకులవారు స్వయం ప్రకాశమానము లందురో, ప్రకాశించి నానుగ్రీని పాలింతురో। నానావిధ హీనమైన నాస్తికమతము నామరూపరహితము కావలెను. ఆస్తికమతము విశాలసృష్టిలోని ప్రత్యణువున ప్రజ్వలించి తీరవలెను. దైవానుగ్రహము దైవానుకూలత కేల సంప్రాప్తము కాదో చూచెదను.'

అగ్నిహోత్రిచయనులు ఆవేశపరవశమున అడుగు ముందునకువైచెను.

రుద్రనాయకుఁడు ద్విధావ్యగ్రత నందెను అతనికి కాత్యాయని రూపము సాక్షాత్కార మగును ప్రణయామృత పరిషేచన మందును హేమాద్రిరెడ్డి నిష్ఠురపరుషాలాపములు స్ఫురణకువచ్చును పౌరుషాగ్ని ప్రజ్వలన మందును అటు—కోమల సుకుమార భావప్రసారము ఇటు—పౌరుషాభీల ఫణీంద్ర ఫూత్కారము రుద్రనాయకుఁడు తట్టుకొనలేక పోయెను ఆ సంకటస్థితినుండి తప్పించుకొనుటకు అతఁడు సదా గ్రంథపఠనమో చిత్రరచనమో చేయును అందువలన కొంత ఉపశమనము కలుగును అది కారణముగ రుద్రనాయ కుఁడు అహోరాత్రములు నిద్రాహారములు మాని చిత్రశాలకు అంకితమై పోయెను

భద్రాంబ కొడుకుస్థితిచూచి భయవిహ్వల యైనది భర్తతో మొఱపెట్టు కొన్నది కృష్ణనాయకుఁడది పరిగణించుస్థితిలో లేఁడు అతని దృష్టియంతయు రాజభవనములపై అగ్నిహోత్రచయనులు "సమయము వచ్చును వేచి యుందము అని చెప్పెను సమయములేదు సందర్భమునురాదు ప్రతి సమయము ప్రభుత్వ విశిష్టతాపాదకమే ప్రతి సందర్భము ప్రభుభక్తి విలసితమే ఇంకెట్లు వైష్ణవధ్వజ ప్రతిష్ఠాపనము ?—ఇదీ కృష్ణనాయకుని జంజాటము

ఇఁక హేమాద్రిరెడ్డి ఎంత కుదుర్చుకొందమన్న నతనికి కృష్ణనాయకుని వైఖరి నచ్చకుండెను అతని సామరస్య మాత్రమున రాజద్రోహ మహా దోషము తనకు ప్రాప్తించునేమో యన్నంత భయము కాత్యాయనీ రుద్రనాయ కుల సమావేశము అందుకు ప్రాతిపదిక యెప్పుడగునో యని సందేహము ఫలితముగా కాత్యాయనిని స్వయంభూదేవాలయమునకు వెళ్ళవలదని శాసించెను తండ్రి ఆజ్ఞాపనము కాత్యాయని శిరసావహించెను యథార్థమైన దైవభక్తికి ఆశ్రయము స్వచ్ఛమయిన అంతరంగము గదా। అప్పటినుండి ఆమె పూజా కృత్యములు స్వగృహమునందే

అట్లు మూఁడు సంవత్సరములు గడచినవి

* * *

ఆనంద వసంతము వచ్చినది కాకతీయ సామ్రాజ్యలక్ష్మి క్రొంగ్రొత్త అలంకారములు కైసేసికొన్నది రాజప్రాసాదమున గణపతి దేవచక్రవర్తి గవాక్షద్వారమున వసంతశోభ తిలకించుచుండెను ప్రతీహారి పనుపున జాయప నాయకుఁడు ప్రాసాదములో ప్రవేశించి ప్రభువునకు మత్తగజకరసముత్కీర్తనము భంగి కయిమోడ్చెను

'ఏమైన విశేషములు కలవా ?"

గణపతిదేవచక్రవర్తి ప్రశ్నించెను

'చిత్తము జాంఘాలికుల నివేదనమున్నది '

ఏమది ?' అని గణపతిదేవుఁడు సమీపస్తంభస్థగితశశికాంత శిలా నిర్మిత సింహవిగ్రహ శీర్షమును స్పృశించెను

జాయపనాయకుఁ డిట్లు చెప్పఁదొడఁగెను

అద్దంకి పాలకుఁడైన మాధవదేవుఁడు అకాలమరణమునకు గురి అయిన ఎడల సారంగపాణి రాజయ్యెను అది జరిగి ఇంకను పది దివసములు కాలేదు అప్పుడే సారంగపాణి స్వాతంత్ర్యము ప్రకటించెను అంతేకాదు మనుమసిద్ధిపై దండయాత్ర సంకల్పించెనఁట। అంతయుఁ గాద నాకది దక్షిణాపథ జైత్రయాత్రా సన్నాహ మనిపించును ఆ సారంగపాణికి అనుకూలముగా మనుమసిద్ధి నృపాలుఁడు మరొక మహావిపత్తులో చిక్కుకొని యున్నాఁడు

' ఆదేమి ?

అటు సారంగపాణి యుద్ధసన్నాహము ఇటు దాయాదుల దావాగ్ని '

' వా రెవరు ?

"అక్కన్న బయ్యన్నలని అపూర్వ సహోదరులు। నెల్లూరు మండలమునకు వారసులమని వారి ఊహ అనేక పర్యాయములు వారు మనుమసిద్ధిని పదభ్రష్టునిఁ జేయుటకు ప్రయత్నించి విఫలులైరి ఈసారి వెనుకటివలెఁగాక నూతన పథకము పన్నిరి '

ఏమది ?

అక్కన్న బయ్యన్నల కుట్రలు మాధవదేవుఁడు బ్రతికి యుండఁగనె ప్రారంభమైనవి మాధవదేవుని పదచ్యుతునిఁజేసి సారంగపాణిని పాలకునిఁ జేతుమని ప్రలోభ పెట్టిరఁట సారంగపాణి అక్కన్న బయ్యన్నలకు వశంవదుఁడయ్యెను కాని అదృష్టవశమున వారి కుట్రలు ఫలించకయె మాధవదేవుఁడు పరమపదించెను సారంగపాణి పాలకుఁ డయ్యెను అంతటితో అక్కన్న బయ్యన్న లాఁగలేదు సారంగపాణిని వలలో వేసికొనిరి వారి దమననీతికి లోఁబడి సారంగపాణి దండయాత్రకు సిద్ధపడెను ఇటు సారంగపాణి దండెత్తివచ్చుటేగాక అటు మనుమసిద్ధిపై గంగయసాహిణి కూడ దండెత్తి వచ్చునట్లు ఆ అపూర్వ సోదరులు రంగము తీర్చిరి ఏకకాలమున ఒకవైపు సారంగపాణి మరొకవైపు గంగయసాహిణి కలిసి మనుమసిద్ధిని చుట్టి

ముట్టడింతురు అధర్మ యుద్ధము నేఁటికి వింటిమి మనుమసిద్ధి మన సామంతుఁడు పరిపాలన దక్షతకల సర్వసమర్థుఁడు అతనికే విపత్కరస్థితి "

అయిన మనుమసిద్ధి ఏమాలోచించెనో '

'మనుమసిద్ధి మన సాహాయ్య మపేక్షింపఁ గోరెనఁట '

అదెట్లు సంభవము ?'

నిజమే మనమే యుద్ధరంగమున ప్రవేశించిన దక్షిణాపథ మంతట దారుణ వాతావరణము వ్యాపించఁగల ప్రమాదము లేకపోలేదు ఇది అదనుగా పూర్వశత్రులు పురిగొల్పి ద్రావిడ రాజ్యాధిపతులు మనపై దండెత్తి వచ్చును కళింగాధిపతికూడ కలుగఁజేసికొననా చెప్పనక్కఱలేదు ఉత్తరాపథము నాక్రమించి దుర్భేద్యమైన ఏకశిలా దుర్గమునకు భయపడి సమయప్రతీక్షలోపడిన మహమ్మదీయులకు మన ప్రదేశము అమర్చిపెట్టిన అమృతాన్నము కాఁగలదు పరస్పర సహాస్థరారహితులయిన దక్షిణాపథ పరిపాలకులను చీల్చి చెండాడుట కధి చక్కని అవకాశమగును మీఁదుమిక్కిలి మహమ్మదీయులు శతఘ్ని ప్రభృతి నూతన సాధన సంపత్తి కలవారు కనుక ఇప్పట్టున తాటస్థ్యమె మనకు అవశ్యానుసరణీయము '

మన కర్తవ్యమదే।"

గణపతిదేవ చక్రవర్తి నిశ్చయముగ పలికెను

'మరొక విశేషము మన సాహాయ్యమును పొందుటకు మహాకవి తిక్కనగారు రాయబారిగ వత్తురఁట।"

'రానిమ్ము ఎవరు రాయబారిగ వచ్చిన ఏమున్నది ? ఈ క్లిష్టస్థితిలో స్వచ్ఛందతా రక్షణమె ఆవశ్యకము అంతఃకలహములు పెచ్చుపెరిగిన సామ్రాజ్య భవితవ్యమె శంకావహ మగును కనుక రాయబారిగ ఎవరు వచ్చినను తాటస్థ్యమె మన కర్తవ్యము

గణపతిదేవుఁడు పునరుద్ఘాటించెను

జాయపనాయకుఁడు సంతసించి నతశీర్ష నమస్కృతుఁడై సెలవు దీసికొని రాజప్రాసాదము వెలువడెను సరాసరి హేమాద్రిరెడ్డి ఇంటికి అశ్వారూఢుఁడై పయనమయ్యెను

* • *

జాయపనాయకుఁడు యథాపూర్వముగ హేమాద్రిరెడ్డిచే ఆహ్వానింపఁబడెను కాని హేమాద్రిరెడ్డి మోమున విషాదరేఖలు ముసురుకొని యుండుట జాయపనాయకునకు విస్మయము కలిగించెను

ఎంతటి పరిస్థితిలోను ప్రాణభయము కలుగని వజ్రహృదయమునకు వైక్లబ్యమా? అని ప్రశ్నించెను

ఇది వీరత్వమునకు సంబంధించినది కాదు కుటుంబ విషయము గుండె కుతికిలపడక తప్పనిది"

"అంతటి ఉపద్రవమునకు హేతువు?

'కృష్ణనాయకుఁడు!

కృష్ణనాయకుఁడా?

జాయపనాయకుఁడదొక విధముగ దృష్టి ప్రసారము చేసెను

అతఁడే మా బావ మంచియు చెడ్డయు నెఱుఁగని పట్టుదల మనిషి పౌరుషావేశ ప్రధానుఁడు। మాకు వచ్చిన మాటపట్టింపులకు మా తొల్లింటి శపథములకు భంగకరముగా ప్రవర్తించినాఁడు

"ఏమది?'

'మేమిద్దరము మా పిల్లలకు తప్పక మేనరికము చేయుదుమని మరణశయ్యలపైనున్న మా తండ్రులకు మాట ఇచ్చితిమి, అందుకు విరుద్ధముగా మా బావ ఇప్పుడు—

'వివాహ ప్రయత్నము లితరత్ర చేయుచున్నాఁడా?

'చేయుచుండుట కాదు చేసెను తన కొడుకునకు మఱొక సంబంధము నిశ్చయించెను లగ్నముకూడ పెట్టిరికాఁబోలు। ఇదివఱకు అభిమానావేశములకు లోనై నేనుకూడ పెద్దలకిచ్చినమాట మఱచితిని ఇప్పుడది జ్ఞప్తికివచ్చి ప్రాణము కటకట పడుచున్నది మా కుటుంబములమధ్య మూడేండ్లుగ జాతిగోడలు వెలసినవి రాకపోకలు లేకపోయినవి బంధుత్వము చట్టబండలైనది నా తోఁబుట్టువు భద్రాంబ భర్త నొప్పించుటకు విశ్వప్రయత్నము చేసినదని వినికిడి ఏమి లాభము సంబంధ నిశ్చయమైన తర్వాత విషయ మంతయు నెఱిఁగి ఆత్మాభిమానము చంపుకొనియైన ప్రవర్తించుటకు అవకాశము లేదుకదా?—

హేమాద్రిరెడ్డి దీర్ఘనిశ్వాసము విడిచెను

'పాపము కష్టదశయే!"

జాయపనాయకుఁడు జాలిపడెను

హేమాద్రిరెడ్డి ఏమియు మాటాడలేని స్థితికి వచ్చెను జాయపనాయకుఁడు ధైర్యము చెప్పసాగెను

"సామాన్య సంసారివలె సంతాపమా వీరపురుషునకు? చాలు చాలు కృష్ణనాయకుఁడు సంబంధము నిశ్చయము చేసికొన్న అంతకంటె ఎక్కుడు సంబంధము నీవు నిశ్చయము చేసికోవచ్చును నీ కుమార్తెకు పెండ్లికాదని భయమా? పెద్దల కిచ్చిన మాట నిలఁబెట్టవలెనను అభిప్రాయము ఎల్లర కుండును ఎట్లు సాధ్యము? అంతయు మన యిష్టమేనా? దైవనిర్ణయము దుర్లంఘ్యము కదా। లెమ్ము అబలవలె ఆత్మపరితాపము వెళ్ళఁగ్రక్కుకొనుట వలన ప్రయోజన ముండదు

ఆ మాటలు వినికూడ హేమాద్రిరెడ్డి అంతర్మథనము అంతరించలేదు అటులే ఖిన్నుఁడై యుండెను కొంతసేపు పరిశీలించి బాయపనాయకుఁడు మెల్లగ లేచెను

ఒకానొక సత్వర ప్రభుకార్యాచరణకు మనము ప్రధానామాత్యుల నిప్పుడు సందర్శింపవలసియున్నది

బాయపనాయకుని ఆజ్ఞాపన మింకను ఆలకించుచునే హేమాద్రిరెడ్డి అటులే వచ్చెదను అని లేచెను ముహూర్తకాలమున హేమాద్రిరెడ్డి ప్రయాణసన్నాహము పూర్తిచేసెను బాయపనాయకునితో గృహప్రాంగణమునకు వచ్చెను జవనాశ్వములు జూలువిదల్చి సకిలించినవి

వా రిద్దరు అశ్వారూఢులై వెడలిరి

౧౨

విడిదిగృహము కస్తూరికలయంప గులాబింపులు కర్పూరఘుమఘుమార్భటులు మత్తుకలిగింప పెండ్లిపెద్దలు హైమఱచిరి తరుణవయస్కులు చదరంగముఁ బఱచిరి బాలకులు కొందఱు దివ్వటీలపై ఎగిరిపడు శలభముల వింతగాఁ జూచుచుండిరి కొంటెకోణంగులు మఱికొందఱు పువ్వులను అఱ చేర పట్టకొనుచుండిరి వధువుపక్షమువారు వరునిఁజూడ వచ్చుచుండిరి, పోవుచుండిరి రుద్రనాయకుఁడు కంచుకాగడా చేరువలో మణిస్తంభము మాటున నుండెను అటుచూచి యొక పెద్ద క్రీనీడలో నుండరాదు వెలుఁగులోనికి రమ్మనెను అంత మఱొక వ్యక్తి అప్పుడు మా బావముఖము మసకచీకటియైనను మా చెల్లెలు చెంతకు వచ్చెనా వెయ్యికాగడాల వెలుఁగే। కోటిసూర్యుల ప్రభయే। అని పరాచికమాడెను ఆయన తోడగుడ్డ పెండ్లికొడుకు అతని మాటలకు రుద్రనాయకుని పెదవులపై ఒక నిస్తేజోవికారహాసవీచిక తాణికి త్రుటిలోనే మాయమైపోయెను రుద్రనాయకుని దృష్టిలో మణిబంధమునకుఁ గట్టిన మామిడాకు తోరణము కంకణముకాదు కంటకము। పసఁడిఫాలమున మూఁడురేకలుగా తీర్చిదిద్దిన కల్యాణ తిలకము త్రివళీకృత వికటభ్రుకుటి

పరిస్ఫుటీకరణము సువర్ణాంచల దుకూలధారణము సుకుమార కుసుమాస్త్ర జిఘాంసనము పైకి పెండ్లికొడుకు లంతరంగికముగా లలిపీరమున క్రీడఁబడిన అజకిశోరము

అట్లు కొంతసేపైనది పచ్చని పందిరిలో తప్పెటలు తాళములు మ్రోఁగినవి ఏకశిలానగర గంధర్వాప్సరోభామల గజ్జెలు ఘల్లుమన్నవి ఆ మేళము ఓరుగంటికే కాదు తెనుఁగుసీమకే పెట్టినది పేరు పుష్పవల్లి మేళనాయిక ఆమె ప్రౌఢ భరతశాస్త్రాభినయమున ప్రఖ్యాత భరతుఁడే సదస్యుఁడైన ఆమె ప్రయోగము చూచి లక్ష్యలక్షణము తా నంతగా లక్షింపలేదనవలసివచ్చును మూలమునకు మెఱుఁగులు తుఱఁగలించు మెలకువలు శిల్పపు మలపులు పుష్పవల్లికి పుట్టుకతో వచ్చిన విద్యలు అందచందములకును ఆమెదే అగ్రతాంబూలము ప్రవరప్రవృత్తులకు ఆమె వరూధిని అనఁగా పత్నీవ్రతభంగము వాటిల్లని పవిత్ర శృంగారమునకు ప్రబంధనాయిక నలకూబరసన్నిభుల కామె రంభయే । సామాన్యులకు చాపముగొన్న రూపము అట్టి సభలోనికి పెండ్లికొడుకు రుద్రనాయకుని వివిధ వాద్యములతో తీసికొని వచ్చిరి పట్టుకంబళిపై నుపవిష్టుఁ జేసిరి మెఱుపుతీగవంటి కులుకులాఁడి యొకతె రుద్రనాయకునిపై గొజ్జఁగినీరు చల్లినది కుసుమకోమలాంగి కొండొకతె చందనగంధ మలఁదినది జంగమ పుష్పలత నాఁతెల్లు వేతొక జవరాలు పట్టు వింజామర పట్టినది

పుష్పవల్లి మణిమేఖల సవరించుకొన్నది చిఱుగజ్జెల రత్నమంజీరము చిందులాడినది ఆమె మార్దంగికునకు మ్రొక్కినది కుసుమశరాంకురము తాకిన హృదయము స్పందించునట్లు లామె నృత్యభంగిమలో సభావందనము సమాచరించినది సాత్త్వికభావప్రధానముగా లాస్య మారంభించి గీతికకు ఆలాపన మందుకొన్నది ఇతర వేశ్యలు పల్లవిపట్టిరి సదస్యు లందఱకు సమ్మదరసోత్కట రోమాంచ మొదవినది రుద్రనాయకున కట్టి అనుభూతి కలుగలేదు అప్సరస్సదృశలైన వేశ్యాంగనల నృత్యభంగిమ లతని మేన సరీసృపములు మెలికలు తిరుగుచున్నట్లనిపించినవి మృదంగమృదురవములు ఎటులాఎటులామని ప్రిదులు ఎదుగులయినవి సుకుమార ముఖవీణా నిక్వణనములు కర్కశాతికర్కశములయినవి సభాసదు లందఱికి రససాక్షాత్కారము రుద్రనాయకునకు మాత్రము రసాభాసము

ఆకస్మికముగ కాహళధ్వని కత్తివలె ఆకసమును దూసికొనిపోయినది అనుక్షణమె మంగళవాద్యములు మ్రోఁగినవి సన్నాయిమేళము సాగినది పెండ్లిపందిరి యొక్కసారిగ ఫెళ్ళుమన్నది జనసమ్మర్దము కిటకిటలాడినది పురోహితుని మంత్రోచ్ఛారణమునకు నభోవీథి పులకరించి నక్షత్రములు

తొలకరించినట్లు దీపికావెలుఁగులు నల్దెసల ప్రసరించినవి పేరంటాండ్రు పట్టుచీరలు సైతము పెళపెళలాడినవి పెండ్లికుమారుని వివాహవేదికకుఁ గొని రమ్మను వర్తమానము వచ్చినది తోడగుఱ్ఱ పెండ్లికొడుకు తొందరపెట్టెను రుద్రనాయకుఁడు అస్వాధీనుఁడయ్యెను మంగళవాద్యములతో మంత్రములతో రుద్రనాయకుఁడు వివాహవేదిక నధివసించెను వివాహక్రమ మారంభమయినది మరబొమ్మవలె రుద్రనాయకుఁడు 'ఊఁ' అనుచుండెను అంతే! కడకంటి చూపు విసరి కనీసము పెండ్లికుమార్తెవంక చూడలేదు కలాపము యథావిధిగ సాగుచున్నది ముహూర్తపు గడియలు సమీపించినవి మంత్రోచ్చారణము హెచ్చుస్థాయి నందుకొన్నది మంగళవాద్యములు మారుమ్రోఁగినవి పురోహితుఁడు రుద్రనాయకుని చేతికి మంత్రపూత పదార్థము నొసఁగి వధూశిరోభాగమున కైసేయుమని చెప్పెను రుద్రనాయకున కది వినిపించెనో లేదో పురోహితుఁడే అతనిచేయి నెత్తెను అగ్నిసాక్షిగ ప్రమాణములు పలికించెను అక్షతలు వర్షించినవి వరుఁడు వధూగళమున మంగళసూత్రము కట్టెను మరల సేసలు తొలకరించెను

వివాహముఖ్యాంగము ముగిసినది పరిశిష్ట వైవాహిక కార్యకలాపమును ముగిసినది అరుంధతీ సందర్శన మారంభ మయినది 'అదిగో అరుంధతి' అని పురోహితుఁడు తర్జని ప్రసారించెను ముదుసలి ముత్తైదువ ఎగ్గురొంతరల నడుమనున్న పెండ్లికుమార్తె మోము నెత్తెను రుద్రనాయకుఁడును ఊర్ధ్వముఖుఁ డయ్యెను పురోహితుఁడు సమంత్రకముగా వసంతజలము ప్రోక్షించెను అనంతరము గృహప్రవేశము గుమ్మములయొద్ద వధూవరులను పెద్దలు పేరంటాండ్రు పేరులు చెప్పనిదే లోనికి ప్రవేశింపనీయ మని పరిహాసమునకు దిగిరి వధూవరులు పెదవులు కదల్పకుండిరి పెద్దల హెచ్చరిక హెచ్చయ్యెను తప్పనిసరియైనది "హేలాంబిక నేను వచ్చితిమి" అని యెట్లో రుద్రనాయకుఁడు పలికెను పెండ్లికుమార్తెకు వంతు వచ్చినది హేలాంబిక ఎట్లో పెదవికదిపి బావ— అని ఎగ్గుపడిపోయి మఱి మాటాడలేకపోయెను బావ యనుమాట రుద్రనాయకునకు వజ్రఘాతమైనది ప్రథమాక్షర శ్రవణమే కాత్యాయని మృదూచ్చారణ వైఖరిని ముద్రవైచెను కాత్యాయని కన్నులకు కట్టెను అంతటితో నతని అంతరంగము శతధాశీర్ణశకలమైనది శతఘ్నులు పేలినవి అగ్నిపర్వతములు పెటిల్లున బ్రద్దలైనవి అమాంతమతనికి కాత్యాయనియెడ కాంక్ష ప్రవృద్ధమైనది అణచుకొన్న ఆవేశము వేయితలల నాగై బుసకొట్టినది తదవస్థలో మంగళహారతులు చెవికెక్కలేదు యాంత్రికముగా మందిరాళిందమున అడుగుపెట్టెను

అంతయు పరికించు కృష్ణనాయకుఁడు 'అమ్మయ్య!' అనుకొనెను

కన్యాప్రదాత ఎన్నమనాయకుని యొద్ద సెలవుఁ దీసికొని విడిది గృహమునకు వేంచేసెను ప్రత్యేకముగా ఏర్పాటుచేసిన పర్యంకమున మేనువాల్చెను సమీపమున బంధువులుచేయు ఊరేగింపు సన్నాహమునకు సంబరపడుచుండెను పెద్దపెట్టున పెండ్లి ఊరేగింపునకు యత్నములు జరిగినవి అందఱు ఆయత్త పడిరి 'అప్పుడే పెండ్లిజరిగి జామైనది ఇంకను ఊరేగింపు లేదేమి?' అని కొందఱు ప్రశ్నలు వేయసాగిరి మొత్తముమీద విడిది గృహములోని వారం దఱు పెండ్లిపందిరిలోనికి దారితీసిరి వాద్యకారులు సన్నద్ధులయిరి మేళతాళ ములు సిద్ధమైనవి పెండ్లిపందిరిలో బోయీలు ముత్యాలపల్లకిని తెచ్చియుంచిరి తోడగుడ్డ పెండ్లికొడుకు వధూవరులను తీసికొనిరమ్మని పదేపదే పిలచెను

ఎప్పటికిని వధూవరులను తీసికొనివచ్చు జాడ కనిపించలేదు ఎందుకో తోడగుడ్డ పెండ్లికొడుకునకు తొట్రుపాటు కలిగెను ఏమియుఁ దోచక నిలఁబడి పోయెను కొంతసేపటికి లోపల పెద్దకలవరమేర్పడెను అది వీధిలోనికిని ప్రాఁకి నది ఇంటిలోనివారు వీధిలోనికిని వీధిలోనివారు ఇంటిలోనికిని కాలుగాలిన పిల్లులవలె తిరుగసాగిరి అర్థముగానికేకలు వినవచ్చెను అంతయు అగమ్యమై తోడగుడ్డ పెండ్లికొడుకు తలకిందు లయ్యెను ఆతురత అతనిని వేగించెను, ఆందోళన మధికమయ్యెను హఠాత్సంచలనహేతువు దుర్గ్రాహ్యమయ్యెను మఱి సహించలేకపోయెను తోడగుడ్డ పెండ్లికొడుకు దారిలోనివారిని త్రోసికొని లోనప్రవేశించి 'వధూవరు లింకను ఊరేగింపునకు సిద్ధముకాలేదా?' అని అటనున్న వారిని ప్రశ్నించెను ఎవ్వరును అతనికి బదులు చెప్పలేదు అతనికి మతిభ్రమణము కలిగినంతపనియైనది కడకు ఒకవృద్ధు నాలుక వెళ్ళబెట్టి 'పెండ్లికొడుకు లేఁడఁట!' అనెను ఆమాట వినుచునే ఆ తోడగుడ్డ పెండ్లికొడుకు పంచప్రాణములు నిలువున ఎగిరిపోయినవి అచటి కప్పుడే వచ్చిన కృష్ణనాయకుఁడు కూకటివేళ్ళతో మహావృక్షము నేలఁగూలి నట్లు కూలఁబడెను ప్రశాంతశోభావహమైన పచ్చని పెండ్లిపందిరిలో కల్లోలము తాండవించినది ఉత్సాహచంద్రికలు వికీర్యమాణములయిన హృదయములలో అమావాస్యాతిమిర లాస్యములు ఆరబ్ధములయినవి

౧౩

శుక్లపక్షము గడచినది స్నుషాసహితుఁడై ఏకైకపుత్త్రుఁడు వచ్చునని కన్నులలో వత్తులుపెట్టుకొన్న భద్రాంబ కుమారుఁడు విచిత్రముగా నదృశ్యుఁ డైన యుదంతము విన్నది కంటికి మింటికి ఏకధారగా విలపించినది కడకు మంచము పట్టినది చిక్కి శల్యమైనది ఆకు మెదలిన ఆమెకు పుత్త్రాగమన భ్రాంతి తలుపుసవ్వడి వినిపించిన కొడుకు వచ్చెనేమోయని కొందలపడును మొదట కుమారుని దారుణ ప్రవర్తనమునకు దందహ్యమానుఁడైన భర్తను

కొడుకును వెదకించునట్లు వేధించినది భార్య నోదార్పవలెనో తనయుని దూషింపవలెనో అన్వేషింపవలెనో కృష్ణనాయకునికి అయోమయస్థితి కలిగెను భద్రాంబ పోరుపడలేక అన్వేషణ ప్రయత్నములు తలపెట్టెను ఎంత వెదకియు ఎన్నాళ్ళు గడచియు రుద్రనాయకుని జాడలేదు

ఒకనాఁడు భాస్కరభట్టారకులు కృష్ణనాయకు నింటికి వచ్చిరి అప్పుడు భద్రాంబ కుమారుని కొఱకై ఒకటే రోదనము అనునయ వాక్యములతో కృష్ణనాయకుఁడు ఓదార్చుచుండెను

'వజ్రమువంటి పుత్రుని వదలుకొంటివి। అని భాస్కరభట్టారకులు సఖేదముగ కృష్ణనాయకుని పలుకరించిరి అసహాయ దీనదృక్కులే కృష్ణనాయకుని సమాధానములైనవి పాపమా పెండ్లికొమార్తె లేఁతహృదయమెంత గాయపడినదో। ఎంతగా దురపిల్లుచున్నదో। పరాత్పరా। ఎంతటి దురవస్థ ఘటించితివి। మంగళసూత్రధారణమయిన మఱుక్షణమునందే భర్తృవియోగమా ?—' భాస్కరభట్టారకుని ఆర్ద్రకంఠము కంపించినది కృష్ణనాయకుఁడు తలవాల్చెను భద్రాంబ తేలకన్నులావైచి చూచుచుండెను

రుద్రనాయకుఁడు వచ్చు నవకాశము లేకపోలేదు అని భాస్కరభట్టారకు లనుటతడవు భద్రాంబ ఉలికిపడెను కృష్ణనాయకుఁ డాశగాఁ జూచెను మావాఁడు వచ్చునందురా। పరమ కిరాతకునిగా నన్ను భావించువాఁడు నాగుమ్మము త్రొక్కునందురా ఆలీ లోకమున నాకొడుకు కలఁడా — అని భోరున విలపించెను కృష్ణనాయకుని దీనత్వము భట్టారకున కాశ్చర్యము గొలిపెను 'ప్రాకృత మానవునివలె వీరపురుషుఁడు విలపించుటా ? చాలు రుద్రనాయకుఁడు రాకపోఁడు అతని స్వభావము నా కెఱుకయే ఉద్రిక్తమయ్యును ఉపశమించు హృదయమతనిది బ్రతిమాలి చేయవలసిన మేనరికము కాదని మీరు బలవంతముగా వైసంబంధము నంటఁగట్టిరి అది భరించలేక రుద్రనాయకుఁడు పలాయనము చేసెను అయినప్పటికి అతనిని రప్పించుటకు అవకాశము లేకపోలేదు రుద్రనాయకుఁడెంత పౌరుష గంభీరుఁడో అంత కళాలోలుఁడు। కవిత్వమన్న కరఁగిపోవును చిత్రలేఖనమన్న చిత్తమిచ్చును సాహిత్యగోష్ఠియనిన సాగిలపడును ఏకశిలా నగరములోని చతుష్షష్టి కళాసంతోత్సవములకు తప్పకవచ్చును కాని అజ్ఞాతముగా వచ్చి పోవునని నాభయము అతఁడు ఇంటిపట్టునకు రావలెనన్న మీరొక వాగ్దానము చేయవలెను అని భాస్కరభట్టారకులు కృష్ణనాయకునివంక చూచిరి

దుఃఖాశ్రు సమ్మిశ్రమైన దృక్కులతో కృష్ణనాయకుఁ డంగీకృతి ప్రకటించెను

రుద్రనాయకు నెటులైన ఇంటికిఁ దీసికొని వత్తును మీ రెవ్వరు నేమియు ననరాదు వివాహ విషయ మసలే ప్రస్తావింపరాదు వాని మార్గమున వానిని వదలివేయవలెను అతనిని సక్రమపథమునకుఁ దెచ్చు బాధ్యత నాది రుద్రనాయకుఁడు మీకు పుత్త్రుఁడే కావచ్చు నాకు శిష్యుఁడు గురుశిష్య సంబంధము గురుతరము కాక మెలకువ యెఱుఁగని హెచ్చరికవలన మేలు కంటె కీడు మిక్కుటము అట్టి తొందరపాటు నీకు అజన్మసిద్ధము అని భట్టారకులు కృష్ణనాయకునివైపు సాభిప్రాయముగఁ జూచిరి

మీ ఆజ్ఞానుసారము వర్తింతును మా రుద్రనాయకుఁడు వచ్చుటే మాకు పదివేలు।' అని కృష్ణనాయకుఁడు ప్రాంజలిఘటించెను భాస్కర భట్టారకు లింకను ధైర్యవచనములు పలికి తరువాత వెడలిపోయిరి

కృష్ణనాయకునకు భాస్కరభట్టారకుని పద్ధతి విస్మయము కలిగించెను రుద్రనాయకుఁ డెక్కడ నుండెనో వారిబ్రహ్మదులకు తెలియరానపు డీ ఎచ్చి బ్రాహ్మణుఁ డెట్లు తీసికొనివచ్చును? కేవల మీయన మాటలు ఉన్మాద జల్పనములు। అని ఒకసారి నిస్పృహవహించును కాదు భాస్కరభట్టారకులు ఘటకులు తప్పక రుద్రనాయకుని తీసికొనిరాఁగలరు రుద్రనాయకునకును భట్టారకు లనిన భగవత్సమానులు అని మఱొకసారి విశ్వాసము కుదుర్చుకొనును అంతలోనె 'అగ్నిహోత్రిచయనులుగారికి లేని అవ్యాజానురాగము తనపై భాస్కరభట్టారకుల కేల కలుగవలెను? అని ప్రశ్నించుకొనును అగ్నిహోత్రిచయనులు స్ఫురణకురాఁగానే కృష్ణనాయకుని దృక్చక్రములో కాకతీయసామ్రాజ్యము గిఱ్ఱున తిరిగినది అనేకవిధములైన ఆశాతటిల్లతలు కృష్ణనాయకుని కన్నులలో మిఱుమిట్లు గొలిపినవి అదేసమయమున భద్రాంబ పలవరించినది అది చెవిఁబడినంతనె కృష్ణనాయకుని హృదయము కోఁత పెట్టినట్లయ్యెను భట్టారకుని అభయహస్తము గుర్తునకువచ్చి ఆశపొడమెను ఆ క్షణమున అగ్నిహోత్రిచయనుల అభయహస్తము గుర్తునకువచ్చి అసహ్యము కలిగెను ఉభయులు అభయహస్తము లిచ్చిరి కాని ఎంత వ్యత్యాసమున్నది। ఎంతసేపు చయనులుగారికి రాజ్యాంగసంబంధమైన రగడ తప్ప లాతివిషయ ముండదు పాపమా భాస్కరపండితునకో శిష్యవాత్సల్యము। అని కృష్ణనాయకుఁ డొక నిర్ణయపదవిఁ జూచెను భాస్కరభట్టారకుని భావములు క్షితిజరేఖకు ఊర్ధ్వముగ మనోజ్ఞవలయితమైన నిర్మల నీలాకాశమువలె స్వచ్ఛములు। అగ్నిహోత్రిచయనుల అభిప్రాయములు అదే క్షితిజరేఖకు అధోభాగమున సంక్షుబ్ధతరంగితమైన అగాధ సముద్రమువలె భయదములు। అంతే కాదు కృష్ణనాయకుని దృష్టిలో భట్టారకుని భావములు కేవల పవిత్రోదారములు। చయనుల భావములు పరమ ప్రయోజనభాజనములు।

కాత్యాయని బాలకాలమునకు మరల స్వయంభూదేవాలయమునకు వచ్చినది. ఒకనాడు పూర్ణిమచంద్రునకు వంకపెట్టిన ఆమె నేడు విదియనాటి నెలవంకయైనది. వాడినపూవువలె కాంతివిహీనమై ఆమె తనువికాసము కోల్పోయినది. కాని గుణకారణమైన ఆత్మవికాసము మాగినకొలది పరిమళించు కేతకీకుసుమమువలె నలిగినకొలది సువాసించు వకుళపుష్పవతంసమువలె విచిత్రముగా భాసించినట్టిది. అందుచేతనే కాత్యాయని ఆలయములో ప్రవేశించి యథాపూర్వముగా స్వయంభూస్వామిని సందర్శించి యిట్లు ప్రార్థించినది —

'స్వామీ! తండ్రిమాట జవదాటలేని జనరాలను! బహుకాలముగ నీదివ్య దర్శనమునకు వచ్చుట మానివైచితిని. మన్నించు మహాదేవా! నేడు విన్నపముచేయగోరి వచ్చితిని. ఈ దీనురాలి నివేదనము సఫలముచేయుదువు గాక! మా బావ వివాహవేదిక దిగి యింతగా అదృశ్యమయ్యెను కదా! అతని రాకకొఱకు మా యత్త మంచముపట్టినది. నాకు తోబుట్టువగు నవవధూటి హేలాంబికదుఃఖము చెప్ప నలవికానిది కదా! ఎట్లైన మా బావమనస్సు మార్చి నా అనుగుచెల్లెలు హేలను ఆదరించునట్లు చేయుమది. మా బావ మహోదాత్తుడని నే తలంచితిని. భార్యను కాదని బాటలపాలైన బావలో ఉదాత్తగుణ మెట్లుండగలదు? మా బావయును హేలాంబికయును అన్యోన్యానురక్తులై గృహస్థాశ్రమస్వీకారము చేయనిదే నాకు మనశ్శాంతి యుండదు మహాదేవా! మఱి నీ దయ—

అంజలిఘటించి క్షణము అరవిందనయనములు అరమోడ్చి కాత్యాయని ధ్యానసమాధిలో నిమగ్నురాలైనది. అట్లు కొన్ని ముహూర్తములు గడిచి కాత్యాయని సమాధివీడి పూజాభాజనము చేతబట్టినది. ఉత్తేజితవదనస్ఫూర్తిలో కించిన్నిరుత్సాహము లాంఛనముగా జీరాడ కాత్యాయని మంటపముదాటి నందివిగ్రహప్రాంతమునకు వచ్చినది. ఆలనాడు చిటికము మెటిక చిన్న స్ఫోటనముచేసిన రుద్రనాయకుని చెయిదము గుర్తునకువచ్చి ముచ్చెమటలు పోసినవి. కాని కాత్యాయనిముఖముమీద ముసిరిన స్వేదబిందువులవలెనె మనసులోని మమతనువైరము తుడిచివేసినది. అంతరంగ సంక్షోభ మణచుకొని కాలు కదిపినది. సింహద్వారముదాటి సోపానశ్రేణి దిగి దక్షిణదిశగా ముందున కడుగువైచినది. అప్పుడు వామభాగమున ఎవరో తొలిమెట్టుమీద కాలిడిన అలికిడి తోచినను అటుచూడక ఆమె గృహోన్ముఖురాలయినది.

ఆగంతకుడు నైత మటువైపు చూడలేదు. పరాఙ్ముఖుడై ఆతడాలయ ప్రవేశము చేసెను. తైలసంస్కారములేక శిరోజములు అట్టలుగట్టి జడలై గుండ్రని చెక్కిలి గుంటపడి కన్నులలో సజీవ కళాకాంతులు సన్నగిల్లి

వస్త్రములు జీర్ణమై ధూళిధూసరితమై మలినదేహుఁడే గాక శుష్కగాత్రుఁ డయిన అతఁడెవరో కాదు! రుద్రనాయకుఁడు! అవును! ఏ మతని వైఖరి! ఈ యతని చూపులు చురుచురులాడును అప్పుడే మఱల వెలవెలఁబోవును అట్లతఁడు తిన్నఁగా నందివిగ్రహము సమీపించి ధ్వజస్తంభమును జేరి శిలావేదిపై చతికిలపడెను వికట కరంజ తరుశాఖలనుండి యెండిన ఆకులు జాలిగా రాలిపడుచున్నవి పరిఖాలవాలమైన విశాఖాప్రాంతమున ఒక తరుశాఖపై ఒంటి రామచిలుక వ్రాలి వాపోవసాగినది వ్యక్తావ్యక్తముగా నేదియో స్ఫూర్తికలిగి రుద్రనాయకుఁడు సింహద్వారమువంక దృష్టి ప్రసరించెను విద్యుల్లతాలవమెద్దియు మెరియలేదు ఎవ్వరును నవ్వలేదు నాఁటికిని నేఁటికిని ఎంత అంతరము! రుద్రనాయకుని హృదయములో మాత్రము కాత్యాయని మూర్తికట్టినది ఆ రాగిపణలక్ష్మి పలుకునెడవలె కిన్నెర మీటినట్లు వెన్నెల చిందినట్లు క్రొన్నన విరిసినట్లు తొలి ఉషస్సున తెలివన్నె మెఱచినట్లు విచిత్ర మధురానుభూతి నేఁ డేది?—రుద్రనాయకుని హృదయగోళములో గత కథాస్మృతులు కదలినవి మనఃఫలకము బీటలువాఱినది పాతాళగంగవలె దుఃఖాశ్రువులు చిందినవి రుద్రనాయకుఁ డచట మఱి కూర్చుండలేక మెల్లగా లేచి అతిభారముగా ఆలయములోని కేఁగెను అచట నెవ్వరును లేరు మంటపాలిందమున మాఱుమూల మనస్స్వమితత్వము లేక కూర్చుండెను

అంతరింద్రియ గురుమూర్తివలె నాఁడు కనిపించిన కాత్యాయని నేఁడు సమీపమునలేదు అలనాఁటి ఆలయ ప్రకృతియే వేఱు ఒకసారి ఆలయ తటాకములో తా నీదులాడుచు ఎగఁజిమ్మిన జలబిందువులు నాఁడు ప్రణయసీ పరిపోష స్వేదాంబువులు! నేఁడు మృగ్యము అప్పుడు కాత్యాయని 'ఇఁక నే పోయెదను బావా!' అన్నది కష్టవాక్యమయ్యు నది కమ్మని కంఠస్వరము అంతేకాదు ఇప్పు డది అర్థాంతర సార్థకము నందివిగ్రహముచెంత వసమయూరమువలె గంతులిడుచు బాలహరిణమువలె పరుగులిడుచు కాత్యాయని నాఁడెంత సమనామృతయో! ఇప్పుడో దర్శనాలభ్య! అహా! విధివైపరీత్యము! అప్పటి తేనె తేన్పులకు రుద్రనాయకున కిప్పుడు కాలకూటవిషబిందువ దాస్వాదనము! భావ్యానంద భావానందము దరుల వర్తమాన దుర్దశా విపాక దుర్గంధలహరీ ఘ్రాణోన్మాద సమ్మోదము!

సాయంకాలమైనది చల్లని పైరుగాలి వీచసాగినది నిర్మానుష్యమైన స్వయంభూదేవాలయములోని కెవ్వరో వచ్చుచున్నట్లు రుద్రనాయకునకుఁ దోచె మఱింత స్తంభము మాటున నక్కి వీను లప్పగించెను క్రమముగా వానికి ఆగంతకుల సంభాషణము వినవచ్చెను

అన్న తరించినది మహాకవి తిక్కనగారి దర్శనభాగ్య మొదవినది!"

'పరమేశ్వరుండా యేమాయన ?

అంతకంతె నధికము '

'కవులైనందుకు మీ రతిశయోక్తి విడలేదు

అతిశయోక్తి కాదు సహజోక్తియే విభూతి రేఖలతో విభావితమయిన లలాటభాగము వ్యాఘ్రపీఠమువలె విస్ఫారితమయిన వక్షస్థలము తిక్కనగారి త్రికాలాధిపత్యమునకు పీఠికలు అనంత జ్యోతిఃపుంజములు ప్రజ్వరిల్లు వారి నేత్రాంచలరేఖలో బ్రాహ్మతేజము తొంగిచూచుచుండును ఆ మహానీయుని ప్రసన్న మనస్వితకు అతని నోట వెలువడు తేటతెనుగు మాటలే ప్రత్యేకతా ప్రాతినిధికములు.

'వర్ణనకేమిగాని వారు మన గణపతిదేవులుంగారి కొలువునకు విచ్చేయుటకుగల హేతువు ?

'రాయబారమునకు

రాయబారమునకా ?

ఆశ్చర్యచకితు లగుదురేల ? '

కవలగత్తుకాదని రాజకీయంగము మహాకవులకు రమ్యతరమైనదా యని.

తిక్కనగారు మహాకవిమాత్రమే కాదు మహామాత్యుడు. రాజ్యాంగ తంత్ర నిపుణుడు. వ్యవహారదక్షుడు. ఒక్క మాటలో ఉచితజ్ఞుడు.

ఏమైనది రాయబారము ?

ఏమగును ? మన చక్రవర్తిగారు మనుమసిద్ధికి సాయపడుట కాకతీయ సామ్రాజ్య భవితవ్యమునకు భంజకమని భావించిరి స్థిరనిశ్చయము చేసికొనిరి అట్టి మహాప్రభువు తిక్కనగారి తేనెపలుకులకు ఒడలు పులకలెత్తి మంచువలె ద్రవించిపోయిరి మహాకవి మధుర సంభాషణమునకు మైమఱచిరి గభీరత నడంచి కోమలతను ప్రస్తరించిరి సంధి సంప్రదింపులు సఫలములైనవి '

ఏమి '

గణపతిదేవ మహాచక్రవర్తిగారు మనుమసిద్ధి నృపాలున కభయహస్తమిచ్చిరి తిక్కనవంటి మహాకవిని తిలకించుటే జన్మపావనముగా సభయే ఆదరించినది కదా.

ఓహో. కృతనిశ్చయము లయిన కఠిన హృదయములను సహితము కవితా చమత్కృతి కరగించివేసిన దన్నమాట.

"కవితాచమత్కార మొకటే కాదు మహారాజాగారు మహాకవిని జూచిన సమయప్రభావ మెట్టిదో గాని సుప్రసన్నులయిరి దానికి న్యాయము తిక్కనగారి మహాభారత వ్యాఖ్యానము మహారాజుగారి మనస్సును ప్రఫుల్లము చేసినది అసలే మహాభారత కథాకర్ణనము మానవజన్మమునకు ధన్యత చేకూర్చునది అందులో తిక్కనగారి వ్యాఖ్యానము అందరి పుణ్యవిశేషము

ఏమా వ్యాఖ్యానము ?'

ఆ వ్యాఖ్యానమంతయు సోదాహరణముగా సోపపత్తికముగా నేనెక్కడ వివరింపగలను ? స్థాలీపులాక న్యాయముగా మకుటాయమానమైన వ్యాఖ్యాన విశేషమొకటి చెప్పెదను— 'మహాకావ్యమయిన మహాభారతము నన్నయగారు చెప్పినటుల మహాధర్మశాస్త్రము ఆ ధర్మశాస్త్రాను సంధానమె భారతావనికి ప్రపంచసంస్తవనీయత సమకూర్చు సాధనము మహాభారతము ధర్మములకు వాదైనచోటుల మూదల। ఒక ధర్మాద్వైత ప్రతిపాదకము తత్పరమార్థ పరిగణన మానవ జీవితమునకు మార్గదర్శకము అనుచు తిక్కనగారు ధర్మవిరోధములు కొన్ని వివరించి ఉభయ ధర్మములలో ఏది ఎటు లవశ్యాచరణీయమో చక్కగ దెలుపు భారతోపాఖ్యానములు కొన్ని చదివిరి అల్ప। ఏఏ వారి కంఠమాధుర్యము వీణానిక్వణన సుకుమారమైన తిక్కనగారి సంస్కృత భారతశ్లోక పఠన శ్రవణమున గణపతిదేవుడే కాదు మహాదేవుడైనను సరే పాదాభివందనము చేయకతప్పదు భాస్కర భట్టారకులంతటి తర్కపండిత శిఖామణి తలయూచక తప్పలేదు

భట్టారకులు వచ్చిరా ?

బాగున్నది పండితపరిషదధ్యక్షులు వారు లేకుండ సాహిత్యసభయు సాహిత్యగోష్ఠియు సంభవమా ? వారు వచ్చుటేకాదు కృష్ణమేఘము గీతామృతము వర్షించునెడ గాండీవి వలె తిక్కనగారు తత్త్వార్థప్రస్తరణము చేయునెడ భట్టారకులవారు బ్రహ్మానంద సంభరితులయిరి మహాభారత పరమార్థమైన జగద్ధిత లక్ష్యమునకు శిరఃకంపనము చేసిరి '

'ఇంకేమి చేసిరి

ఆగామి చైత్రమాసారంభమున జరుగు లలితకళా వసంతోత్సవమునకు మహాకవి తిక్కనగారిని అధ్వరకర్తగా ఆహ్వానించిరి గణపతిదేవ చక్రవర్తి అప్పు డమాంతము సభావేదికమీదికి వచ్చి తిక్కనగారిని గాఢ పరిష్వంగము చేసికొని మనుమసిద్ధికి మా అందరందరు సర్వదా కలవనిరి సభాసదుల హర్ష ధ్వానములు వర్ణనాతీతము '

'ఓహో !—

తరువాత రుద్రనాయకునకు సంభాషణ వినిపించదేమ అప్పటి రుద్రనాయకుని అవస్థ విహారభంగి మహాకవి తిక్కనమాట చెవిఁబడి నంతనె రుద్రనాయకుని ఎదలో ఉత్సుకత ఉప్పొంగెను ఆ చెంతన వ్యక్తి కంఠములోని అపహాస్య స్వరమునకు ఆగ్రహము చెందెను గురుదేవుఁడు భాస్కరభట్టారకుని నామస్మరణ మాత్రమున రుద్రనాయకునకు సంపూర్ణ చైతన్య వికాసము కలిగెను చైతన్యవికాసము చైత్రికా మహోత్సవము వినంతనె గనఁటి పక్షములు ధరించెను అనంత విహాయస వీథీ విహార కలనా నిర్వికారమైన అతని చిత్తము చిత్రకళా ప్రదర్శన స్ఫురణమున రంజితమై రాగరేఖలు సవాలించెను రుద్రనాయకుఁడు మఱి అక్కడ నిలువలేక ఆలయ పురోభాగమునకు వచ్చెను తదాలయ ప్రాకారద్వారము దాటిపోవుచున్న యథావాక్కుల అన్నమయ్యను అగ్నిహోత్రదయనులను చూచెను అన్నమయ్యగారికి తిక్కనగారనిన యెంత యభిమానము। —నరే। దయనులుగారు ఎప్పుడును వికట పదప్రయోగములను ప్రత్యాఖ్యాన ప్రవీణులుకదా। అనుకొనెను అట్లనుకొను నెడ రుద్రనాయకునకు భాస్కరభట్టారకులు కన్నెదుట నిలిచినట్లు కనిపించిరి తక్షణమె గురుదర్శన త్వరమాణమై రుద్రనాయకుని హృదయము ఉఱ్ఱూఁత లూఁగినది కాలుసాఁగినది నలుదిశల సంధ్యారాగములు మసలి స్వచ్ఛామల తారకాంశువులు నీలవియన్నదీ ధవళ నీరజము లయినవి ఆయ్యవి రుద్రనాయకుని అంతరంగ స్వచ్ఛతకు అనురూపములో।—గతములో తండ్రి గుమ్మము త్రొక్కరాదని తాను బద్ధకంకణము ధరించిన సంగతి నీలి నీడలు కట్టెనుగాని మేలి వెలుఁగులో నిలువలేదు ఎన్నడులేని ఉత్సాహాతిరేకమున రుద్రనాయకుఁడు గురుదేవు ఇల్లు చేరుకొనెను

భాస్కర భట్టారకులకు శిష్యుని చూడఁగనె కల్గిన ఆనంద మతివేలము చ్యుతినందిన ద్యుతి పునరుద్దీపిత మైనటులు భట్టారకులు భావించిరి శిష్యుని కుశల ప్రశ్నల వర్షమున ముంచెత్తిరి అన్నిటికి లజ్జాసంకోచము కలిగియు రుద్రనాయకుఁడు సమాధానము లొసంగెను

పుత్త్రమోత్తముఁడవు కావలసిన నీవు కాత్యాయనీ కాంక్షమెయి కార్శ్య వైవర్ణ్యములు నెందుట తగదు పితృ తిరస్కారము సుపుత్త్ర లక్షణము కాదు'

భట్టారకులు తీవ్రముగ చెప్పిరి రుద్రనాయకుఁడు పరాఙ్ముఖుఁడయ్యెను

'అనుక్షణమె నీవు గృహమునకు వెళ్ళునది అదియే నీవు నా కొసఁగు గురుదక్షిణము' అని మఱల భట్టారకులు హెచ్చరించిరి అప్పటికిని రుద్రనాయకుని జడప్రవృత్తి నడలలేదు

భాస్కర భట్టారకు లాకసమువంక చూచిరి ప్రకృతిలోని పాండిమచ్ఛవి

కృశించి పరివ్యాప్తమయిన నైల్యవర్ణము తిరిగి ధవళాచ్ఛ మగుచుండెను. గాఢ తిమిరాంధకార బంధురమైన గగనభాగము బహుళపక్ష దళన్మృగాంకచ్ఛటోజ్జ్వల మగుచుండెను. చంద్రోదయ సందర్శనమున చందనచర్చాశీతల హృదయు లయిన భట్టారకులు మరల నిట్లనిరి:

పాపము! మీ తల్లిగారి దుఃఖమునకు పారము లేదు. నీవు కనిపించలే దనిన క్షణమునుండే ఆమెకు ప్రాణము పోయినట్లయినది. మాతృహృదయము నీ వెఱుంగనిది కాదు. మహాతల్లి, మీ యమ్మ, మంచము పట్టినది.

ఆ మాట వినుచునే రుద్రనాయకుని గుండె తల్లడ మందెను. ఒడలు కంపించెను. 'అమృతహృదయిని అమ్మకెంత అపచారము చేసితిని! పేద మనసు కల అమ్మకు అతిభార నిశ్వాసములా? అమ్మ మంచము పట్టినదా? ప్రాణముమీదికి వచ్చునా? నా వలననా?— అనేక విధముల రుద్రనాయకుం దల్లకల్లోలము చెందెను.

“అమ్మా!

మహానందివలె ఒకచో అంకె వైచెను. మఱి అక్కడ రుద్రనాయకుం డాగలేదు. తచ్ఛ్రుతతరంగ గమనవేగ ధిక్కారముగా అటనుండి కదలెను.

భాస్కరభట్టారకులు ప్రహృష్ట హృదయులై, తత్కాల సర్వాంతర్యామిని తద్యామిని దృగంతసుధాజ్యోత్స్నలు దిగంతములగుట తిలకించిరి.

౧౨

సుప్రభాతము. వసంతసుందరమైన వసుంధరావధూటికి రోమాంచ మొదవినది. సుమనోగుళుచ్ఛములు సుహాసములు చేసినవి. కృకవాకుకూజితములు కవాటోత్పాటన కుంచికాంపరాతిరము లైనవి. అరుణకిరణముల అలంతి ప్రసరణములలో మృదుల మసృణ విసృమర కిసలయ విసరచ్ఛవులు స్వచ్ఛస్వచ్ఛందము లైనవి. సరోవర సలిల సంచలన కలనా మలయమారుత వీచీ విజృంభణ భ్రమారోహణమున పద్మహృదయము ప్రఫుల్లమైనది. తదంతర్గత నీల లాంఛనము వినిర్గత భ్రమరాంగనా పర్యాలోకనలో పర్యవసించినది. సర్వాంగ సముజ్జ్వలతా సమర్థమైన న్యాయసమున్నతి సంపన్నతకు అనుద్దిష్ట నిష్యందము లయిన ఆనందాశ్రువులట్లు తుషార బిందువులు కమలినీ కమనీయ కనీనికాపత్ర పంక్తులలో కదలియాడినవి. క్రమక్రమాక్రమిత సువర్ణ ప్రభాసుభగములయిన మయూఖ మాలికలు ప్రతి మందిరాంతర మాలిన్య ధావన ధావళ్యము లగుచున్నవి.

ఆ ఏతద్రోచులలో స్మృతిరేఖలు విరిసి స్మితశ్రీతో కుసుమ మాలికా రచనలో నిమగ్నురాలయిన ఆ బాలిక హేలాంబిక.

హేలాంబికా రుద్రనాయకుల వివాహము సమీపించినది. మాఘమునకు నిశ్చయించిన వివాహము పట్టిన మాఘమున జరిగినది. జామాత జాడలేదు. ఎల్లనగన్న తండ్రి ఎన్నమనాయకుని గుండె బ్రద్దలైనది. మాసత్రయ మటులే గడచినది. చైత్రము వచ్చినది. రుద్రనాయకుఁ డింటికి వచ్చినటుల వర్తమానము వచ్చినది. ఇంటికి వచ్చిన అల్లుఁడు ఇందిరవంటి తనయ నేల స్వీకరింపఁడో ఎన్నమనాయకునకు దురూహము. అల్లుఁ డింటికి వచ్చెనేగాని ఆస్థానపండితులగు భాస్కర భట్టారకుల ఆదేశానుసారము రుద్రనాయకుని ఎవరు నేమియు అనరాదనియు రుద్రనాయకుఁ డింటికి వచ్చినది మొదలు చిత్రశాలను వీడక రాత్రింబవళ్ళు రంగు రంగుల వింతవింత చిత్రములు సృష్టించుటలో లీనమైపోయెననియు ఎన్నమనాయకుఁ డెఱిఁగి భార్యకు నచ్చఁజెప్పి కుమార్తె నత్తింటికిఁ దీసికొనివచ్చి వెడలిపోయెను. అది జరిగి అయిదారు దివసములు గడచినవి.

మల్లెమాలలను మాలిక గట్టుచున్న హేలాంబిక లీలాపాంగ రోచిస్సులలో — విశ్వశిల్పికి ప్రతిద్వంద్వియై చిత్రశాలలో ప్రాభాత శోభాప్రాభవము సృజించు రుద్రనాయకమూర్తి అచ్చముగ స్ఫూర్తి నందినది. స్ఫూర్తి నందెనో లేదో మాలికాగ్రథనము పూర్తియైనదో లేదో, ఆ తరుణి చరణములు రంగవల్లికలకు అలంకరణము అయినవి. ఆమెకు పదియారేడుల ప్రాయము. పదియార్వన్నె పసిఁడికి పర్యాయము. చాంపేయకుసుమచ్ఛదచ్ఛాయాదాయాదమయిన నవచ్ఛాయతో నవనవలాడు నవలారత్నము. ముత్తియంపుముక్కెఱ ముద్దులు గులికించు ముఖనాసిక. సుకుమారతాటంకము లయిన తాటంకముల వయ్యారపు నయ్యాటలు మృదుకపోలాలపై లీలాలోలతల నిలుపు నాయెలనాఁగ హసన్ముఖము కంఠప్రాంతము శశాంక సాంతత్యపథము. వక్షోజములపై జడకుచ్చులు ఊఁగిసలాడ పచ్చలహారము పచ్చటలాడ దండవంకలు ధగధగలాడ కాలి మంజీరములు ఝణంఝణలాడ మాలికాకలిత పల్లవపాణియై అలివేణి ఆమె నిజభవన నికట చతుశ్శాలాచతురచిత్రశాలాభ్యంతరమునకు ఉన్నయనయై వచ్చినది.

చిత్రవిచిత్రములైన దృశ్య చిత్రములతో చిన్మయములైన మృణ్మయ శిల్పములతో పటల ప్రాలంబములయిన చిత్రపటములతో ఆ చిత్రశాల యొక వెలుఁగు వెల్లువ. వేసఁగి వేఁకువ.

విశాల విస్ఫారితములయ్యె ఆస్ఫాలిత లజ్జాభరమున హేలాంబిక చిత్రశాలాప్రాంగణమంతట విచిత్ర విలోకనము చేసినది. మనోహర వినోద ప్రదములయి గూఢభీతిఁ గొలుపు గాఢ రక్త వర్ణ పరిస్ఫుటమై, ప్రాగ్భిత్తికా పర్యాప్తమై కపాల కంకాళమాలాకరాళమైన కాళికామూర్తిని కాంచి తలంచకయె తలపంచినది తరుణి. తద్దక్షిణ పార్శ్వభాగమున నథో హ్రీంకారమధ్యయు త్రిదా శూన్య కటీరమండలయు నయిన ఏకవీరాదేవి చిత్రమున్నది. తదాలోకన వ్యాకుల

తాకించిదంకురిత భక్తిభావమున హేలాంబిక హేలాగతితో మోముఁ ద్రిప్పినది అది పరమేశ్వర తపస్సంబంధమైన దివ్యచిత్రము తచ్ఛిర ధారాపాతగంగా శీకరస్నాత పవిత్ర స్వచ్ఛమృగాంకశకలం మరీచి మాలికలు మిఱుమిట్లు గొలిపినవి క్షణము సహస్ర క్షణ విజృంభణమై హేలాంబిక రెండువంక పక్ష్మములు నీలాంజన రేఖల వెదకినవి తపోనిష్ఠాగరిష్ఠ ధ్యాన సమాధిలో ప్రశాంత సమయ అలాతాంకితమువలె శివుని నయనద్వయీ జ్యోతిరేఖ లంతశ్శోభితములయినవి ఉగ్రతా రమ్యసూచకమై ఉరస్సీమపై ఉరగఫణాగ్ర రత్నరాగఘటితములు ప్రతిఫలించుచున్నవి పార్శ్వభాగమున పాణిపల్లవాంచలాంచిత పుష్పాంజలి ఘటించి పార్వతి కృపాపేక్షణ కుతూహలినియై నిలిచినది అది చూచి మీలితోన్మీలిత నేత్రయై హేలాంబిక తేరుకొని అజ్ఞాతదశాసంజాత పులకాంకుర పరవశావయవ స్వాధీన ప్రయత్నమున నిజకరకమల నీరాజన విచికిలా హారమునెదఁ జాచినది తల తిరిగినది తలఁపులు త్రవ్వఁబడినవి ఉత్కంఠజలము ఉవ్వెత్తుగ ఊరినది

గవాక్షద్వార ప్రసార్యమైన సూర్యకాంతి క్రీనీడలో సాగు చిత్రలేఖన ప్రక్రీడవంక క్రీగంటచూపు లామె ప్రసరించినది అనుక్షణమె అచటనున్న భర్తకు మనస్స్ఫూర్త నమస్కృతులు సమర్పించినది సవిలాసముగా కాలు ముందునకు సాచినది భర్తృవిలోకన మాత్ర పరమానంద భరితయైనది పక్షములు విప్పిన భావపరంపరలో నిలిచి నిలిచి నిరీక్షించినది ప్రతిక్షణ ప్రతీక్షణ పతీందువదన సందర్శన భాగ్యము సమ్ముఖసందర్భమున మృగ్యమై హేలాంబిక విషణ్ణవదన అయినది విషాదమేఘావృతమయిన హృదయాంబర వీధిలో వజ్ర నిర్ఘోషము సాగినది సమ్మదేందిమ్మర సహస్రకాంతులు వెలవేఁగి నిరాశా తమః పుంజములనె మిగిల్చినవి, హేలాంబిక ఆపాదమస్తకము కంపించిపోయినది నిరీక్షణకు ప్రతిఫలముగా నిశ్శ్వాసములు వెలువడినవి నిశితదృక్కులు నేర్పు కొనువైనది నిశ్శబ్దయోగమునకు ఆర్త్విజ్యబలము అధిక సంపాదితమైనది విస్రబ్ధ వాతావరణ చిరపరిచయము స్వంతను పునర్ముద్రించినది

ఏకీభావము లేని మూకీభావముతో ఎంతకాలము విచిత్ర దాంపత్యము? — ప్రశ్నపాతము పాశుపతమువలె పనిచేసినది హేలాంబిక ముక్తసుకుమార సుందరాస్యమునుండి విచిత్ర లాస్యగతిలో నొక కాంతిరేఖ తోకచుక్కవలె నేలరాలినది ఏమియు తోచదు కాదు తానేమియు నోచదు తానొక భర్తృ వంచిత మనోజ్ఞకుడ్య చిత్రమే అగునేమో?

భావసమాధి మగ్నుఁడయిన రుద్రనాయకుని ముఖముద్రలలో తైక్ష్ణ్య మంతకంతకు ముమ్మర మగుచుండెను అది గమనించక హేలాంబిక ఒక అచేతనావస్థకు పాల్పడినది పాల్పడుచునె అప్రయత్నముగ హస్తన్యస్త కుసుమ హారమును రుద్రాక్షమాలవలె త్రిప్పినది త్రిప్పుచునె అనాలోచితముగ

ఒక పూవును పుణికినది అప్పుడు స్ఫురణ కలిగినది — అమ్మో! తాను చేసిన పని ఏమి? పుష్పమునా పుణికినది? హేలాంబిక హృదయము వణికినది భయము తొణికినది వెంటనె చిత్రశాలాభ్యంతర పూజాపీఠ సమీపమున తెచ్చిన విరిదండ నుంచి వచ్చినదారికి విధేయముగా పాథేయమైన దైన్యముతో పాపము హేలాంబిక నిజమందిరమునకు నిష్క్రమించినది

అంతవఱకు సమాధినిష్ఠితుఁడై భావాంబర వీధికి అవ్వలి వెలుఁగులలో ఐక్యమైపోయిన రుద్రనాయకునకు ఇహలోక స్పృహ కలిగినది చిత్రశాలా ప్రాంగణముదాటి రాయంచవలె నేతెంచు రామారత్నము నరసెను నిర్గమన సమయ చలనాంగ ప్రసరన్నవ లావణ్యరమ్య దీధితులతో హేలాంబిక కనిపించినంతనె రుద్రనాయకునిలో మధురభావోదయ మయ్యెను మదన శరాఘాతము తగిలెను సంభ్రమ సంచలితుఁడై లేచెను ఆమె వెనుదిరిగి చూచినది ఆమె వదన వైవర్ణ్యమునకు రుద్రనాయకుఁడు పరాఙ్ముఖుఁ డయ్యెను పార్శ్వకుడ్య చిత్రములలో పరమేశ్వర ఫాలాక్ష ప్రసారిత ప్రళయాగ్ని జ్వాలా ప్రవాహాభిముఖ ప్రకంపన సాంగమన్మథావస్థ అచ్చొత్తినట్లు కనిపించి రుద్రనాయకుఁడు అభావ చేతస్కుఁడయ్యెను

అదే సమయమున భాస్కరభట్టారకు లచటికి వచ్చిరి ఆయన వచ్చుచునె కుమార సంభవమునుండి కొన్ని ఘట్టములు తీసుకొని "నీవు వ్రాసిన కుడ్యచిత్రము లతికాళిదాసములు! నాకు బ్రహ్మానందమయినది అనిరి

రుద్రనాయకుఁడు గురుదేవునిఁ జూచి మొదట గగుర్పాటు చెంది మెల్లగ అంజలి ఘటించి 'గురుదేవా! ఇదంతయు మీ అనుగ్రహము రూపకల్పనము చేసినది నేనే కావచ్చును కాని కాళిదాసాది మహాకవుల కావ్యములు పాఠము చెప్పి హృదయమునకు హత్తించి మధుర ఘట్టములకు మాలో ప్రాణప్రతిష్ఠ చేయించినది మీరే!' అనెను

భాస్కరభట్టారకులు మందహాస పూర్వకముగా మఱికొన్ని చిత్రములు పరిశీలించిన పిమ్మట ఇంతటి పరాకాష్ఠ సామాన్యభావుకునకు అందినదికాదు" అనిరి రుద్రనాయకుఁ డింకను కామదహన చిత్రపటమునె పరికించుచుండెను అది భాస్కరభట్టారకునకు అవగతమైనది

'సుదృఢ చిత్తమును నిజకాంతా సుముఖమే!' అనిరి

నిజకాంత!'

రుద్రనాయకుని అధరములపై నిర్జీవహాసము వెలసెను అతని దృష్టి అప్పుడు మఱొక చిత్రముపై ప్రసరించెను అది రుక్మిణీకృష్ణుల ప్రణయ చిత్రము

భాస్కరభట్టారకు లది చూచి అలఁతిగ నవ్వి గ్రంథపఠనము జ్ఞానసముపార్జనమునకే. అయినప్పటికి అపమార్గానుసరణము తగదు. రుక్మిణీకృష్ణులు ప్రేమోపజీవులయ్యును ధర్మబద్ధముగ నుద్వాహ మయినవారు. అష్టవిధ వివాహములలో రాక్షసమొకటి. ఆ శబ్దముయొక్క మార్దవ ప్రామాణ్యములు నీకును సువ్యక్తములే. కాక నీవు అన్యథా వివాహితుఁడవు. ఆ దారికథావిజీవిత మేమి కావలెను? అని ప్రశ్నించిరి

రుద్రనాయకుఁడు మాటాడలేదు. భట్టారకులె మఱొక చిత్రమువంక దృష్టి ప్రసరించిరి. అది సీతారామ కల్యాణ చిత్రము

రామాయణ మహాభారత గ్రంథములు మనకు పరమాదర్శములు. అందలి మహాత ధర్మమును ధ్వనితముచేయు ఘట్టమును నీవును చిత్రించితివి. జానకీరాఘవులు లక్షణముగా వివాహితులైకదా అనుకూల దాంపత్యము నద్వితీయముగా గడిపిరి.' అనిభట్టారకులు తెలిపిరి

రుద్రనాయకుని దృష్టి ఆ చిత్రముపై సంలగ్నమయినప్పటికి అంతరాత్మలో రుక్మిణీకృష్ణుల చిత్రమె ప్రతిఫలింప నాగినది. ఏమి తలపోసెయు, ఎంత తర్కించియు అతని మనఃఫలకమున కాత్యాయనీ స్థిరముద్ర చెఱఁగకుండెను

'క్షమింపుఁడు నా మనస్సంతట కాత్యాయనియే. ఆమెగాక అన్యస్త్రీకి నా హృదయ పీఠమున స్థానము దుర్ఘటము. మనోభీష్ట మనతిక్రమణీయము కదా.' అనెను

'మనోభీష్టమని చోరత్వాది వివిధ ప్రవృత్తులు సమర్థ్యములా?

ప్రేమ చోరత్వాది ప్రవృత్తులలో నొకఁ డందురా?'

ప్రేమ దివ్యమే. మనోభీష్ట మనుటతో కలుషిత ప్రవృత్తి యగును. దివ్యమగు ప్రేమ ఏకవ్యక్తి సంకుచితమైనచో దివ్యత్వ మెట్లు వ్యవస్థిత మగును? భగవంతుని ప్రేమ సమస్త చరాచర జగత్తులో నొకేతీరు. అట్లే నీవు భార్యను ప్రేమింపవచ్చునే?

రుద్రనాయకుఁడు నవ్వెను

"అసలు ప్రేమ యొకానొక భావము. గుణగణములతో అందచందములతో ఆకర్షణ కలుగును. అన్యథావ ప్రేరణ లేనపుడా ఆకర్షణమె స్థిరపడును. అది మనోవికారము. దానికి వశ్యమగుట దానభావము. మనోవికారమే సర్వజగన్నియంతృత్వ శక్తిగా భావించుట అవివేకము."

కాదు ప్రేమ ఏకైకము శాశ్వతముకూడ అంతేకాదు అన్యథా వర్తింపదు '

అనార్యభావమది చార్వాక మతిప్రభావము నీకు నెత్తి కెక్కినది నీవు ప్రేమించిన స్త్రీ నీకు కావలెననట్లు ఒక స్త్రీ ప్రేమించిన నీవు ఆమె కేల అక్కఱలేదు ? నీకొఱకై హేలాంబిక ఎంతగా దురపిల్లుచున్నదో ఎఱుఁగుదువా ? నీ ప్రేమకు నీకెంత అధికార మున్నదో ఆమెకు నట్లేకదా ! ఇంతకు నీవు ప్రేమించు కాత్యాయనికి నీయెడ ప్రేమ కలదో లేదో ? ఆమె ఎవ్వని భార్య యగునో ?

కొంచెము ధాటిగ భట్టారకులు మందలించిరి రుద్రనాయకుఁడా తీవ్రతకు మౌనము వహించెను

ఉదారముగా నయిన హేలాంబికను ఉద్ధరించునది స్వార్థత్యాగమే ప్రాజ్ఞలక్షణము వీరధర్మము సంస్కారమునకు ఫలము అని చెప్పి భాస్కర భట్టారకు లటనుండి వెడలిపోయిరి

కాత్యాయని పరునిభార్య అగునా ?

హేలాంబిక దుఃఖాబ్ధిమగ్న అగునా ?

రెండేరెండు ప్రశ్నలు విచ్ఛుకత్తులై రుద్రనాయకుని అంతరాత్మలో గాయముచేయ సాగినవి చిత్రినంజ వననిర్గమన సమయ చలనతనూ ప్రసరన్నవ లావణ్య దివ్యదీధితులతో హేలాంబికా నిర్వికారతా సాక్షాత్కారము స్వయంభూ దేవాలయ సంహద్వారాపగమన సమయ చలనావయవ ప్రభవన్మయూర నృత్య భంగిమలతో కాత్యాయనీ కామ్యరూప సాక్షాత్కారము పర్యాయ క్రమములో కలిగి ఏది ఉపాదేయమో రుద్రనాయకునకు అయోమయ మయినది కాత్యాయని యన్నది సత్వర సమాధానము మఱి హేలాంబిక మాట ?—ఆలోచనీయాంశము అది రుద్రనాయకునకు అంతకుముందు తట్టినది కాదు భాస్కరభట్టారకు లా సమస్య కల్పించిరి రుద్రనాయకుని హృదయ మూగిసలాడసాగినది

హేలాంబిక జీవిత మేమగును పతి తిరస్కృతయై పరితపించును జీవితము శూన్యము అందుకు బాధ్యులెవరు ? మంగళసూత్రధారణము చేసి నందున నేనే ! ఏమి ! నావలన అన్నెము పున్నె మెఱుఁగని అమాయిక బాలికకు ఇన్నాళ్ళంత దుఃఖమా ? ఆమె చేసిన అపరాధ మేమని ? పాపము నా మనో భీష్టమున కామె తానుగా ఆటంకము కాదు ఆమెయెడ దోషములేదు అయిన ? —మఱి కాత్యాయని ? రత్నము ప్రకాశించునట్లు లావణ్యము భాసించునట్లు కనిపించు కాత్యాయని లేనిచో నా జీవితము వ్యర్థము ఆమె జీవితము నంతే కాఁగలదు అట్లే కాత్యాయనిని కాదని హేలాంబికను వేలావధిలేని హేలా

గాండ్రించినటుల గుర్తించిరి. అగ్నిహోత్రిచయనులకు పైప్రాణము పోయినది. అనుయాయులు గజగజలాడిపోయిరి. ఒక్కరికిని ధైర్యము లేదు. ఎక్కడ పెద్దపులి వచ్చి మీఁదపడునోయని ముగ్గురును, కన్నులు మూసికొని గుండెలం జేతఁ బట్టుకొని అడుగు సవ్వడి కేమి ప్రమాదము వాటిల్లునోయని పట్టిపట్టి అడుగులు వేయుచు వారటనుండి కదలిరి. కొంతసేపటికి వారొక ఫలతరు సంశోభితమయిన మఱియొక ప్రాంతము చేరుకొనిరి. పునర్జన్మము కలిగినట్లు వారనుకొనిరి. అగ్నిహోత్రిచయనులకు విదాహమయ్యెను. ఆ యిద్దఱికి గొంతుక ఎప్పుడో ఎండిపోయినది. ఎటులో నల్దెసలు పరికించిరి. అల్లంత దూరములో ఫలవృక్ష పంక్తుల కావల శిలాప్రాకార మొకటి వారికి దృగ్గోచరమయ్యెను. ఆ ప్రాకారములో సమున్నతములయిన పూలతీఁగెలు అల్లుకొని యున్నట్లు వారికి బోధకత్తైను.

'మహారణ్య మధ్యమున నందనవనమా? ఎప్పుడును వినలేదే! ఏదేమియో చూడవలెను. అంతేకాదు ఆ తోటలో దిగుడు బావి యుండవచ్చును – పద —' అని చయనులు సహయాత్రికులను హెచ్చరించెను. దప్పిక గొన్నవారును బయలుదేరిరి. ఉత్తర దిశగా నడచి వారు నందన వన సదృశమైన పుష్పవాటిక చేరుకొనిరి. ఆశ్చర్యము! అనేక పుష్పనికుంజములతో నారికేళకదళీ రసాలమాకందతరు వితతితో ఆ పూలతోట యెవ్వరిదో? ఎందువలన ప్రచ్ఛన్నముగా నగరమునకు దూరముగా దుర్గమారణ్య మధ్యమున వెలసెనో? — అను ఆలోచనములు చయనులను పీడించెను. బంధితద్వార కవాటములు మంత్రోపాయమున తప్పించి తలుపులు తెఱచి వారు ముగ్గురును లోన ప్రవేశించిరి. రంగురంగు పువ్వులు రకరకములయిన లతలు కని ముచ్చటపడుచు తియ్యని కమ్మని పరిమళములకు మోము మొత్తి ఆనందపరవశులగుచు ఆశ్చర్యచకితులగుచు వారు వనమంతట తిరుగుచుండిరి. దాహము సహితము విస్మృతమయ్యెను. ఎంతసేపు పర్యటించినప్పటికి మనుష్య సంచారమున్న జాడ కానరాదయ్యెను. అది రాక్షసమాయ కాదుకదా అన్నంత పర్యంతము పోయి హడలిరి. మొత్తముమీద వారు విశాలమైన తోటకు నడిమ భాగమునకు వచ్చిరి. అనుచరులిఁక రాలేమని కాళ్లు సాచిరి. అగ్నిహోత్రిచయనులు మాత్రము ఆగలేదు. ఆ వనమేమిటో తుదముట్ట తెలిసికొనవలెనని పట్టుదల తీవ్రించినది. ఆరాటము గాటముగఁ గలిగినది. అట్లేఁగుచు మఱికొంత దవ్వుచని చూపులు నిగిడించెను. కిక్కిఱిసిన చెట్లసందులలో నొక పర్ణశాల యున్నట్లు తోచి కదలి వడిగ చెంతకు నడచెను.

అంతలో — ఆ నల్లని ప్రకృతిలో — అల్లంతదూరమున అకస్మాత్తుగ నొక వెలుఁగు తోచెను. అది తారకాద్యుతి సదృశము. చయనులు మఱింత చకితులైరి; దృష్టి అటే నిలిపెను. మఱికొంత సేపటికి సుదీర్ఘ విశాల కదళీదళ

అటు తాము వచ్చిన మార్గమునగాక ఇటు రాజకుమారుఁ డేఁగిన మార్గముఁగాక మతొక మార్గమున అనఁగా ప్రవేశమార్గముగాను ప్రకటితమగు సింహద్వారమున వారు పుష్పవన పురోభాగమునకు వచ్చిరి ఆ దారిని కొంతమూరము చనఁగా వారికి దవ్వుదవ్వుల నొక వటవృక్షచ్ఛాయను జనసందోహమున్న యలికిడి వినిపించి యచ్చటికిఁ జేరిరి

ఆ ఎఱ్ఱమట్టిదిబ్బల నీడలలో ఉన్నవారందఱు రాజభటులని స్పష్టముగా తెలియుచుండెను వారి నడుమనున్న వృద్ధరాజభటుని చయనులు చూచెను వెంటనే జ్ఞప్తికి వచ్చెను అతఁడెవ్వరో కాదు ఒకనాఁడు అగ్రహారమున యథావాక్కుల అన్నమయ్య పరిచయముగా పలుకరించిన వృద్ధభటుఁడే । అగ్నిహోత్రిచయనులు వెంటనే వృద్ధరాజభటుని పలుకరించెను ఆ వృద్ధరాజభటుఁడు కూడ ఆదరభావమున అగ్నిహోత్రిచయనుల కుశలమడిగెను

బుద్ధిబాహ్యమైన హోమసమిధలకయి ఘోరకాంతారసీమకు వచ్చితిమి క్రూరజంతువులవలని భయముతో దిక్కుగానక యిటఁ జేరితిమి సహజభీరువులమయిన మాకు మీరే యిఁక రక్ష అని చయనులు తనగోడు వెళ్ళగ్రక్కుకొనెను వృద్ధరాజభటుఁ డామాటలు విని పేదగుండె బ్రాహ్మణునకు అభయహస్తమిచ్చెను రాజభటులనఁగా సర్వజన సంరక్షణార్థ మవతరించిన దైవాంశసంభూతు లని యొకఁడు కత్తులు ధరించువారయిన క్షత్రియుల మనస్సులు అచ్చపు వెన్నముద్దలు అని మఱియొకఁడు చయనుల అనుచరులు పొగడిరి

పొద్దు పూర్తిగఁ గ్రుంకినది కాఱుచీకటులు కకుబంతముల క్రమ్ముకొని వచ్చుచున్నవి దూరదూరముగ సింహగర్జనములు వనేభ బృంహితములు ఘూకఘోషములు వినఁబడ సాగినవి రాజభటు లందఱు నేకగ్రీవముగ నగరమునకు పోవుట లెస్స యనిరి వృద్ధరాజభటుఁడు వలదని వారించెను వారిపై నొక కన్ను వేసియుంచిన అగ్నిహోత్రచయనులు చెవికూడ అప్పగించెను అంతకంతకు రాజభటులలో తీవ్రత హెచ్చసాగెను అప్పటికే పరివృతి పి వాతావరణము భీతావహముగ నున్నది

మీరు వెడలుఁడు నేను వెనుక వచ్చెదను '

వృద్ధరాజభటుఁడు సమ్మతి ప్రకటించెను రాజభటులందఱు కూడబలుకు కొన్నటులు అశ్వారూఢు లయిరి అగ్నిహోత్రిచయనులు కదలలేదు అతని అనుచరులు మాత్రము ముందే సర్దుకొనిరి వృద్ధరాజభటుఁడు చయనులను సైతము వారితో వెడలిపొమ్మని చెప్పెను చయనులు వినలేదు రాజభటులంతగా పట్టించుకొనలేదు ప్రాణముమీది తీఁపి కొలఁది గృహోన్ముఖులయిరి

తొలిజాము గడచినది చల్లనిగాలి చేతవెన్నెలకు జల్లెడపట్టినది

అగ్నిహోత్రిచయనులకు ప్రాణము హాయిగున్నది కాని భయము లేకపోలేదు ఆ వృద్ధ రాజభటునిఁ జూచుచు క్షణములు గడుపుచుండెను అనుమానలవ మేనియో అగ్నిహోత్రిచయనుల నాపెను రెండవ జాముకూడ సగము కావచ్చి నది ఆవఁతి దవ్వున అంతలో అస్పష్టధ్వని యేదో వినుపింప వారిరువురు నటు చూచిరి వెండియారఁ బోసినట్లున్న వెన్నెలలో వనీతల మంతయు వారికి గోచరమగుచున్నది చెట్లకొమ్మల నీడలోని భాగములు మాత్రము కనపడ కుండెను కొంతవడికి సమీపములో వెన్నెల వెలుఁగులోనికి రాఁబోయి చెట్టు నీడకు తప్పుకొనిన భల్లూకము వారికి కనిపించెను అగ్నిహోత్రిచయనుల ప్రాణము నిలువున ఎగిరిపోయెను మఱిఅక్కడ నిలఁబడ లేదు ఒకటే పరుగు గుండె లవియునటుల పరుగెత్తి దూరముపోయి చయనులు వెనుదిరిగి చూచెను వృద్ధరాజభటుఁ డింతలో అశ్వారూఢుఁడై అచటికి వచ్చెను

'పాపము పేదబ్రాహ్మణులు! ఎక్కడ దారిలో నెత్తురు గ్రక్కుకొని ప్రాణము విడిచెదరో! ఎంతచెప్పిన వినక మొండిపట్టుతో నాకొఱ కాగితిరి చేఁతులార ప్రాణముమీది కేలదెచ్చుకొందురు? రండీ అశ్వము నధిరోహింపుడు నగరమున మిమ్ము దింపి మఱల వచ్చెదను ఒకవేళ రాకున్న ఏకాకినిగా నైన మా రాకుమారి ఈ యరణ్యమునుండి రాఁగలదు' అని వృద్ధరాజభటుఁడు అగ్నిహోత్రిచయనులను అశ్వారోహణము చేయవలసినదిగా కరసంజ్ఞ చేసెను

అగ్నిహోత్రిచయనులది గమనించు స్థితిలో లేఁడు వృద్ధరాజభటుఁడు మా రాకుమారి అనఁగానే చయనుల మెదడు మెరసినది

'మీ రాకుమారి!

చయనులు ఆశ్చర్య చకితుఁడయ్యెను

వృద్ధరాజభటుఁడు తెల్లబోయెను అప్పుడతని గుండెలో పిడుగులు పడినవి వదనము వివర్ణమయినది పెదవులు ఎండకట్టినవి కనురెప్పలు కదలుట మానివైచినవి ఎట్టకేలకు వృద్ధరాజభటుఁడు గొంతువిప్పి 'రాకుమారి యెవరు? రాజకుమారుఁడయ్యా! విజయపురాజు దుర్గిదేవులుంగారు!' అని పలికెను

అగ్నిహోత్రచయను లది వినలేదు అతని కన్నుల యెదుట రత్న హారము ధగధగలాడుచు కనిపించిన స్త్రీమూర్తి కన్నెదుటికి రాఁబోయి దారి తప్పించి దవ్వుగబోయిన రాజకుమారుఁడు సాక్షాత్కరించెను

'రాజకుమారి! రాజకుమారి!'

అగ్నిహోత్రిచయనులు అవలిమోమిడి తాళము లేకనె వ్రేళులు వ్రాఁలను తాకునట్లు త్రిప్పుచు సహస్ర నామార్చనమువలె స్మరింపసాగెను అట్లు

తలఁచి తలఁచి యేదియో నిశ్చయము కలిగినటుల తలయూచి నగరికి పోద మనుచు నతఁడు తల త్రిప్పెను అగ్నిహోత్రిచయనులకు తలత్రిప్పఁగనే కన్నుల చీకట్లు క్రమ్మినవి బలవంతముగ కనురెప్పలు కదిలించి మరల చూచెను వృద్ధరాజభటుఁడు సమీపములో ఖండిత శిరస్కుఁడై పడియుండెను

౧౬

రాజాంతఃపురము శశికాంత శిలానిర్మిత కుడ్యముల వర్ణచిత్రములు వైభవోపేతముగ నున్నవి శయ్యామందిరాళిందము సహజశీతలము సగిషీ సొగసులు నటించు పటలభాగము లాక్షారుణము అతి శిల్పరమణీయము అందు సువర్ణ పర్యంకమున పట్టమహిషితో గణపతిదేవచక్రవర్తి చదరంగ మాడుచుండెను పరిచారిక యొకతె పట్టుకుచ్చుల వింజామరము విసరుచుండెను వేఱొక చేటిక పటీరజల పరిషేచన సేయుచుండెను మహారాజ్ఞి ప్రాణసఖులు ఆట చూచుచుండిరి మొదటిసారి రాజ్ఞి ఓడినది అన్యజన సమక్షమున పట్టమహిషి ఓటమి ప్రభుహృదయమును కించపఱచెను పైకిమాత్రము నిజవిజయ గర్వోన్నతి ప్రకటించెను మరల ఆట సాగినది ఈసారియు ప్రభువులదే జయము మూఁడవ పర్యాయము గణపతిదేవచక్రవర్తి కావలసి తప్పుటెత్తు వేసెను దేవేరి నెగ్గినది పట్టమహిషి విజయ మచటి పరిచారికలకు పట్టరాని సంతోషము కలిగించెను మహారాజ్ఞి ప్రాణసఖుల మాట చెప్పనక్కఱలేదు

పరమేశ్వరునికే తప్పలేదు ఒకసారి పార్వతి ప్రేంఖణము లాడునెడ కింజల్కముతో పరమేశ్వరుని కొట్టినది అందుకు త్రిలోచనుఁడు సైతము విధేయుఁడయ్యెను' అన్నదొక ప్రాణసఖి

గణపతిదేవుని గభీర వదనము గగుర్పొడిచినది నిండు హృదయముతో మందహాసము చేసెను పట్టమహిషి పేరిందేవికి పరిహాసము నచ్చలేదు మనస్సు నొచ్చుకొన్నది అట్లన్న ప్రాణసఖిని చెంతకు పిలిచి చెవిలో మెల్లగ 'రుద్రమదేవిని చూచి రమ్మ'ని పంపెను ఆ మాట చక్రవర్తికి వినిపించినది వినుటతోన మనస్సు వికలమైనది సదన మించుక ఎడవాసినది పరిస్ఫుట పద్మరాగ ప్రభాచారువులయిన అరుని ఆకర్ణాంత విశాలనేత్రములలో నొక దీధితి కొట్టపడినది అనాభిదఘ్నముగా దీర్ఘనిశ్వాసము వెలువడినది గజనిమ్మపండులు నిలుచు గండమీసాలకొసలు తృణాంచల తుషారబిందువులవలె చంచలములయినవి అదిచూచి పట్టపుదేవి అప్రతిభురాలయినది ప్రాణసఖిని పంపివేయుటకు మిషగా తానన్నమాట ఎంతటి అవస్థ తటస్థపఱచినదియు నెఱిఁగెను

గణపతిదేవుఁ డచట నిలువలేదు మందిరము వెలుపలికి వచ్చెను పునఃపునః ప్రకాశకాంతిచ్ఛటాపాటవ పాటలమయిన రత్నకిరీటము చేతఁబట్టుకొని

అచటి మణిస్థగిత మందిర స్తంభ సన్నికటమున నిలిచెను. దీర్ఘాలోచనలో వ్యగ్రత వహించెను. రిపునిరీక్ష దుస్సహ వపుర్నవనాభిరామములై మెలికలు తిరిగిన కంఠలను మలఁచిన శిల్పములట్లు కేయూరాంగద నీలాశ్మరశ్ములు కేకిసలాడినవి. ఆశ్రయ ప్రదాతల ప్రమోదఖేదములతో నిమిత్తములేని ఖేలనము లొక్క లక్ష్మికే సాధ్యములేమో!

"ఏమి చేయుదును? నా అదృష్ట మిటులున్నది. దైవప్రాతికూల్యము దుర్లంఘ్యము. ఎన్ని పూజలు చేసియు కూష్మాండినీదేవి కృపాకటాక్షములు కొఱవడినవి. విధి యెట్టి విపరీత వినోది! — కుచేల సోదరులకు సంతానము! కుబేర స్నేహితులకు సంతాపము! — ప్రాజ్య సామ్రాజ్య సార్వభౌముఁడను నాకు పుత్రసంతాన యోగము లేకుండచేసెను. ముక్తాహార కర్పూర సాంద్ర పటీర ప్రసరమందురే పుత్రగాత్ర పరిష్వంగ సుఖమును? నాకా చైతన్య సహితమైన చందనచర్చ శీతరేఖలు ఏరియు చంద్రజ్యోత్స్నాలహరీ పుణ్యస్నానము అప్రాప్యములా? ఇదా ఈ కారణజన్మ వైభవము! శాకతమ్మ వరప్రసాద మిదియా? జన్మాంతర భాగ్య మిటులున్నది. కానిమ్ము."

గణపతిదేవచక్రవర్తి తన యనంతరము పురుష సంతానము లేదని రాజపదవి అరాతిజ్ఞాతిరాహుగ్రస్త మగునని భీతిల్లి రుద్రమదేవి జన్మకాలమునందే పురుషసంతానము కలిగెనని ప్రకటించెను. రుద్రదేవుఁడని నామకరణముచేసెను. అంతఃపురమున అత్యంత జాగరూకతలు వహించి రాజరహస్యమును నిక్షేపమును నాగరాజువలె కాపాడుకొనుచుండెను. రాజోద్యోగులు ప్రజానీకము రాజకుమారుఁడే అనుకొనిరి. వీరపురుష వేషధారిణి రుద్రమదేవి ఎల్లరకు రుద్రదేవుఁడే. రుద్రదేవునకు యుక్తవయస్సు వచ్చినది. సామంతనృపులు తమతమ తనయల స్వయంవర మహోత్సవములకు శుభాహ్వానములు పంపిరి. అవన్నియు నెట్లో దాఁటుకొని రాఁగలిగిన మహారాజునకు తన పుంభావ ముద్రిత పుత్రికారత్నముయొక్క వివాహ మొక పెద్దసమస్య అయినది. విచారిత హృదయుఁడై విచిత్ర వివాహ నిశ్చయము చేసెను. ఆత్మధనమయిన అర్ధాంగలక్ష్మి సోదరుఁడు జాయపనాయకుఁడు జాగరూకతగల సంధానకర్త. చోళవీరభద్రేశ్వరుఁడు మాండలికులలో నొకఁడు. వీరయువకుఁడు. స్ఫురద్రూప కుశాగ్రబుద్ధి రాజహితుఁడు. లక్షణము లన్నియు కలిసి వచ్చినవి. గణపతిదేవునకును జామాతగా నతఁడు జాతరహస్య పరిరక్షాదక్షుఁడని తోఁచెను. ఏకాంత మందిరమునకు వీరభద్రేశ్వరుని రప్పించి జాయపనాయకుని ముఖమున వివాహ విషయము ప్రస్తావించెను. సామ్రాజ్యాధిపతి బాంధవ్యము సామంతరాజునకు సమ్మతముగాక మరేమగును? అక్కడికా సమస్య పరిష్కృతమైనది.

ఇ(క వివాహమహోత్సవము లగ్నము సమీపించుచుండెను వివాహ వేదిపై రుద్రమదేవి సందర్శనము ఆహూతులయిన అందఱకు ఆశ్చర్యకరముగును అంతటితో ఆగునదికాదది ఇంతకాలముగ వంచనాత్మక ప్రవర్తనము చేసినందులకెందఱో కుపితులు తప్తులు నగుదురు నానాసంక్షోభము రసాభాసము తప్పదు అట్టి దురవస్థ రా(దగినదికాదు మఱి విధానాంతరము ఏమున్నది? సంకల్ప బలమున సంప్రదాయము కల్లోల జలధిలో పూలనావవలె కల్పితమయినది కల్యాణ సందర్భమున వధువు పురుషవేషధారిణియై వరు(డు స్త్రీవేషధారియై యుండవలెను అది సంప్రదాయము (అన(గా వధువు పేరిటి వరు(డు వేషధారణమున నిజమైన వరు(డు వరు(డు పేరిటి వధువు నిజమైన వధువు) సంప్రదాయానుసారము వివాహాంతము వధూవరులా వేషములతోనె యుండవలెను వివాహానంతరము వీధివిటంకముననున్న వధూవరులు ఖడ్గపాణులై పాదచారులుగ వెడలి వేపచెట్టునకు పూజించి అప్పుడు గృహప్రవేశము చేయవలెను అట్లు వధూవరులు రాజాంతఃపుర ప్రవేశము చేసిన నిరాటంకమే కదా! కాని అందుకు యథార్థ వరసమ్మతి ఆవశ్యకము సార్వభౌమ దుహితృదయా తత్వము స్వప్నమునందయిన సంభవమనుకోని వీరభద్రేశ్వరు(డందుకు సుముఖు(డు కాకపో(డు కాకున్న అనంతర మహారాజ్ఞీ భర్తృయోగ మతనికి కల్ల పదవీప్రలోభము మాంత్రికుని సర్వము మఱపించెను సంప్రదాయము సర్వజన సమ్మతము

రుద్రమదేవి వీరభద్రేశ్వరుల కల్యాణమైనది ప్రకృతి రస నిష్కృతి నొందినది వసంతము పతంగమయినది గ్రీష్మము మందోష్మమయినది వర్షము ప్రహర్షము పొందినది శారద మపరశారదమయినది హేమంతము శ్రీమంతమయినది శిశిరము నమ్రశిరమయినది సంవత్సరములు రెండు సంవత్సరము అయినవి కాలపురుషు(డు మాత్రము కాంతారము చెందెను అది కాంతారమయినది దాగిన దావాగ్నులు దారుణముగా దాటివెడలినవి మృత్యుదేవత ముంచునకు వచ్చినది కాలపురుష మారిషాజ్ఞాపితయైనది ఎరిఎరుగుచ పరుగులెత్తినది విషదంష్ట్రిలు వికటాట్టహాసము సల్పినవి రుద్రమదేవి మంగళసూత్రమునకు మంగళగీతము పాడినది వీరభద్రుని దీర్ఘ సుధీర వక్షోభాగము గాఢ పరిష్వంగనపాట మొనర్చినది అతిశృంగార నాటకము పరిసమాప్తమయిపోయినది భరతవాక్య ప్రాయమై, వత్సరప్రాయమైన నిందని రుద్రమదేవి పుత్త్రిక గణపతిదేవ చక్రవర్తికి స్మృతిచిహ్నమై మిగిలెను జగన్నాటకసూత్రధారి కాలయవని కాభ్యంతరమున అయోమయ లోహ ఘంటారావము చేసెను కాలపురుష పారిపార్శ్వకు(డు నిష్క్రాంతు(డయ్యెను

ఇది యంతయును గత గాథాస్మృతి గణపతిదేవుని విహ్వల పఱచినది

క్షుభిత హృదయము మరింత సంక్షుభిత సంఘాతమైనది  మౌనవేదనా భారము మరోసహనా విదూర మయినది  తదవసరమున పట్టమహిషి సఖీజన సహస్ర పరివృతయై భూషణప్రభలు విరజిమ్ముచు సభకు వచ్చినది  అంతలో ఘటికా శాలలో మధ్యాహ్న ఘంటారావము వినిపించినది  పరిచారిక యొకతె స్నాన వేళ అని పలికినది  తదాకర్ణన జాగరితుఁడై  గణపతిదేవుఁడు మజ్జనశాల కరిగెను  ఒక చేడియ యొడలెల్ల సంపఁగినూనె అలఁదెను  ఇంకొక విరిబోణి భ్రమరాలకములు విప్పి విదిర్చి నఖాంకురముల దువ్వినది  చెలువలు కొందఱు హేమకుంభములచేసే నొసఁగిరి  మరొక మగువ అలకమార్చెను  చంద్రికవన్నె దువ్వలువతో నొడలొత్తిరి  ధౌతపరిధానములు తెచ్చి యిచ్చిరి, ఆ మహేంద్ర భోగ మహానుభూతివలన మరల గణపతిదేవుఁడు యథాప్రభుతా మానసు డయ్యెను  ప్రతినిత్యము నది పునఃపునః పరనకలాపమే।

౧౮

కతిపయ దినములు గడచినవి  రుద్రనాయకుఁడు చిత్రశాలను వీడలేదు  అతని హృదయములో ఝంఝూప్రభంజనములు వీచుచునే ఉండెను  దానికి సాయము చిత్రకళా ప్రవర్తనకు చిత్రములు సంతరింపవలెనని పట్టుదల  అతని సంక్షుభిత మనోభావ శతానేకములు  అనురూప చిత్రరచనా  ప్రేరకము లగు చుండెను  రచితానేక చిత్రములును మనోభావ కారకము లగుచుండెను  ఇప్పుడు రుద్రనాయకుఁ  డొకఁడు నూతన చిత్రము వ్రాసెను  భావించిన దానికంటె భాస్వంతముగ తయారైన యా చిత్రమునందే  అతని మనసు లగ్నమయినది  ఆ చిత్రము రచింపనెంచిన వేళావిశేషమెట్టిదో  రచింప మొదలిడిన ముహూర్త బల మెట్టిదోగాని అనుకోని అందచందములు వచ్చినవి  క్రొంగ్రొత్త వంపులు, సొంపులు కుదిరినవి  చికిలిసొగసులు చిత్రముగ నమరినవి  రంగుల కలయికయె ఒక అభూత విషయము  ఎన్ని చిత్రము లిదివఱకు వ్రాయలేదు? అవన్నియు నొకయెత్తు  ఇదొక్కటియు నొకయెత్తు  అందలి కళాలాలిత్య మట్టిది  అయిన చిత్రమునకు ప్రాణమయిన భావ మెట్టిది?

అంతటి యుద్ధముచేసి రాముఁడు రావణుని గెలిచెను  విశ్వప్రయత్నము చేసినది, విజయము సాధించినది అర్ధాంగికొఱకు  అశోకతరువు క్రింద సశోకముగ పతివియోగమందిన జానకి భర్తను చేరవచ్చినది  ఇంతకు రాముఁడామెను రావణాంకపరి భ్రష్ట యని నిందించెను  స్వీకారయోగ్యవు కావని సీత్కారము చేసెను  అగతికమయిన అవస్థకు సీత అగ్నిప్రవేశము చేసినది  అప్పుడు సీతా పాతివ్రత్యమును పావిత్ర్యమును పావనుఁడు ఋజువుచేసెను  ఇది యీ చిత్రమందలి అంశము  అదిచూచి వ్రాసిన రుద్రనాయకుఁడె ఇట్లనుకొనెను

అగ్నిప్రవేశము సీత చేసినది పావిత్ర్యమును అగ్నిదేవుఁడు నిరూపించెను గాఁగున్నది భర్తృతిరస్కారమేకదా జానకీదేవి మహాగ్ని మధ్యమునఁ బడునట్లు చేసినది మానినుల మానసమంతియు కదే — అగ్నిలో దుమికి ఆమె గనుక సురక్షిత అయినది అన్యులయిన? అగ్నిదేవుఁడు చల్లఁబడి ప్రత్యక్షమై చక్కఁబఱచునా? అసంభవము అగ్నిజ్వాలా ముఖమునఁబడిన అంగన అణువణువున భస్మమగును మఱి సీతయెడల నీ అభూత కల్పనమేమి? అందలి పరమార్థ మెట్టిది? అదికదా ప్రధానాంశము మహాకావ్యమేదియు పరమార్థ ప్రతిపాదికము రుద్రినాయకుని మన సాలోచనలోపడెను ఆలోచించినమీదట సాహస నిర్ణయములతో సతీజనమును పతులు పరిత్యక్తను చేయరాదన్నదే పరమార్థమని విశ్వసనీయముగా విశదమయ్యెను ఆ భావము హేలాంబికను గుర్తునకు తెచ్చెను 'కావచ్చునుగాక హేలాంబికకు జానకికి సాదృశ్యము నిరవకాశము అదిగాక హేలాంబిక అగ్నిప్రవేశముచేయునా? చేసినమాత్రము కలసివచ్చినదేమి? కాలిపోవును బూడిదరాశి యగును అయ్యో। — రుద్రినాయకుని తలంపు స్తంభించిపోయెను కష్టముమీద భావసంచలనము కలిగెను ఒక అమాయికురాలు నేను కారణముగ అతిదయనీయ దుర్మరణమునకు పాల్పడునా? పాపమామె నాకేమి అపకారము చేసినది? నేను కారణముగా ఆమె జీవితమేల తెల్లవారిపోవలెను? అట్లు కారాదు కారాదన్న కర్తవ్యము? మఱల నతని మనస్సు మూర్ఛనంది యెట్లో తేరుకొనెను నిజమే। — పతిపరిత్యక్తయయిన పడతి యెంతకయిన తెగించును ఏమైన చేయును ఏక్షణమున హేలాంబిక ఏమికానున్నదో। అబల। అనపరాధిని। —' అపరిమితమయిన భయము కలిగి రుద్రినాయకుఁడాపాదమస్తకము కంపించిపోయెను రక్తప్రసారము మహోద్ధృత మయ్యెను నాడీవేగముకూడ హెచ్చెను

ఆమె అకారణముగా శిక్ష అనుభవింపరాదు నేను కారణముగ ముందే అట్టి దురవస్థకు పాల్పడరాదు పాల్పడరాదన్న తానామెకు హితబోధ చేయవలెను ఏమని? ఆత్మహత్యాది ప్రయత్నములు వలదని మహాపాతకములని కదా। ఎంత అందముగ నుండును,' పతియైన తాను సతిని సహించుటలేదు సరికదా సందేశములు శిరసావహించుమని చెప్పుటా? అట్లు చెప్పిన ఆమెకు పతి యథా పైముఖ్య విహీనుఁడు కాలేదని అందుకే ఈ ముందరికాళ్ళ బంధములని ముందుగా తెలిసి తెగించుటకు సిద్ధపడుమనుటే అగును అయిన ఆమె ప్రాణహాని పొందకుండవలెనన్న తన కర్తవ్యము? అసలా కర్తవ్య ప్రశ్నకు నవకాశము కలదా? కలదు, ముమ్మాటికి కలదు ఆమె సాహసించిన అందులకెవరు కారణము? తానే — ఒకవేళ శాసనము శాంతించిన లోకము మూకమయిన నైతికముగా నరకయాతన తా ననుభవింపక తప్పదు పరోక్షస్త్రీహత్యకదా।

హేలాంబిక అంతపని చేయునా ? చేయకపోయిన చెడుగులేదు చేయక పోవుటకంటె చేయుటకే అవకాశము లున్నవి అందుకామెను అట్టి కృత్యమునకు ఉన్ముఖురాలిని కానీయరాదు రాదన్న పత్నీ ప్రాకారమె పరమధర్మము అవశ్యాచరణీయము

రుద్రనాయకుని హృదయము ద్రవించెను కరుణారసము వాహినీ రూపము దాల్చెను మతి యక్కడ నిలువ మనస్కరించలేదు ఒక్కపరుగులో నతఁడు ఇంటిలో వచ్చిపడెను అరుగుమీద కూర్చుండిన కృష్ణనాయకుఁ డాతని వైఖరి చూచియు చూడనట్లు ఊరకుండెను వాని మనసులో నేమి మథనము కలదో ?

సరాసరి రుద్రనాయకుఁడు శయ్యామందిరములో ప్రవేశించెను గదిలో అడుగుపెట్టుచునె అతని తల తిరిగినది దిమ్మెక్కినది ఒడలు వణికినది హృదయము శూన్యమయినది ఏమది ? — కటిక నేలపై హేలాంబిక శయనించినది సంస్కారవిహీనములై శిరోజములు చిక్కుపడియున్నవి ముఖము వాడిపోయినది రూపుదాల్చిన అందమును మేలములాడు ఆమె మేని సొబగు సురిగిపోయినది చూపులు నిర్జీవము లయినవి కన్నులు గాజువాఱినవి ఆమె వాలకము చూడగనె రుద్రనాయకునకు జాలికలిగెను అంతరాంతరమున వెనుకటి నిరాదరణ కారణము మెరుగుచుండెను, ఎందునిమిత్త మాయువతి శుష్కించి శూన్యదృక్కులతో సుక్కిపోవుచున్నది ? — ఒక్కటే ప్రశ్న ఆలోచన మక్కఱలేకనె దగ్ధజీవితము ఎలా అని రుద్రనాయకునకు సరియైన సమాధానము స్ఫురించెను అంతే, అప్రయత్నముగ అప్రతర్కితముగ 'హేలా !' అనెను ఆమాటకు హేలాంబిక లేవఁబోయి తూలి నిలద్రొక్కుకొని నిలఁబడినది నిరాశా నిస్పృహలతోడి సిరసము నెటులో కప్పిపుచ్చుకొని ఆమె భర్తను చూడబోయి చూడలేకపోయెను ఆమె అవస్థగని రుద్రనాయకుఁడును సూటిగ చూడలేకపోయెను ఉభయులును పరాఙ్ముఖు లయిరి క్షణము గడచెను ఇద్దఱు నొకేసారి పరస్పరాలోకనము అనుకొన్నట్లు అనుకోకుండ చేసిరి హేలాంబికను సిగ్గు వెల్లువ ముంచివేసినది రుద్రనాయకున కించుక లజ్జ పొడమెను కంపిత స్వరమున 'క్షమించుము' అనెను

హేలాంబిక ఉలికిపడెను నిజమో స్వప్నమో ఆమెకు అగమ్యముగ నున్నది వినరానిమాట వినలేననుకొన్న కంఠమున వినఁబడినది ఆశ్చర్య విస్మయ భావము లామెను క్షణము అవశురాలను జేసెను మెల్లగా కిన్నెర కంఠమున 'మీ రేమి తప్పుచేసితిరని ?' అన్నది అది రుద్రనాయకుని హృదయములో నెక్కడో మృదుమధురముగా స్పృశించెను సుకుమారముగా చఱక వేసెను 'నిన్నింతవఱకు — రుద్రనాయకుని గొంతుక అర్ధోక్తిలో మూగ

పోయెను. అది నా అదృష్టము హేలాంబిక సన్నగా అన్నది. ఆ మాట అనేక భాష్యములు విప్ప రుద్రనాయకుని ఏమనుకోవలెనో ఏమనవలెనో తోచని స్థితికి తెచ్చెను. కర్తవ్యమంతట రోచిస్సులామె అపాదమస్తకము భాసించునటు లాతనికి భావన కలిగెను. అనంతకోటి సౌదామనీరేఖలు ప్రకాశించినటుల ఆమె ఉజ్జ్వల మూర్తియై ఊహించెను. తద్దర్శనమున సుక్షాళితముగా తనలో నూతనోత్తేజము మొలకెత్తుచున్నట్లు రుద్రనాయకున కనిపించెను. అనుక్షణమె కృశీభూత సుకుమార తనూవిభవాభిరామయైన హేలాంబికను అమాంతము హృదయమునకు హత్తుకొనవలెనను భావము కలిగెను. తటాలున గవాక్షములో గభాలుమని శబ్దమయ్యెను. చంచాకుడు పారిపోవుచుండుట కనిపించెను. కిటికీలోని వస్తువులు క్రిందపడినవి. పతితవస్తు నివహములో పత్రమొకటి రుద్రనాయకునకు కనంబడెను. పరిశీలనగా సమీపించి పరికించెను.

ఆర్ద్రచిత్రావస్థలో నటులుండిపోయిన కాత్యాయని చిత్రపటమది. రుద్రనాయకుని రుధిరప్రవాహము ఎండిపోయెను. గుండెలు అంపముకోత అయ్యెను. అక్కడ క్రిందపడిన పత్రము తీసి రుద్రనాయకుడు నిదానించి చూడసాగెను. కన్నులు చెమ్మగిల్లెను. ఆత్మసుందరి దూరమగుచున్నది. అది దుర్భరము దుస్సహదురంతము. ఇంతకు ఈ కిరికిరేమున్నది? తానే ఆ చిత్రమును పూర్తి చేయలేము. భావన మిటులైన జీవన మెటులుండును? అని రుద్రనాయకుడు తలపోయసాగెను.

ఎవరి పటమందది?

సవినయముగా ధరాపతనము చెందినదన్న భావముతో హేలాంబిక అడిగినది. ఆమెవంక రుద్రనాయకుడు నిర్నిమేషనేత్రములతో చూడసాగెను. ఆ చూపునకు హేలాంబికకు భయము కలిగెను. కాని మాటాడలేదు.

రుద్రనాయకుడు కొంతసేపయిన ఎడప 'నా ప్రణయజీవిని కాత్యాయని, ఈమె నా హృదయారాధ్య దేవత. ఈమెలేని నా జీవితము నిరర్థకము. కిరాతక శక్తులు మా మధ్య అఘాతము నేర్పరచినవి' అని ఆవేశముగా పలికెను. ఆయాసము కలిగి ప్రసంగ మాపుజేసెను. అంతలో అచటికి భద్రాంబ వచ్చెను. 'అక్కాయి! మామయ వచ్చి వెళ్ళెను' అన్నదామె. ఎందులకని ఎవ్వరును ప్రశ్నించలేదు. ఉపాస్య దేవతామూర్తి అనుకొన్న భర్త అన్యకాంతానురక్తుడా అని హేలాంబిక అంతర్మథనము. కాత్యాయని కళ్యాణమట. వైశాఖమున లగ్నము 'అని భద్రాంబ ఎవ్వరు నడుగకయే చెప్పినది. రుద్రనాయకుడు ఆ!' అనెను. అప్పుడతని చూపులు పొడిబారెను. చలనము తప్పెను. ప్రాణి సహజమయిన అనుభూతిస్థితి అభావమయ్యెను. తేలిక దూదిపింజవలె వాని హృదయమెక్కడికో ఎగిరిపోయినది. ఒకటి రెండు లిప్తలు గడచినవి. నిర్లిప్తతనుండి

తేరుకొని, నిస్పృహను తోడుకొని రుద్రనాయకుఁడు చటాలున నిష్క్రాంతుఁ డయ్యెను భద్రాంబ అతని వేగమును చూచి ఉపశమురాలయ్యెను తదాకస్మిక దురావర్తయ ప్రత్యాయుధ సంపాతమున హేలాంబిక కఠిన పర్వత శిలా హృదయము ఖండిత భావ పక్షపక్షమై దుఃఖాబ్ధి మగ్నమయ్యెను

౧౯

కృష్ణనాయకుని స్వగత మిది

అగ్నిహోత్రచయనులు అఖండప్రజ్ఞానిధి మహామేధావి దేవాంతకుఁడు మోకాలికి బట్టముడికి బంధము వేసెను భూమ్యాకాశములకు వంతెన కట్టెను అరణ్యమధ్యమందలి పూలతోట చూపెను సుందరి రాజకుమారి కనిపించెనట ఎమ్మట రాజకుమారుఁడు అటుపై రాజభటులు అర్ధరాత్రమున వృద్ధరాజభటుఁడు ప్రామాదికముగా మా రాజకుమారి అనెనట అన్నంతనో ఆపదలేదు అని వాఁడు ఆత్మహత్య చేసికొనుటలోనె అసలు రహస్యము అది చయనుల మనసికి పట్టెను అత్యద్భుతముగ వాస్తవ కథను అల్లెను మొదట ఆయనకు శంక కలుగుటలోనె ఆయన ధీశక్తి అది నివృత్తి చేసికొనుటలోనె చాకచక్యము మొత్తముమీద రాజకుమారియే రాజకుమారుఁడని ప్రచారము చేసెను పథకము పన్నెను ఫలించినది

అతి నైపుణితో అందఱికి మన యువరాజు మగవాఁడు కాఁడని మంత్రోపదేశము చేసెను పౌరుషాభిమానములు కలవారి చెవులు కొఱికెను రాజకుమారుఁడు స్త్రీమూర్తి యనిన ఎవరు నమ్మెదరు? నగ్నసత్యమయిన నమ్మక ఏమి చేయుదురు? అందఱి నడుములు వంగినవి ఆనోట ఆనోటఁబడి ఆ అల్లిక కొనలు పాఱినది ఆ కంట కంత రాజప్రసాదమునకే ఎగఁబ్రాకినది నగరమంతయు గగ్గోలయినది యువరాజు పురుషుఁడో స్త్రీయో ఇదమిత్థముగ తెలుసుకొనవలెనని కొందఱికి కోరిక కలిగినది కోరిక పట్టుదల అయ్యెను కొందఱికి రాజకృతము కోపకారణ మయినది దాపరికము తమ్ము పరాభవించుటే అని తలపోసిరి మఱికొందఱు మౌనవ్రతము పట్టిరి తటస్థులెప్పుడును తప్పరు కుపితులను పరాభూతులను చయనులు కూడగట్టెను మతయాగము తలపెట్టిన చయనుల కవకాశము చిక్కెను అంతఃకలహ హోమకాండకు సామిధేని పాడెను

మొత్తముమీద మోసము బయటపడినది గణపతిదేవ మహారాజుగారి గంభీరత గద్గదస్వరము పలికినది ఇంతకాలము ప్రజల కన్నులు గప్పి పరితాప వాక్యములు పలికినంతలో పాటించువారెవరు? నీరసహృదయులు నీరాజనము పట్టుదురుగాక। పాపము ప్రభువులకు ప్రాణసంకటము వచ్చినది విషమసంధి

పాలనాధికారము వంశపారంపర్యముగ నిజకుటుంబమునకు నిక్షేపింప నిధి పాతువేసెను పాతర బయటపడినది చయనులగారి పాచిక పాఱినది రాజుగారి ఆటకట్టినది దుస్స్వార్థమునకు దురాగతము ఏమి? స్త్రీ సంతానమని చెప్పరాదా? పురుష సంతాన మన్నంతలో అయిపోవునా? రాణివాసముగాక ఇంతకాలము పట్టినది ఇటువంటి రహస్యము లెంత కాలము దాగియుండఁగలవు? ఒక స్త్రీ ఎంత సమర్థురాలయినను సింహాసన మధిష్ఠించుటను ఆత్మాభిమానధనులయిన వారు అంగీకరింపరు సచివుఁడు మొదలు సామంతునివఱకు సంకోచము కలుగును కనుక ఇంతనాటకమాడిరి ఫలశ్రుతి? ప్రజావాహానికి వెల్లువలు వచ్చినవి అధికార వర్గములోకూడ అభిమాన రేఖలు విరిసినవి ఆ జాయప నాయకుఁడు మాత్రము ప్రజావాహిని నణంచ హజారములో ధ్వజ మెత్తెనట వాఁడొక ఉన్మత్త పిశాచము ముందువెనుక లెఱుఁగని మూర్ఖుఁడు మహాగర్వి ప్రధానామాత్యుల హితబోధకు సంబాళించెనుగాని ప్రజలమధ్యకు వచ్చిన తెలిసె డిది అగ్నిహోత్రము ప్రజ్వరిల్లుచున్నది ఇంతటను వాఁడు ఆయుష్మంతుఁడు!

మహాప్రధాని గోవిందనాయకుఁడు మహారాజాగారి మనోవ్యాధికి అనున యౌషధము నొసఁగెనట సర్వసేనాని మేచయనాయకుని మేనికి చీమ కుట్టలేదట కార్యభరణుఁడు దామనామాత్యుని కంఠమున పచ్చివెలగకాయ పడినట్లయినదట అవునుమఱి వారు నిత్యము రాజుపాదము నంటిపెట్టుకొనియున్న బానిసలు ఆత్మ స్వాతంత్ర్య శూన్యులు వ్యక్తిత్వ విహీనులు ఆత్మాభిమానియన్న యొక్క-అగ్నిహోత్రచయనులుగారే। పేరుకు తగినట్లే నిప్పువంటి మనిషి కార్య సాధకుఁడు అవకాశము దొఱికినది అంతకు మించిన వన్నాగము మఱొకటి పన్నిన మహామేధావి।

కళింగాధిపతి కాపయనాయకుఁడు సర్వసమర్థుఁడు తానుగా మహావీరుఁడు పాలనదక్షతలో నద్వితీయుఁడు సామాన్యుఁడు కాఁడు అతఁడు తలచుకొన్న యావద్భారతము కైవసము చేసికొనఁగలఁడు కాని వానికి కొన్ని నీతినియమముల నీరసగుణ మున్నది పటిష్ఠమైన ప్రాంతీయ రాజ్యములతో సామరస్యమే దేశక్షేమమని ఇంతకాలము కాకతి ప్రభువులకు సుహృన్మణిగా నుండెను ఇప్పు డాతఁడు యజ్ఞపశువు అగ్నిహోత్రచయనులు వానికి భారత ప్రభుత్వయోగము కలదని ప్రలోభము కలిగించెను అంతటి ఐరావతముకూడ గోతిలో పడినది, రాజ్యవిస్తీర్ణ ప్రయత్నము రాజధర్మమే కాదు సామాన్యముగా అందఱు రాజు లకు అపరిహార్యముగా నుండు కాంక్ష తెలివైనవారు సమయము వచ్చువఱకు సామరస్యాది సామగానములు పలిపి ధర్మపన్నములు పదును పట్టుదురు సమయము వచ్చెనా సరి। అంతట కాపయ నాయకుఁడు చయనులుగారు చెప్పిన ప్రకారము ఏకశిలాపురాధీశ్వర పదయోగ్యత కలదని విశ్వసించెను గణపతిదేవు

నకు పుత్రసంతానములేమి వానికి బలమైనది ఆయన కేమితెలియును నా కొడుకు
రుద్రనాయకుఁడు పట్టాభిషక్తుఁ డగునని అగ్నిహోత్రచయనులాడించు నాటక
ములో అంతర్నాటకము కలదని ముందుగా నెట్లు తెలియును? తెలియదుగనుకనె
బలిష్ఠమయిన సమర్థమయిన ప్రతిపక్షివర్గ సమీకరణ కార్యము నెఱవేఱినది
ఈసారి దిగ్విజయమే సందేహ మక్కఱలేదు

అయిన చయనులుగారి ఆదేశానుసారము నా బాధ్యత వహింతునా?
చయనుల మాయల మరారీ తీరా విజయము లభించి ఏకశిలా నగరములో
పట్టాభిషేకము కాపయనాయకునికి చేయునా? చేయఁడు చేయగల సమర్థుఁడే
కాని నా యెడలగల సదభిప్రాయమువలననేమి కాపయనాయకుఁడు స్వజనుఁడు
కాకపోవుట వలననేమి సింహాసనము మాకే యిచ్చును ఎప్పుడు? మహా
విజయము సిద్ధించినపుడే। — సిద్ధించునా? వెనుకటివలె దుష్ఫలితములే
కలుగునా? ఇన్ని ప్రయత్నములు చేసి ఫలించి బ్రతుకుట వ్యర్థము ఆఖరి
ప్రయత్నమని అవలంబించి తుదముట్టఁ జూడవలెను ఇప్పుడును ఓటమి
అయిన తల గొట్టుకొని చావవలెను కాని అంత దుస్థితి కలుగదు చయనుల
గారు మహానుభావుఁడు కలుగనీయడు దుష్టగ్రహ దృష్టిగల అల్లాయి జాతక
చక్రమునం దిప్పుడు మహారాజయోగము పట్టినదని సిద్ధాంతులు చెప్పిరి సిద్ధాంతి
మాట శిలాక్షరము ఆయన వాచాశుద్ధి అట్టిది అదిగాక కొత్తకోడలు వచ్చిన
శుభసమయము ఆమె పాదము పెట్టినవేళ మంచిదయి గృహమే పావనమగును
అల్లాయికూడ భట్టారకులవారు చెప్పినట్లు ఆమెయెడ అనురక్తుఁడు కాకపోఁడు।
ఒకవేళ రాకున్నను మహారాజ్య పట్టాభిషేక మహోత్సవ సమయమందైన
పట్టమహిషియగు భార్యను చేపట్టక మానడు కూడగట్టిన అంగబలములో నిచట
అంతర్యుద్ధము కాపయనాయకుని పురిగొల్పి పైనుండి దండయాత్ర రాజ్యము
నాకు భోజ్యముగాక ఏమగును? చూతునుగాక। —

కర్తవ్య నిర్ణయ కఠోరదీక్షకు స్థిరముద్ర పడినది ఉద్రేకము ఉప్పెనవలె
విజృంభించినది అమాంతము మహోద్బిలంఘనము చేసినటులే మహానంద
మయినది కృష్ణనాయకుఁడు చివాలున లేచెను

అప్పటికి అర్ధనిశీథమైనది చిత్రశాలలో కంచుతాగడా వెలుగుచుండెను
అక్కడ రుద్రనాయకుఁడు చిత్రపట రచనా వ్యగ్రుఁడయ్యెను అతని ముఖము
నిండ ముచ్చెమటలు పోసినవి గాలి చొఱక ఒడలు ఉడుకెత్తుచుండెను కాని
రుద్రనాయకుఁడది గుర్తించుకొను స్థితిలో లేఁడు వాతావరణ పరిగణనాతీతుఁడై
కుంచె విదలించుచుండెను రంగు లద్దుచుండెను అర్ధరచితముగా ఆగిపోయిన
చిత్రము పూర్తిచేయ సంకల్పించి ఇతర ప్రపంచమేమియు నెఱుఁగక వ్రాయు
చుండెను ఎంతకాలము ఎటులు గడచుచున్నది అతనికి తెలియకుండెను.

తెల్లవారు వచ్చుసరి తొలికోడి కూసినది ధవళకాంతుల రోదసీకుహర పరివ్యాప్తము అగుచున్నవి చాలవఱకు కాత్యాయని చిత్రము పూర్తికావచ్చినది ఎనాయాసముగా సుందరాతి సుందరముగా తయారగుచున్న చిత్రపటము చూడ ఇది నా ప్రతిభయేనా ? అను సందేహము కలిగెను సింధూరవర్ణాంకితమయిన సన్నని పట్టుకుంచెతో చిత్రమునందలి కాత్యాయని నుదిటిఫాలభాగమున తిలకము తీర్చి దిద్దెను కాలాగరుసమ్మిశ్ర నీలవర్ణాంకితమైన మరొక సుకుమారమయిన కుంచెతో కాటుకరేఖ అలదెను ఇక చిత్రగత ప్రణయిని ప్రతిమాంతరంగ పారిశుద్ధ్య ప్రతిపాదన ప్రాయముగా పీనస్తన పరిధానాంతర కించుక మించక ధవళ రుచుల ధగధగ లాడవలెనని తలచెను అంతటితో చిత్రము సంపూర్ణాకార రేఖలు దాల్చును అంతిమ ప్రయత్నమిది అతి జాగరూకతగా రుద్రనాయకుడు ధవళచ్ఛాయా చిత్రణార్థము అప్పుడే రంగులో ముంచిన కుంచెనుతీసెను ఎందుకో చేయి వణికెను అలతి విసురు తగిలి ముంచెనున్న రంగు చిత్రపటముమీద చిందెను నిర్మాణములో విషబిందువు పడినది చివరి చిన్ని ప్రయత్నములో చిత్రమంతయు ధ్వంసమయినది అతి భద్రతాయుతముగ అపూర్వశోభా విభవముగా వ్రాసిన చిత్రపటము చిటికెలో చెడిపోయినది ! ఎక్కడలేని కోపము విసుగు వికారము జనించి రుద్రనాయకుడు ఛ అని లేచెను ఆవలకు వచ్చెను

నభోవీథిని వేగుచుక్క తోచెను అల్లంత దూరాన అశ్వహేషము విననయ్యెను రుద్రనాయకుడా దెస చూచెను ప్రయాణ సన్నాహమున తండ్రి అశ్వమును సమాయత్తపరచు సేవకుడు కనిపించెను తండ్రి ఎక్కడికి వెళ్ళును ? — అడుగువెంట రుద్రనాయకు డశ్వశాలా ప్రాంతమునకు వెడలెను

కృష్ణనాయకుడు అశ్వారోహణము చేసెను

రుద్రనాయకుడు తండ్రిని చూచెను కృష్ణనాయకుడు పలుకలేదు తిరిగిచూడలేదు 'చల్' అని అశ్వారోహణము చేసి కళ్ళెము లాగి చెలుకు విసరెను తురంగము త్రుటిలో మాయమయ్యెను మరల నేమి మాయోపాయ పాశ వివశుడయ్యెనో ! ఈమధ్య తరచు అగ్నిహోత్రచయనులుగారి రాకపోకలు సాగుచున్నవి దూరప్రయాణ మయినగాని అశ్వారూఢుడు కాడు అట్టి దిపుడు ఆయన మహావేగమున తురగమును పోనిచ్చెను శిథిలకూపములో పడిన తండ్రిగారికి సంపద్విభేదము సదా అచుంబిత మయిన అంశము ! రుద్రనాయకుడు కలవరపడెను

జవనాశ్వము దృక్పథము దాటినది మలుపు తిరిగినది ఉస్సురనుకొని రుద్రనాయకుడు లోనికి వెళ్ళెను ఆ వెళ్ళుట సరిగా శయనాగారములోనికి !

శయనమందిరములో హేలాంబిక లేదు రుద్రనాయకుడు తల్లిని చెంతంత్రిగారి ఉదంతము తెలిపి హేలాంబిక యెక్కడ ? అని అడిగెను ఆమె శయనమందిరములో నుండును అని భద్రాంబ చెప్పెను

అక్కడ హేలాంబిక అగపడదు

ఏమగును ?

భద్రాంబ పెట్టిగాఁ జూచెను. రుద్రనాయకుడు అంతర్ధానమైనది ! అని హీన స్వరమున పలికెను భద్రాంబకు ఆశ్చర్యమయ్యెను ఆమె కంగారుపడి ప్రతిమందిరాంతరమునకు వెడలి చూచినది కోడలు లేదు భద్రాంబ గుండెలు ఎగిరిపడె గృహాంగణ మంతయు గవేషించినది ఎలుఁగెత్తి పిలిచినది హేలాంబిక కనఁబడలేదు పిలుపునకు ప్రతి వినఁబడలేదు భద్రాంబ గుండెలు బాదుకొనుచు పుత్రుని సమీపించి గొల్లుమన్నది రుద్రనాయకుఁడు అయోమయావస్థలో అధఃపాతాళమున కేఁగుచున్నట్లు అంతరంగము కంపించి కంపించి హేలా ! హేలా ! అని దిక్కులు పిక్కటిల్లునంత గట్టిగా అరవసాగెను తదుచ్చైస్స్వన తరంగములు జనని భద్రాంబ హృదయ కుహరమున శతధా ప్రతిధ్వనించి వికీర్ణములయినవి

౨౦

ప్రకృతిసుందరి వసంతపు వలిపమున వెన్నెలను వడపోసినది పిల్ల తెమ్మెరలు హాయిని పంచుచున్నవి రమణీయ ప్రకృతికి వ్యక్తినిష్ఠమైన వ్యగ్రతలతో సంబంధము లేదు చల్లగాలికి భాస్కరభట్టారకులు వీధివాకిట నిలిచిరి వేసవి పగటివేడిమికి ఉడికిపోయిన ఒడలు కొంచెము శీత సుగంధిలమై హాయి గొలిపెను అగ్నిహోత్రిచయనులుగూడ ఆరుబయటకి వచ్చినిలిచెను వారిద్దరికి మధ్య రాజమార్గము అడ్డముగ నున్నది

చయనులుగారూ ! ఈ దినము వడఁగొట్టినది గాడ్పు గట్టిగా వీచినది అనుచు భట్టారకులు గోష్ఠికి ఉపక్రమించిరి

'అవునండి అని చయను లందుకొనెను

'ఈమధ్య మీరు తఱచు రాజమందిరమునకు అరుగుచున్నారు విశేషములు ? అని చయనులు ప్రశ్నించెను

"ఆఁ ఏమున్నదండీ, గణపతిదేవచక్రవర్తిగారికి కళాపోషణమన్న అమితాసక్తి —'

"కదండీమరి కళంకహృదయులైనవారికి కప్పిపుచ్చుకో గలిగినది కళాప్రియం భావుకతా మిష గదనె లెండు

చయనులు చేసిన అవహేళన అవగతమైనకూడ భట్టారకులా విషయము విస్తరింప నిష్టములేక ప్రస్తావన మార్చునెపమున ఈ రాజయోగ మెందులకు? ఈ సంవత్సరము రాజయోగఫల మెటులున్నదో చూచితిరా సంక్రాంతి పురుషుని లక్షణములు చదివితిరా? గ్రహాచార దోషమున అనావృష్టి భయమున్నది సూర్యగ్రహణ మొకటి కార్తిక మాసాంతమున గాలివాన—ఒకటా? అన్ని అవలక్షణములు సమకూడినవి' అని ఇంకను భట్టారకులు జ్యోతిశ్శాస్త్ర విషయములు చెప్పుకొని పోవుచుండెను

"ఆ మహారాజయోగమునకేమి గానండి మన మహారాజయోగమునకు తీసిపోవునది కాదులెండు అన్నట్లు భాస్కరులుగారూ! సామంత నృపులపట్ల గణపతిదేవులుంగారి విధాన మెట్టిది?'

'ఒక్క సామంతరాజులయెడ విధానమెందులకు? సర్వమానవ సమదృష్టి గణపతిదేవ చక్రవర్తిగారి ప్రత్యేక లక్షణము

ఎంత పక్షపాత మున్నప్పటికి మీరు అభూత కల్పనము చేయరాదు సుండు ప్రజలు గొఱ్ఱెలమంద అనుకొనుచున్నారేమో! మనకంటె బుద్ధిమంతులు యువరాజుగారి అజ్ఞాతకథవలన మహారాజుగారికి రావుతప్ప కన్నులొట్టవోయినదికదా! అదృష్టవంతుఁడు గనుక అధికారవర్గ బధిరాంధక శవములకు వినపడదు, కనపడదు అంతమాత్రమున కేమైనదిలెండు' అని చయనులు ఆగిపోయెను

"దైవ సంకల్పము ఎవ్వరికిని దుస్తరము ధర్మమునకే ఎప్పుడును విజయము' అని నర్మగర్భముగ సాభిప్రాయముగ చయనుల గుండెకు సూది మొనవలె సూటిగ తగులునటులు భట్టారకు లనిరి

"అదియును చూతము కళింగదేశాధిపతి వాసయనాయుని అవక్ర విక్రమ సమృద్ధి మీరు వినియేయుందురు వీరుఁడన్న నతఁడే పద్మగర్జి పరకలను కొరడాలతో కోస వినరునటులు పక్కపక్క రాజులను తరిమి తరిమి కొట్టుచుండెనట ఇరుగుపొరుగు రాజుల కా విక్రమశాలి గుండెలో బల్లెము దొమ్మన కుంపటి అట్టి సమర్థునిపంచన పాపము గణపతి దేవులుంగారికి ఏ క్షణమున ఏమి ప్రమాదము తటస్థపడగలదో!"

"అందుకెన్నఁడు కాకతీయసేనలు సంసిద్ధమే ధర్మచ్యుతు లయినచిదా దైవోపహతులగుట! మానవులు నిమిత్తమాత్రులు అన్నట్లు చెప్పమఱచితిని మనకీ రాజకీయము లెందుకు, గణపతిదేవ చక్రవర్తిగారికిని కళింగాధిపతి కళింగవర్తనము చూరాయగ తెలియవచ్చినది వారును సన్నాహమున నుండిరి దానికేమిగాని ఈ చైత్రమాసాంతమున మనరాజధానీ నగరమున లలిత కళా

ప్రదర్శనములు జరుగవలెననవి వైశాఖమున జరుగును. వర్షసన్నాహములు సాగుచున్నవి. ఏకశిలానగరమంతట ఏక పతాకోటి నందిన కళాప్రభాసమే. సాహిత్య సంపూజనములే. పండిత పరిషత్తులే.'

ఆలాగునా ?

అదొక ఘనకార్యమా యన్నటుల చయనుల భావ ప్రకటనము.

రాజప్రసాదమున సాహిత్యగోష్ఠి. ఋషిమహాలయన చిత్రికా ప్రదర్శనము. కాకతమ్మ గుడిలో నందితసభ' అని భట్టారకు లింకను చెప్పుచుండ 'అంతఃపురమున భరతనాట్యములా ?' అని అగ్నిహోత్రిచయనులు అపహాసనగ అడ్డుకొనెను. పరిహాసాత్మక ప్రసంగ శ్రవణమున ఎప్పుడు పొందని ఎక్కడలేని కోపము కోటిపడగ లెత్తి భట్టారకుని భగ్గుమనఁ జేసెను. కాని ఋషికల్పుఁడైన భట్టారకులు ఆత్మసంయమమున దశీలగుటంజేసి అరిషడ్వర్గాంశమును అణచుకొని మాఱుపలుకక మౌనియై అటనుండి నిష్క్రమించెను. ఆ వైఖరి చూచిన చయనులు వికటభ్రుకుటియై నిందాస్ఫూర్తిగా నిజగృహాభిముఖుఁ డయ్యెను.

౨౧

మనస్సు విచిత్రమైనది. ప్రాప్త వస్తుమాత్ర పరితృప్త నందునదికాదు. అలభ్య వస్తు లాలసాలోలము. నిర్గత వస్తు నిరీక్షణశీల సంలగ్నము. ఈ మాటలు రుద్రనాయకునెడ ప్రత్యక్షర ప్రమాణములు. నిన్నటివఱకు అలభ్య దశాక్లేశకారిణియైన ప్రణయిని పరితాపము. ఇప్పుడు అదృశ్య దశాక్షేయ విహారిణియైన పత్ని విరహోత్కంఠ. హేలాంబిక మాయమైనప్పటినుండి అహోరాత్రములు అన్వేషణ చేయుచుండెను. అత్తవారింటికి కబురంపెను. చిన్నమనాయకుఁడు 'పిల్ల ఏమైనది? మా ఇంటికి రాలేదు. మీరేమి చేసితిరో!' అని బావురుమనెను. పార్వతమ్మ గుండెలు బాదుకొనెను. పుట్టినింటికి వెళ్ళక అత్తవారింట నుండక హేలాంబిక యేమైనదో ఎవ్వరికిని తెలియకుండెను. భూతలమంతయు వెదుక రుద్రనాయకుఁడు సిద్ధపడెను. స్వయముగా దేశసంచారమునకు తలపడెను. నిద్దురలో కూడ నతనికి మధ్య హేలాంబికా దర్శనములే అగుచుండెను. కలకండ కలిపి తేనెలో ముంచి నాఁడామె అందించిన ఒకటి రెండు పలుకులను నెమరువేయుచు రుద్రనాయకుఁడు నెమకుటకు ప్రయాణమయ్యెను.

ప్రథమయామ పరిసమాప్త ఏకాంతసమయ ప్రశాంత వాతావరణమున రుద్రనాయకుఁ డిల్లు వెడలెను. ఒంటరిగా నతఁడు నడచిపోవుచు స్వయంభూదేవాలయ సమీపమున అనాలోచితముగ ఆగెను. భార్యాన్వేషణయత్నఫలసిద్ధికి

దైవదర్శన మావశ్యక మన్న ఆస్తిక భావోదయ మయ్యెను, అనుక్షణమె దేవాలయములో ప్రవేశించెను

సింహద్వారము దాటెను గర్భాలయ ద్వారములు మూసి యున్నవి తాళము వేసి యుండునని నందివిగ్రహముచెంత నుండియె సాష్టాంగదండ ప్రణామము సమర్పించెను నేలను సాగిలినంత ఖంగున శబ్దమయ్యెను ఆశ్చర్యచకితుడై రుద్రనాయకు డాలయము వంక చూచెను అంతి అంతిగా ఆలయములో అద్భుతహస్త ఘటిత ఘంటికా రవములు వినిపించెను ఇప్పు డెవ్వరు లోన పూజచేయుదురు? తలుపులు వేసియున్న వీ శబ్దములేమి? రుద్రనాయకుడు తత్తరపడి దేవాలయ మంటపములోనికి నడచి వెళ్ళెను దేవాలయ గర్భద్వారము సమీపించెను తలుపులచేత తాకెను మృదుల స్పర్శకలనమున తలుపులు కొంచెము తప్పుకొన్నవి రుద్రనాయకుడు పూర్తిగ గెంటెను తలుపులు బారుగ తెరువబడెను అటు చూచినంత రుద్రనాయకునకు తన కన్నులను తాను నమ్మలేని స్థితికలిగెను స్వయంభూ స్వామి సన్నిధానములో మిణుకు మిణుకు మని జ్యోతి వెలుగుచుండెను పైన యూంగుతిల్లిక ఊగు చుండెను అయ్యలంతి కాంతి పుంజములలో శివలింగము ముందు మోకరిల్లిన ఒక తరుణీమణి నయన గోచరమయ్యెను అమాంతము రుద్రనాయకుడు 'హా!' అని అరచెను దేవాలయ మా కేకకు దద్దరిల్లెను పునఃపునరా మంత్రితములతో సడలు గర్భగుడిలో అడుగు పెట్టెను ఆ తరుణివంక నరసెను ఆశ్చర్యము!

ఆమె కాత్యాయని! హేలాంబిక కాదు — రుద్రనాయకుడు క్షణము స్థాణువయ్యెను ఆమె రుద్రనాయకుని చూచినది కాత్యాయని కళాహీనముగ నున్నది చింతతతి బెట్టినట్లు సునుసోగ చెక్కిళ్ళు కందినవి మోము పొంగ శించినది అశ్రువులు ఆనవాలు పట్టినవి ఇన్నిటినియుంచి ఒకానొక అపురూప లావణ్య మామెలో తొరాడుచుండెను సురక్త ష్ట్ర కుసుమ పేశల ప సుధాంశ యైనను పదంత్ర పంవాటి యున్నది

'బావా! —'

కాత్యాయని పలుకలేకపోయెను గాద్గద్యము గళము నావరించెను మాటాడ లేకపోయినది మాటాడ నెంచినను దలంపులు గా మద్దగొంతుక నిండి 'బావా! చెప్పినట్లు వచ్చితి నిదిగో' అన్నది

"ఎవరు కాత్యాయనీ!"

"కాత్యాయని కాదు పతిత పడతి!'

'ఆఁ!'

బావా! నీవు బాధపడవలసిన విషయము కాదు. నేను ఆత్మవిరుద్ధము గానె లక్ష్యమై విలపించితిని. కాని స్వయంభూస్వామి నాకే కోరితిని. మా బావ మా అక్క ఆనంద దాంపత్యము గడుపునట్లు అనుగ్రహింపుమని—ఆ నా అభ్యర్థన తప్పక ఫలించును. ఇక నా సంగతి. వివాహము పేరిట ఆత్మ బలిదానము ఒక సామాన్య మానవునకు ఆత్మ బలియిచ్చుటకంటె భగవంతుడైన స్వయంభూస్వామికి ఆనందముగా ఆత్మార్పణము చేయుట శ్రేయస్సని పెండ్లిబట్టలతో వచ్చితిని. అదృష్టవశమున నా హంసరుతికి తృప్తి నవరింప వాగ్దాన మీయవలసిన నీవు వచ్చితివి. ధన్యురాలను. మా అక్కను మనసార మన్నింతునని మాట నీయవలెను.'

ఎందుకు?'

"నా ఆత్మ సంతృప్తికి వాగ్దానము చేయవా?' —అని కాత్యాయని తిరిగి యడిగినది. ఏమియు పాలుపోని రుద్రనాయకుడు అటునిటు చూచెను. పూజా భాజనమున పూవులలో తళతళలాడుచు కత్తి యొకటి కనిపించెను. రుద్రనాయకుని కన్నులు చిమ్మచీకటులు క్రమ్మెను. కాత్యాయనీ! అని గట్టిగా అరిచెను. ఇద్దరును ఎవ్వరికివారు ఎరుగకుండ నొకరినొకరు అదిమి పట్టుకొనిరి. అనుక్షణమె ఎవ్వరికివారు ఒకరి నొకరు విడిచిరి. అంతలో బయట పెద్దపెట్టున కోలాహలము వినవచ్చి వారు అటుచూచిరి.

భళ్ళున తలుపులు బ్రద్దలు గొట్టుచున్నంత ఆర్భటితో ఆలయములోనికి గుంపుగా కొందఱు చొఱబడిరి. వారిమధ్య హేమాద్రిరెడ్డి యుండెను. ఇదిగో! పెళ్ళికూతురు! ఇదిగో పెళ్ళికూతురు! అను కేకలు మినుముట్టెను. రణగుణ ధ్వని అయినది. హేమాద్రిరెడ్డి 'వివాహానంతరము దేవుని దర్శించుటకుగాను ముందుగా అర్చకులను గుడితాళములడిగి పుచ్చుకొన్నందు కిదా ఫలితము?' అని నిట్టూర్పు విడిచెను. అంత నక్కడికి వచ్చినవారు కొందఱు గుమిగూడి కాత్యాయనిని పట్టుకొనిరి. రుద్రనాయకుని జూచి గుడ్లురిమి పండ్లు పటపట లాడించిరి. కాత్యాయని కెవ్వున కేకవేసెను. హేమాద్రిరెడ్డి 'చాలిపాటికి రా!' అని సింహగర్జన చేసెను. గుమిగూడిన జనులు దారి యొసగిరి. హేమాద్రిరెడ్డి కాత్యాయని చేయిపట్టుకొనెను. అస్తవ్యస్త హృదయుడైన రుద్రనాయకుడు అనాలోచనగా ఏ అభిప్రాయము లేకుండ మామా! అనెను. అనుయాయులు జనులు కత్తులెత్తి కన్నెఱ్ఱగా జూచిరి.

మీరు నడవండి. అని హేమాద్రిరెడ్డి బెబ్బులివలె గాండ్రు మనెను. కత్తు లెత్తినవారు మేకపిల్లలయిరి. ఎండుటాకులవలె కత్తులు నేల వాలినవి. హేమాద్రిరెడ్డి కాత్యాయనితో వెడలెను.

క్షణములో దేవాలయము నిరవాలయ మయ్యెను. రుద్రనాయకుడు ఒక్కడు మిగిలియుండెను. కొన్ని గడియలపాటు అతనికి తెలివితప్పనంత

అప్పుడుగాని మనకు ప్రాణప్రతిష్ఠ కాఁజాలదు ఇక మనము సంస్కృత ఛందో రీతులకు స్వస్తివాచనము పలుకవలెను నిరంకుశ నియంతృత్వాధికారములు వెలయు గీర్వాణ వ్యాకరణదుర్గ మారణ్యములలో తకావికలు కానక్కఱలేదు శార్దూలములు మత్తేభములు మన కెన్నటికి పెరఁటి కామధేనువులు కావు ఛందోనిరత పదములకై మనకేల ప్రాకులాట? చూడుఁడు మన వాణారివు జోరతి స్వరములతో చదువులసానికి మ్రొక్కులు చెల్లింపఁగలము దైశికమైన ఛందములే స్వచ్ఛందములు ఆత్మప్రతిచ్ఛందములు। జానుతెనుఁగు మనకు ఉపాదేయము ధ్యేయము నిసర్గమగు భాషయే జాను తెనుఁగు కవిత్వమున అల్పాక్షరముల ననల్పార్థరచన కావలెనన్న పాలకురికి వారి ఆభాణకము సుభాషితము మన ద్విపదినె తీర్చి దిద్దుకొందము చతుష్పాత్తుల సాహచర్యమేల మన సీసముకంటె యింపును సొంపును గూర్చు పద్య మేమున్నది? సీస ఏరువోజ ద్విపదలు మన భాషా సిద్ధములు జాతి ప్రసిద్ధములు జాతీయతా ముద్రలేని జీవరేఖలు భాసింపని సారస్వతము సారస్వతమే కాదనవలసి వచ్చును ఇప్పటికైన జాగృతినంది ఇంటి దివ్వెలతో దిశలు వెలిగింతము మూర్కొంటికి ముచ్చెమటలు పట్టించు వెలుఁగు మన తెలుఁగు దేశకవితయే తేనె సోనల పూలవాన తెలుఁగు పూజయే మన జీవితలక్ష్యము

ఆ మాటలకు అగ్నిహోత్రిచయనులు అగ్నివర్షము కురిపించెను 'అప్రామాణికము అశాస్త్రీయము' అని అరచెను అనంతర మాయన ప్రసంగము మన మతకవి కేవలము శైవవాఙ్మయ ప్రభావంతుఁడు అవన్నియు అప్రామాణికములు మనది ఆర్షమతము అన్ని భాషలకు జనని సంస్కృతము సంస్కృతభాషా సంపర్కములేని కవిత కవిత కాదు అనుచు తీవ్రముగ ఖండించెను

ఎమ్మెల యథావాక్కుల అన్నమయ్యగారు లేచి యిట్లు చెప్పఁదొడంగిరి

'ఉభయ వాదములందు ఉదాత్త విషయములు ఉన్నవి సాహస వాక్యములు కలవు నా మతమున సంస్కృతభాషా సాహచర్యము ప్రతిఘటనీయము కాదు అట్లే అచ్చపు తెనుఁగుఁదనము విస్మరణీయము కాదు సంస్కృతభాషా ప్రభుత్వ మెఱుఁగని స్వభాషా సముద్ధరణమే సదాశయము లనఁగా సంస్కృతాంధ్రముల పరస్పర సమన్వయము సమగౌరవము అవసరము

ఆ మాటలకు భాస్కరభట్టారకులు తల ఆడించిరి అటుల ఎరుకగ కవులందఱు పాల్గొనుచుండ సాహిత్యగోష్ఠి సాగుచున్నది ఆ గోష్ఠికి వచ్చిన అందరికి కాశ్మీరపు శాలువలు కస్తూరి తాంబూలములు కర్పూర నీరాజనములు ప్రదానము చేయుటకు ప్రభువు గణపతిదేవ చక్రవర్తిచే ఏర్పఱుపబడెను

ఇఁక చిత్రకళా ప్రదర్శనము

ఖుషీమహాలు సువిశాలమయిన సుందరభవనము. భవనమునకు ముందు భాగమున ప్రవేశద్వారము కట్టిరి. పాలరాతి పలకలు పేర్చిన కట్టడమది. ఫలక పంక్తుల నడుమ ఎత్తులు సంక్తులుగా మణులు పొదిగిరి. ప్రతిక్షణము ప్రకాశమున ప్రభాప్రభావము అయిన ఆ మణిగణమునుండి తటిల్లతాభవమైన కాంతి రేఖలు తదన్యూన వివిధ వికార చిత్రములవలె ఉత్తేజ పఱచునంత ఉజ్జ్వలములయి యున్నవి. సింహద్వారము పైభాగమున మెట్లు మెట్లుగ వరుసలతో రత్నకిరీట పురోభాగ ప్రతిరూప మందిరము తీర్చిరి. ప్రతిసోపానమునకు ప్రత్యేక వర్ణ ప్రఖ్యాతములైన రత్నములు కీలుకొలిపిరి.

ప్రవేశద్వారము దాటిన పార్శ్వోభయ పంక్తికాఘటిత పద్మరాగ ప్రభా దీపతోరణ మాలికాంతర మాలతీలతా వితాన వాలన చామరామర సుఖభోగ దోహదమైన ఘంటాపథము. ఆ పథమున కిరుపంకల మణిమేఖలా కీలిత కింకిణీ రవ ప్రత్యామ్నాయ వేణుకుంజ వినిర్యత్స్వరకృత నృత్యానురూప నృత్య మనోభిరామ మయూరబృంద సహస్ర పంచవర్ణ కలాపింఛోళీ సంఛన్నమయిన శ్యామల శాద్వలము. శాద్వలాంతరమున సరఘా సంఘసంచార సమయస్వన సదృశ ధ్వని కారక శివజటా జూటాగ్ర హరాత్సముద్భూత గంగాభంగ ధారా పతన దృశ్యానుకరణావశ్యావేగ పుంజీభూత పుష్కల జలనాళికా యంత్రములు కలవు.

ప్రాంగణరంగ వైభవము కన్నుల వైకుంఠము. తదాలోకన పరితృప్త హృదయ భారములో ముందునకుఁ జూచిన విలాస భవనముఖ మంటపము. అనేక లతానికరములు ఆ మంటప విటంకముల పెనఁబ్రాకినవి. ఆకులాకున పూల గుత్తులు పులకరించినవి. కాని మధ్యమున హరిద్రానీల పాటలారుణ గౌరకర్బుర కిర్మీర శోణకాంతిచ్ఛటా ఘుసృణ మణి మయూఖమాలికా పటలి ధగధగలాడు చున్నవి. నిర్మల స్ఫటిక స్వచ్ఛనీలాశ్మ భిత్తికా ప్రతిబింబిత సహస్ర దీపావళీ రజనీ రాగన్యక్కారసహ దీపావళీ కోమలానంత ప్రభాకోటీపటల మంటపాంతరము అమృతాసార జ్యోత్స్నాకాసార కల్పమై, తదభ్యంతర కాలాగరు కర్పూర కస్తూరికా ఘుమఘుమార్పటీపటీర చందన పరిమళానేకములు పారిజాత లతికా ప్రసూనసముపేత వివిధ దివ్యకుసుమ సుగంధబంధుర బృందారక బృందావన సన్నిభమై శరదిందు విశద శర్వరీ శత సృజనార్థ సూక్ష్మీకృత బ్రహ్మ లోకమువలె అతివేల భాసురము. మంటపసమ్ముఖ వివృత ద్వార విశాల మార్గాంతర మందిరాళిందములు విచిత్ర జగన్నందములు.

మయసభను మరపించు శశికాంత శిలామయసభ ఖుషీమహాలున చిత్ర పటముల పరంపర చిత్రవిచిత్ర గతులలో ప్రదర్శించిరి. స్థూలదృష్టికా సుందరలతా ప్రఫుల్ల సుమనః పుంజమంజుల మనోరంజక మహాభవనము

మహేంద్ర భవనము ఆ కళానికేతనము వెల్లువై వెల్లుబికిన ఆనంద రస పూరము అద్భుత కందళన కళాకల్పవల్లి సమూల వికాస ఫలపుష్పావళీ ప్రత్యక్ష విరళ పరిమళ సురభిళమది

సుదీర్ఘ పరిణాహ ప్రాసాదంతర చంద్రకాంత శిలాస్థగిత కుడ్య చతుష్క చతురావిష్కృత నానా చిత్రపట దిఙ్మాత్ర దర్శనము దివ్యలోక విహారానుభవ మహానంద సంధాయకము రాజాస్థాన సమారాధనీయ చిత్రకళా కోవిదనివహ విరచిత వివిధచిత్రము లొకిదెస విన్యసించిరి ఏకవర్ణ వర్ణిత భావనాంగనారూప కలాపవిలాస పత్రపంక్తులు అలౌకికానంద మహాబ్ధిమగ్నతా మనోజ్ఞములై యున్నవి వర్ణమిశ్ర వర్ణిత ప్రకృతి దృశ్యపట రాజిరాజిత ప్రతీచీ కుడ్య పరిభాగమొక రతనాలు పొదిగిన కుందనపుటచ్చు యథావర్ణ వర్ణిత శుకపికాది నానా జంతు సంతానములు దక్షిణోత్తర కక్ష్యా ప్రచుర రుచిరరోచిరుపాధులు

ఇవిగాక ఇతర చిత్రలేఖకుల వర్ణచిత్ర తైలచిత్ర రేఖాచిత్ర సముదాయము ప్రాదేశిక వైదేశిక ప్రకర్షాపాదక ప్రముఖ చిత్రరాజములును ఆ చిత్రాగార నీరాజనములే। ప్రత్యంగుళ ప్రత్యగ్ర నిత్య వసంత నిర్మాణ వివిధ చిత్ర విలావిభాసి సభాంగణ మధ్య ప్రత్యేక ప్రదర్శనీయ శ్రీ పర్ణికా కాష్ఠ పీఠోన్నత పేటకాగత వినీత నేత్రోపమ సహలావణ్యలహరీ లాలిత చిత్రిణీ పటలు సావధాన సమాలోకనాపేక్ష్యములు అవి రుద్రనాయకి నామాంకితములు—అందు పీయూష వర్షాధర పికోద్భిన్న రసన రసితస్నానాలోల వత్సలతా ధన్య వత్సనయనోత్సవ రేఖాస్ఫోరక చిత్రలేఖనము సరోవర ప్రతిఫలిత గవాక్షద్వార ప్రసర గంధవాహ విసర సరసా వేష్టమాన మాళవికా ముగ్ధస్నిగ్ధ రూప కాళిదాస కావ్యాంతర్గత సన్నివేశ రమణీయ చిత్రరాజము పునఃపునరాలోకన పులకాంకుర పురస్కార పూర్వపుణ్య ఫలములు। ముహుర్ముహురున్మీలన మనోవికాస నిదిధ్యాస రసనిర్ఝరిణులు।

సమస్త ప్రశస్త చిత్రణ విన్యస్తమందిర బహిరళిందమున మౌనజల్పన మౌనిపుంగవ కల్పన మౌలికములయిన విశిష్ట శిల్పకళా ఖండము లమర్చిరి అవి అమరావతీ బౌద్ధస్తూప రచిత శిల్ప సంగీత స్వర సమ్మేళన ప్రతికల్పనములు। నాగార్జున నగన్యాసభాసమాన శిల్ప నవ్యకావ్య ఖండికా సంపుట ప్రస్తరణ టీకా ప్రాయములు అజంతా గుహాంతర శిల్పభంగిమ గంభీర భరతనాట్యాభినయ ముద్రికా గూఢార్థ వివరణ మనోభాష్యములు।

తదాలోకనము లలిత లజ్జాసుషమా సుకుమారీ సుందర దరహాస మరీచి వీచికా సమ్మోహన హృదయ మాధుర్య సదృశము లిరవస్థ తుషారతుంది:

నవమందారం సుమైరాంత విలోకన సౌగంధ ప్రతిమానము హృదనుభూతి మకరంద బిందు సందోహ నిరాందోళన సేవన మిళిందబృంద నిఖిల నిగూఢ పరితోష చిహ్న పతాక ప్రతీకము ఫలప్రాప్యము బ్రహ్మానంద సబ్రహ్మచర్యము

౨౩

అవి కళాదేవి అలవోకపు హొయలు రాజ్యలక్ష్మి అచ్చముగా రసరాజ్య లక్ష్మి అయినది ఆ వసంతోత్సవ వైభవమునకు తదాధారమైన కాకతీయ ప్రాభవమునకు ప్రజాహృదయము ప్రఫుల్లమైనది అందరు మధురానుభూతుల ఆనందడోలికలను అధివసించిరి రుద్రనాయకునికి మాత్రమొక వింత అనుభవము కలిగినది అది బహుధావ శబలమైన హృదయభారముకంటె భారమైనది అది అంతర్నిబిడమైన అతిదుఃఖమునకు తత్కాల ప్రాప్తమైన అత్యానందమునకు సంకుల సమరము విఫలమైన నిత్యజీవనముచే విషాదము సఫలమౌ కళా జీవనముచే ప్రమోదము అతనికి ప్రతిక్షణ పరస్పరానుభవములు ఆనంద విషాదముల అద్వైతానుభవమది అతనికే విస్మయముకొలిపి వింత ఆలోచన రేకెత్తించి నది జీవితము ఆనందవిషాదముల సంకలనమే కాని అవి పర్యాయక్రమ ప్రాపణీయములు ఆనందవిషాదముల ఐక్యానుభవము అపురూపము తదనుభవ కళా కల్పన మంతకంటె అపూర్వము కదా। స్వీయానుభవమిది కళాస్వీకారయోగ్యమే ఇతఃప్రాక్ ఎట్టి భావద్వయ రూపకల్పనము లేదా, కావ్యలోకమునందు ఆనందానుభవమో విషాదానుభవమో విడ్డోడువడియే యున్నవి ఒక్క దండి దశకుమారచరిత్రమునందు ఆనందవిషాదముల ఐక్యానుభూతి యున్నది అది పితృహృదయ సంబంధి అగుట మరింత శోభాహేతువు తన విచిత్రానుభవమిది తాదృశ్యమేకాని ప్రణయ సంబంధి అంతేకాదు ఈషద్విలక్షణమైన ఈ అనుభూతికి చిత్రకల్పన మొక ప్రత్యేకత కనుక ఆనందవిషాదైక్యానుభవ స్ఫోరకమైన చిత్రరచన మవశ్య కర్తవ్యము అదెట్లు సాధ్యము? ఆనంద విషాదముల ఐక్యానుభవము తనకు అర్థమగుచున్నది ఆ యర్థమునకు ఆకార రేఖలు తీర్చుట ఒక్క వాక్కునకే సాధ్యము వస్తు సందర్శనము లేనిది కుంచె వికసింపదే; ఈ అనుభూతికి చిత్రకల్పన మాత్రము చేయవలెను ఎట్లు? — రుద్రనాయకుఁడు ఆలోచనలో పడెను ఆకస్మికముగా అతని మెదడు మెరసినది ఒకనాఁడు చిత్రశాలా ప్రాంగణము దాటి రాయంచవలె నేతెంచు రామారత్నము తలఁపునకు వచ్చినది ఆమె వెనుదిరిగి చూచినది ఆమె వదన వైవర్ణ్యము రుద్రనాయకునకు ఇప్పు డర్థమైనది ఆ సమయమున ఆమె హృదయమున ఆనందవిషాదముల సంకులసమర మెట్టిదో స్వీయానుభవము వ్యాఖ్యానము చేసినది కొంతసేపు లౌకికస్పృహలో రుద్రనాయకుఁడు వికలుఁడయ్యెను అంత

లోనె పునరుద్భూతమైన రసోన్మాదముచే అతని హృదయము క్రిక్కిరిసిపోయినది చిత్రరచనా కుతూహల మధులిహమాతని మానసోద్యానమున విజృంభించినది ఆమాంతము చిత్రశాలకు పరుగెత్తెను

చిత్రశాల ఎప్పటివలె లేదు చిత్రములు చాలవఱకు ప్రదర్శనమునకు పంపఁబడినవి చిత్రశాల కొంచెము చిన్నఁబోయినది కాని రుద్రనాయకుఁడు చిత్రరచనకు మఱల ఉపక్రమించినంతనే ఒకానొక నూతనకాంతిపతాక కదలాడినది ఆ చైత్రమున ఆ చిత్రశాల చిగురించినట్లేయైనది రంగులు రసతరంగము లయినవి సగషీ సొగసులు నర్తనమాడినవి తీవకళలు తీఱువాఱ సాగినవి తదేక ధ్యానముద్రలో రుద్రనాయకుఁడు సర్వము మఱచెను అతని కుంచె అనేక రీతులలో కులుకుపోసాగినది అచటికి భద్రాంబ వచ్చినది ఆ చిత్రాకృతి చిన్నాటి కోడలిగా గుర్తించినది ఆమెకు ఆనందపరవశమైనది ఆ చిత్రరచనము తనయుని కుంచె వికసనము కాదని ఆత్మవికసనమే యని ఆమె విశ్వసించినది అందునిమిత్తము భగవంతునికి అనేక వందనము లర్పించినది ఎందు నిమిత్తము రుద్రనాయకుని చిత్రకల్పనమో ఆమె ఎంచుకొనలేదు అందునిమిత్తమని రుద్రనాయకుఁడును ఎంచుకొనలేదు ఒక మహోద్రేక ఝరినిలో ప్రవాహముఖము పట్టినది

అనాఁడే కళాదేవికి ప్రథమ నీరాజనము ఉత్తమ కళాకారులకు సువర్ణ కంకణ ప్రదానములు ఆ కళా స్వయంవరమున కాకతీయ సామ్రాజ్యలక్ష్మి ఏ కళాకుమారుల కంఠముల పూలమాలలు కైసేయునో। — కళారంగమువలెనే దేశము స్వచ్ఛస్వచ్ఛందము కావలెనని ప్రభుత్వాశయము కారణము ప్రతి సామంత చంద్రబింబమునకు మతపాక్షికతా పరివేష మండలమే ప్రతిమత పరమార్థము పారమార్థికమే సంసార దుఃఖసాగర తరణోపాయమే లక్ష్యమునందు లాతిభావములేదు ఆచరణలో మాత్రము అనేక వైపరీత్యములు మత బాహ్య స్వరూపముపైఁగల మమకారము నిర్ణీతపరిధులు దాటినచో ప్రమాదము అది కేవలము కాకతీయ సామ్రాజ్యమునకే అపకర్షకాదు, ఆంధ్రజాతి అస్తిత్వమునకే భంగకారణము అన్యదేశీయులకు ఆహ్వానములంపు దుర్మహూర్తము రాకుండ కాపాడవలసిన బాధ్యత కాకతీయ సామ్రాజ్యము భుజస్కంధములపై పడినది సర్వాంధ్ర సామంతరాజ్యముల సమైక్యమే ఆ బాధ్యత అట్టి మహార్థ సాధనకు కళయే మహాతపస్సు కళాచైతన్యముచేతనే ప్రభుత్వ రథమునకు సమ్యగ్గమనపల్లనము ఏ మహాకవి వాగమృత రసధునీ తరంగములు జల్లుసోకి సర్వమానవ హృదయక్షేత్రములు ప్రశమన సస్యశ్యామలము లగునో ఏ మహాశిల్పి ఉలి మలపున జాతిగుండెలు రసార్ద్రములగునో ఏ చిత్రకారుని కుంచె కదలికలో జాతి సజీవరేఖలు జాలువాఱునో అన్నదే గణపతిదేవచక్రవర్తి గమ్యము అందుకే శివదేవయ్య ప్రభృతుల అహరహరాందోళనము కాని,

సుకుమార భావకుల సునిశితదృక్కులు సుందర జగత్తునందే లగ్నము లయినవి కళాఖండ నిర్మాణములేగాని అఖండకళానిర్మాణములకై భవ్యరసావేశము భాగధేయము కాలేదు ఆ శ్రేణికి చెందినవాఁడైన రుద్రనాయకుఁ డిపుడు మఱల చిత్రరచనాత్వరమాణమైన చిత్తప్రవృత్తిచే చిత్రశాలకు అంకిత మయ్యెను

రాత్రి కలిగిన రసావేశము ఉదయసంధ్యావేళ రచనకు ఉపక్రమింపఁ జేసినది అన్యచింతలేని అతని దీక్షాపరతంత్రత సాయంసంధ్యకు సాంతము కావచ్చినది ఆ చిత్రములో హేలావలిక ఒక వింత అందము పొందినది ఆమె విశాలనేత్ర ద్యుతిలో విషాదరేఖాకలితమైన ఆనందహాసకళిక అచ్చొత్తినట్లున్నది అది కాంచిన రుద్రనాయకునికి ఆత్మతృప్తి కలిగినది ఆ చిత్రమువంక తదేక దృష్టితో చూడసాగెను ఒకసారి కేవలము ఆనంద ముద్రితమైన హాసతారక మఱొక్కసారి కేవలము విషాదవిద్రితమైన విహ్వలతారక మెఱసి మఱల యథాతథముగా ఆనందవిషాద సమ్మిశ్రితమైన ఆకారరేఖ వెలసినది అప్పుడతని అంతరంగమున సప్రబుద్ధాం నపుష్పాం అన్న కాళిదాసు కల్పనము ప్రతిఫలించినది అట్లు కొంతసేపు రుద్రనాయకుఁ డా చిత్రమునెడ లబ్ధదృష్టి నెఱపెను తదాలోకనలో త్రివిధ లైన మూర్తులు మహార్ఘమహారుసమ్మిలితము లగుచుండెను కేవలానంద హాసతారకాద్యుతి ప్రతిఫలనములో తదతీత సౌందర్యలహరీస్నపిత హృత్పుల కోత్ఫుల్ల చైతన్య విస్ఫారితుఁడై హేలావళికా పునరాగమ ప్రతీక్ష మనస్కుఁ డగును తటాలున కాత్యాయనీ భావసాక్షాత్కారమై ఖిన్న దిశాలోకన చేయును పర్యాయ విలోకనలో కేవలవిషాద విహ్వలనయనద్వయీ స్రవద్బాష్ప భ్రమాజనితమైన కరుణాభావముచే హృదయభారము నంది నిశ్వాసములు నిగుడించును వెంటనే యథాభావద్వయ ముద్రాదర్శనముచే చిత్రరచనోత్తీర్ణతా మహానందము చెందును తదాతందమే స్థిరీకృతము చేసికొని రుద్రనాయకుఁడు చిత్రశాలనుండి బైటికి రాఁబోయెను

' అడుగో రుద్రనాయకుఁడు । అడుగో ।

ఒక్కసారి పెక్కు కంఠములు ప్రతిధ్వనించినవి రుద్రనాయకుఁ డా సంచలనమునకు అటు చూచెను అతని నవయస్కులు అనేకులు అతనిని చూడగనే అమాంత మతని చుట్టుముట్టిరి సభకు రాలేదేమి ? స్వర్ణకంకణము నీదే । అని వారందఱు మహోత్సాహముతో పలికిరి రుద్రనాయకుఁడు క్షణము స్తబ్ధుఁ డయ్యెను క్రమముగా తేరుకొనెను ఆ వచ్చినవారు ఒక్కొక్కరు సభావిశేషములు చెప్పసాగిరి ఆవేమియు వినుస్థితిలో రుద్రనాయకుఁడు లేడు ప్రభుపారితోషికమున కాతనిహృదయము ఉత్సాహోద్వేగములతో ఊగులాడిపోయినది 'ఏ చిత్రమునకు ? అని మాత్రము ఎప్పటికో అనఁగల్గెను

' గోవత్స చిత్రమునకే ।"

కాదు మాళవిక చిత్రమనకోయి।

కాదు కాదు రెంటికిని

అవును వాత్సల్యజ్యోత్స్నకు వాల్లభ్యజ్యోతికిని'

అట్లుకాదు ఆనంద మొకటి విషాదము మఱొకటి

'ఆనందమేది? విషాదమేది? రెండును ఆనందములే?

రెండును ఆనందములు కావు గోవత్స చిత్రములోని వాత్సల్యమే ఆనందము మాళవిక చిత్రములోని నిరీక్ష విషాద కారణము కదా।

'ఆమె విరహనాయిక గనుకనా?

అవునో కాదో గాని నిరీక్ష అనఁగానే చింత అందుకని విషాదము'

'కాదు ఆనందము కేవలమది వినోద విలోకనము

వారందఱు వాదులాడుకొనసాగిరి రుద్రనాయకుఁ డొక్కనారి కరచలనమున వారిని వారించి 'సరే ఒకటి ఆనందము మఱొకటి విషాదము రెండును కలయ వ్రాసిన చిత్రము చూతురుగాని — ఆనంద విషాదముల ఐక్యముద్ర అదిగో!' అని మందానందాతిరేకమున రుద్రనాయకుఁడు వారికి క్రొత్తగా వ్రాసిన చిత్రము చూపించెను ఆ చిత్రములోని లోతులు వారికి తెలియలేదు

'హేలాంబిక'

అని మాత్రము హేలగా నవ్విరి ఆ హేల రుద్రనాయకునికి హేళనగా అనిపించినది వెంటనే వారిని వెళ్ళిపొమ్మని గద్దించెను అందఱు హతాశులై కదిలిరి

'అవునులే ఎంతైన భార్యకదా।

అవునవును అది లేచిపోయిన తర్వాత అబ్బాయిగారి ఆరాధన।

ఒకరిద్దఱు సణిగిరి అది రుద్రనాయకునికి వినిపించినది ఆ మాటకలని శ్రవఃపుటము అదరి గుండెలు ప్రదిలినవి స్మరణమాత్ర భయస్ఫురణమై నఖశిఖ పర్యంత మాతఁడు కంపింపసాగెను ఆ వచ్చినవారు వచ్చినటులే పోయిరి కొంతసేపటికిగాని రుద్రనాయకుఁడు తేరుకొనలేదు అప్పటికి అతని గుండె నిరంతర ధాటీ విజృంభితములగు నిశ్వాసోచ్ఛ్వాసములచే వినిపాతమైనది

అంతలో భద్రాంబ అచటికి వచ్చినది రుద్రనాయకుని రూపము భయోత్పాదకమై కన్పించినది ఆదేమి నాయనా! అన్నది ఆందోళనగా రుద్రనాయకుఁడు మాటాడలేదు భద్రాంబకు ఏమియు అర్థమగుటలేదు 'బంగారు కంకణము బహుమానము వచ్చెనట కదరా! అన్నది మరల

బహుమానము కాదు అవమానము'

రుద్రనాయకుని రుద్ధకంఠము ఘర్ఘరించినది

'అదేమి ?

అమాయికముగా భద్రాంబ అడిగినది

రుద్రనాయకుఁడు మాటాడలేదు నిర్జీవ నేత్ర నిమీలనములతో జంగమ శిలవలె గవాక్షమువైపు కదిలెను భద్రాంబ భయకాతరదీన దృక్కులతో నిజ తనయుని ఆపాదమస్తకము నిమిరినది

జీవితములో ఆనంద విషాదములు పర్యాయ క్రమములో కలుగును ఒకేసారి ఆనంద విషాదముల అనుభవము అరుదు ప్రతిక్షణము తదుభయ ఘోరానుభవము దుర్భరము

ఎట్టకేలకు రుద్రనాయకుని హృదయము పెకలి వెడలిన మాటలివి భద్రాంబ కర్థము కాలేదు అంతలో బైట మనుల కోలాహలము దానికి కుమారుని విపరీతావస్థకు ఏదో సంబంధ ముండవచ్చును లేనిచో ఇంతలో ఈ మార్పేమి ? అనిపించి భద్రాంబ అటువెళ్ళినది

రుద్రనాయకుఁ డదే ముద్ర । అప్పెంతసేపో । — అకస్మాత్తుగా అతని దృష్టి ఆనంద విషాదైక్యముల అభినవ చిత్రము వంక ప్రసరించినది హేలాంబిక హేలగా నవ్వుచున్నట్లగపడినది ఎక్కడలేని కోపము వచ్చినది చేతిలోని కుంచెతోనే పత్రము చించివేయ చేయెత్తెను సాశ్రునయనయై హేలాంబిక కనిపించినది ఎత్తినచేయి ఎత్తినటులే దించెను అంతలో భద్రాంబ అచటికి వచ్చెను కుమారుని వైఖరికి కుమిలినది

'ఇదేమిరా ! మతిలేనివానివలె మారినవైతివి ।'

అని కంటతడిపెట్టినది రుద్రనాయకుఁ డటులే నిర్జీవ ప్రతిమవలె నిలిచెను నిశ్శబ్దము కొంతసేపు నియంతృత్వము వహించినది

'నీకు బహుమానము వచ్చినదట కదరా ।'

ఎటులో భద్రాంబ ఏదో మాటాడవలెనని అన్నది

రుద్రనాయకుఁడు మాటాడలేదు

సభలో అల్లరి జరిగినదట । ఎవఁడో నీలిముసుఁగు వైచికొని రూపము తెలియకుండ పంచకల్యాణి గుఱ్ఱముమీద వచ్చి మఱియు సభను పంచబంగాళము చేసెనఁట ।"

ఆ సంగతికి రుద్రనాయకుఁడు భ్రాంతుఁడై జవాబిచ్చునని భద్రాంబ భావించినది కాని అట్లు జరుగలేదు భద్రాంబ మాతృహృదయము బావురుమనిపోయినది రుద్రనాయకుని హృదయములో ఒకటే రోదనము

ఒక మహానంద సమయమున పరమహీనమైన సంఘటన అదృశ్యమైన అనాదృత బాలికవలన అవమానము దానివలననే బహుమానవేళ అవమాన

పరామర్శ। అని హేళన।। దండము భార్యాతిరస్కారము అందుకు కారణము భర్తృతిరస్కారము కాదు—తానుగా హేలాంబిక తన జీవిత పతనహేతువు అది —'

రుద్రనాయకుని దృష్టి చిత్రమువంక ప్రసరించినది ఈ దృష్టిప్రసారము ఇతఃపూర్వకముకంటె తీవ్రనిశితము ఆ చిత్రములో హేలాంబిక ఆకృతికాదు అచ్చపు రూపమే మూర్తికట్టినది ఆ మూర్తి విషాదావిలమైనది అత్యంత రుదితోచ్ఛూన నయనములతో అశ్రుధారలు చారికలు కట్టిన గండపాళికలతో దీనదృక్కులతో హేలాంబిక అంజలి పట్టి పాదములపై పడుచున్నట్టు తోచినది తాళికట్టిన భార్య తాదృశ దరిద్రదయనీయావస్థలో కనబడగానే రుద్రనాయకుని హృదయము శతధా శకలితమైనది ఆ చిత్రము చెంతనే కల అశోక తరుచ్ఛాయలో అవనతముఖియైన జానకి చిత్రము దృగ్గోచరమై దిగ్గోళమే గిర్రున తిరిగి నట్లనిపించినది ఆతని హృదయము అగ్నిపర్వతమువలె ప్రేలిన బ్రద్దలై ఉష్ణనిశ్వాసము లాక్కుమ్మరి విజృంభించి లావాజలమువలె ఒడలెల్ల వెచ్చగా కాల్చసాగినవి నేను కారణముగా ఒక అమాయిక బాలికకు ఆత్మహననము— ఎంత అజ్ఞాతకము। అనుకొని రుద్రనాయకుడు మరల ఆ చిత్రమువంక చూచెను ఈసారి హేలాంబిక హేలావిలాసముతో కనిపించినది ఆనాటి నవోఢ। ఎన్ని ఆశాలతలు ఎంతకాలముగా హృదయములో దాగి కళ్యాణ వేదికపై కన్నులలో ప్రతిఫలించినవో। ఆ ప్రతికాంతి విలోకనము అవశ్య భవితవ్య మహానంద జలధి విగాహన జ్యోత్స్నా కిరణ ప్రసారమే ఊర్మికా హస్తముల ఉద్దీపనములతో ఉప్పొంగిపోవు ఆనంద జలధిలో వల్లటీలు కొట్టుచున్న ఆమె వీక్షణజ్యోత్స్నలందు పాషాణ హృదయ పర్వతము పటప్రోసి చెల్లాచెదరు చేసినది తాను। రుద్రనాయకుడు మరింత లజ్జితుడై మరల చిత్రమువంక చూచెను శతకోటిశంపలవలె కన్నులలో ఆనంద కళికలు జిమ్మిన విరజిమ్ముచు నున్న రూపమది ఒకనాటి హేలాంబికా వధూటికదికాదు ఈనాటి పునః పునరాశాసమాగమ పులకితయైన హేలాంబికా విరహిణిది—అన్న భావము గాఢముగా రుద్రనాయకుని మనస్సున ముద్రవైచుకొన్నది

ఆ వెఱ్ఱిచూపు లేమిరా!'

అన్నది భద్రాంబ అంతకంతకు భయాందోళన అధికమై

రుద్రనాయకుడు తల్లివంక చూచి మరల చిత్రపటమువంక చూచెను ఆ చిత్రపటములో ఈసారి ఏవిధమైన హేలాంబికా రూపము పొడకట్టలేదు సరికదా ఫెళ్ళున నవ్వులతో తత్పూర్వాగత మిత్రులు కనబడిరి ఆ నవ్వులు గుహాప్రతిధ్వనులై అతనిని ఉక్కిరి బిక్కిరి చేసినవి ఆవేశము సహస్ర ఫణముల బుసలుకొట్టి అతడా మిత్రులను అందరిని మ్రింగివేయవలెనన్నంత

మహోద్రేకముతో చట్టున చిత్రములాగి పళ్లు పటపట లాడించెను అంతలో భద్రాంబ అతని చేతులు పట్టుకొన్నది

ఇదేమి విపరీతమురా। ఇంటికోడలులేదు సరికదా దాని చిత్రము వ్రాసి నట్లే వ్రాసి చించివేసెదవేమిరా। అదేమిపాపము చేసినది।' అన్నది

ఆ మాటకు రుద్రనాయకునికి వివేకము కలిగినది మరల విప్పి చిత్రమును పరిశీలనగా చూచెను ఆ చిత్రములో హేళన ధ్వనులు లేవు హేలావిలాసములును లేవు మఱి విషాదరేఖా కలితమైన ఆనందహాస కళిక అచ్చొత్తినటుల నేత్రములు ప్రతిఫలించు హేలాంబిక రూపచిత్ర మది ఆనంద విషాదముల ఐక్యముద్ర మఱల రుద్రనాయకు నొకసారి ఆలోచనా బద్ధుని చేసినది అది హేలాంబిక జీవితము ఆమె జీవితము?—రుద్రనాయకుని ప్రశ్నకు జవాబు?— అతని అంతరాంతరములో నప్రబుద్ధాం నసుప్తాం' అన్న పదములు అనాలోచితముగా అనుద్దిష్టముగా ఉచ్చరితములైనవి ఆ ఉచ్చారణ అనేక పర్యాయములు జరిగినది ఆ జరిగినంతకాలము రుద్రనాయకుఁడు జాగ్రదవస్థలో లేఁడు అతనికి జాగృతి తత్పదోచ్చారణ స్మృతి ఒకేసారి కలిగి అందుకు అతఁడే ఆశ్చర్యచకితుఁడయ్యెను

ఏమీ అంతఃప్రేరణము?

రుద్రనాయకుని కేమియు స్ఫురింపలేదు తత్ప్రేరణ మూలకమైన వాక్య ద్వయముగల శ్లోకమతనికి స్ఫురణకు వచ్చినది

'పాదానిన్దో రమృత శిశిరాన్ జాలమార్గ ప్రవిష్టాన్
పూర్వప్రీత్యా గతమభిముఖం స్వప్నవృత్తం తథైవ
ఖేదాచ్చక్షుస్సలిల గురుభిః పక్ష్మభిశ్ఛాదయన్తీం
సాభ్రేఽహ్నీవస్థలకమలినీం న ప్రబుద్ధాం న సుప్తామ్

అతని దృష్టి ఆ చిత్రముపైఁ బడినది ఆ చిత్రములోని హేలాంబిక నప్రబుద్ధ నసుప్త కమలాక్షిరో। కాని తత్పూర్వావస్థకైన నోచుకోని దయనీయ ఇఁక తాను? మేఘ సందేశ మంపుటకైన ఆమె యెక్కడనున్నదో తెలియని అభాగ్యుఁడు।

౨౪

అగ్నిహోత్రచయనులు అరుగుమీఁద కూర్చుండి ఆలోచనలో తల యాడించుచుండెను అంతలో నొక వ్యక్తి అచటికి వచ్చెను ఆగంతకుని వేష భూషలు రాజభటునిగా తెలుపునట్టివి వానిని చూడఁగనె 'ఏమైనది?' అని చయనులు అత్యాతురముగా అడిగెను

ఏమగును? మీ ఉపాయమే మాకు ఉపాయనము మంచి రసకందాయము'లో నుండఁగా సభను గగ్గోలు చేసితిమి సమయమునకు మన

కృష్ణనాయకులుగారు పంపిన కళింగదేశపు మనుష్యులను శిఖండులుగఁ జేసితిమి గందరగోళముతో భూగోళమె దద్దరిల్లినది నానా సంక్షోభము చేసి సభను రసాభాసము చేసితిమి '

అది సంభవమనిపే కదా నా ఆరాష్ట్రకిత్వము ।

చిత్రము '

'ప్రభువర్గీయులు కళింగాధిపతి దుశ్చర్యగా నమ్మినట్లే కదా ।

బ్రాహ్మణోత్తములు మీరు ఆదేశించుచేమి, క్షత్రవీరులము మేము ఆచరించుచేమి పథకము ఫలింపకుండుట కల్పనము నమ్మకుండుట జరుగునా ? ఆ కాయపనాయకులుంగారు ఇష్టులయిన కళింగాధిపతి కాపయనాయకుని మీఁద కత్తిగట్టిరి ఇంతటి ద్రోహియని ఇదివఱ కెఱుఁగక పోతిమని నిరి దేవించిరి పరదేశాగత పరిపంథిజన సందోహమె సభ నల్లరిచేసెరని విశ్వసించిరి నగరమంతయు వ్యాపించుటకు ప్రభువుల నమ్మినబంటులకే నిప్పంటించితిమి '

'నిజము చక్కఁగఁ జేసితిరి ప్రభువుల పటాటోపము సరియే ప్రజలకెంత బుద్ధిలేక పోయినది చక్రవర్తి ఇన్నాళ్ళుగా రాజాంతఃపురమున ఆడించిన కపటనాటకము ఎఱిఁగి కూడ రుద్రమదేవీ పట్టాభిషేక మహోత్సవమునకు సమ్మతించిరి కదా ।'

ఆత్మాభిమానములేని అధములు గనుక ప్రజలట్లు సమ్మతి ప్రకటించిరి పౌరుషమెంతులేని పాదాభివందనము చేయుదురా

బాగుగఁ జెప్పితివి కానిమ్ము కళింగదేశమునుండి వార్తలెవ్వియు లేవుగదా ।

'లేకేమి । కృష్ణనాయకుని అంతరంగిక సచివుఁడు రహస్య వర్తమానము పంపినాఁడు ఎన్నివిధముల ప్రయత్నించియు మొదట కృష్ణనాయకుఁడు విఫలుఁడయ్యెనఁట దేశ కాలపరిస్థితులను బట్టి ప్రస్తుతము కాకతీయ సామ్రాజ్యాధినేతలను ధిక్కరించుట తెలివిమాలినపనియని ఒకటే పోరమఁట కాపయనాయకునకు । — కాని మొన్నటి ఘట్టముతో ప్రాఁతపోరము ముగిసినది ఎవరో దుండగులు చేసిన ద్రోహమునకు కల్లకపటమెఱుఁగని కళింగదేశము వారు కారకులని కాకతీయ ప్రభువులు కాలులఅచిరని కాపయనాయకుఁడు కినిసెనట దానికి సాయము వెంటనె అవ్యవధానముగా గణపతిదేవులుంగారు పంపిన తాఖీదు వారికందినది అది నివురుగప్పిన నిప్పునకు కొలిమి తిత్తియైనదట ।"

'ఏమా తాఖీదు ?

'ప్రశాంత శుభసమయములో ప్రళయాగ్నులు ప్రజ్వలింపఁ జేసిన కళింగపతులు శాంతికాముకులుకారని హింసాజర్జరితులని హేళనతోసహా హెచ్చరిక "

'ఏమని ?''

సమస్తభారత సమరయాగ సమిధారణి మథనము సహింపరానిది ఉత్తరాపథ పరాధీనత దక్షిణాపథ పరస్పర ప్రాతికూల్యములు తలంచి బలీయమైన దార్ఢ్యతగల పెద్దరాజ్యముల వారము మనము సమరసభావులము కావలెను ఇది సేతు హిమాచల పర్యంతము భారతావని భావిక్షేమము కోరినవారికి అవశ్యావశ్యకము కాదేని కళింగాధిపులకు పరరాజ్యరుధిరాన్న కబళన కరిన కాంక్ష బుభుక్షయే కలదేని విధ్వంసక చర్యాది హీనకృత్యములకంటె వీరులవలె కదనరంగమున కత్తికవ్వట కాంక్ష్యము క్షాత్రధర్మము అని

దానికి కాపయనాయకుని జవాబు ?'

'' 'వచ్చునది వర్షాకాలము సంగ్రామానుకూలము కాదు తప్పక శరత్కాల ప్రారంభములో యుద్ధము తథ్యము సిద్ధముకండు ' అను సవాలే।'

భళీ।'

అగ్నిహోత్రచయనులు ఆకాశమంత ఎత్తున పెరిగెను

'కాఁగల కార్యము గంధర్వులు తీర్చకమానరు కాని మన ప్రయత్నములు మనము మానవలదు నీవు కళింగనగరమునకు నేఁడే పయనమగుము కృష్ణనాయకునటనే ఉండు మనము వ్యవధివ్యవస్థితము లయిన వ్యవహారములు వ్యత్యస్త వ్యాసంగములగుట కలదు బహుభద్రము పదుము' అని చయనులా భటుని త్వరపెట్టెను

రాజభటుఁడు సెలవు దీసికొనెను ఉవ్వెత్తుగ పొంగి పొరలు మహోత్సాహమున ఉక్కిరిబిక్కిరియగు చయనుల కేమియు తోఁచకుండెను

భాస్కరభట్టారకులు అరుగు మీఁదికి వచ్చిరి అది చూచి చయనులు నిమిషములో అచటికి చేరెను

భట్టారకులవారు బహుధావ్యగ్రులయినట్లు తోఁచెదిరి కారణమేమో। అని చయను లనెను

ఏమున్నది ? పాపమతఁడు పైకి రావలసినవాఁడు నిష్కారణముగా కడగండ్ల పాలయినాఁడు రుద్రనాయకుని తలంచినంతనే నాకు గుండె తల్లడమందుచున్నది అతనితండ్రి యేమయ్యెనో మఱింత దురవగాహము।

'శిష్యవాత్సల్యము।'

చయనులు అవజ్ఞాపూర్వకముగ అనెను

భట్టారకులది పాటించలేదు పట్టించుకొనలేదు

'రుద్రనాయకుఁ డెంతటి ధిషణావిభవుఁ డగునని భావించితినో అంతగా విషమావస్థల పాలగుచున్నాఁడు।' అని మరల అనెను

చయనులిసారి మౌనము వహించెను

మొన్న చిత్రకళా ప్రదర్శనములో అతని చిత్రమునకు ప్రథమ బహుమానము లభించినదట।

భట్టారకులు సంతోషకారణముగ భావించి యనెను ఆ మాటకు చయనులు విషపూరితముగ నవ్వి, 'విచిత్రముగ మాటాడుచున్నారే। ఆలాంటి కళాలోక వికాసమునకు దోహదప్రక్రియ సల్పినది అమరైయుండి నాకు తెలియనట్లే అడిగెదరు మీరును నియోగమున నిపుణులే। అది

ఆదేమి?'

భాస్కర భట్టారకులు తెల్లబోయెను

'బహుమాన మిప్పించినది భట్టారకులుగారు కాదు కాబోలు।

మరల చయనులు పరిహాస పూర్వకముగ పలికెను

'రామ రామ। ఏమి దారుణకల్పనము। నేను పంటిల పరిషత్ప్రాంతము వీధి రానే లేదు కాక ఔత్తరాహులయిన ప్రఖ్యాత చిత్రకళాకోవిదులు ప్రాడ్వివాకపదవీనియుక్తులు। అంతేకాదు అట్టి ప్రలోభమునకు లోను కాదగుదునా? అసమర్థకృషిని అభినందించి శిష్యునకు శాశ్వత మహాపచారము కలిగింతునా? శిష్యవాత్సల్యము శిష్యునకు ఉజ్జ్వలభావి అందునది కాని ఊరక గతి కల్పించునట్టిది కాదే।

'అవునవును'

చయనులనేక విధముగ తలద్రిప్పెను

సమర్థులకు పరాజయములు అనుష్ఠానధార్మికులకు అవమానములు సంభవములే। అచలిత ధైర్యవంతులే ఉదాత్తశీలురగుదురు ఉన్నత శ్రేణికి చెందవలసిన రుద్రనాయకుడు కష్టపరంపరలకు లోనయ్యెనని ఎరిగియుండు నన్ను పరాభవించిన నేమి లెండు దుస్సంఘటన దుఃఖపాలు దుర్బలుడయిన రుద్రనాయకుడొకనాడు యుక్తాయుక్త విచక్షణాపరుడు కాకపోడు అతని నైతిక శ్రేయస్సు నాకు ఆకాంక్షితమే వాని శేముషీ పాటవమునకు వాని వయస్సే కొంతవరకు ప్రతిరోధము ఏమైన అతడు అనంత కీర్త్యాలోచనాచంచ ధార్మికా సాహాయ్య స్వయం రక్షణ విచక్షణ సంలగ్నుడయిన ఎంతో సుఖసాగరమగ్నుడు అట్టిస్థితి యౌవనదశా సహజము సంగతి అసాధ్య మనరానిది

ఎవరి ధోరణి వారు ప్రకటించిరి ఎవరి తెన్నున వారు లేచిరి భట్టారకులు అనుకంపాయత్త చిత్తులయి లోనికి పోయెంచిరి వికటహాస విజృంభణముతో చయనులు అడుగుదిగెను

—౩౫

ఒక్కగానొక్క కొడుకునకు బలాత్కార వివాహము చేయవలసి వచ్చినది తాను పుట్టింటివారికి దూరము కావలసి వచ్చినది తమ్ముఁడు హేమాద్రిరెడ్డి తన్నుగానట్లు తప్పించుకొనెను పోనీ మంచి సంబంధమే లభించినదన్న కోడలు వచ్చి కాపురముచేయు యోగము లేకపోయినది నట్టింట కొడుకును కోడలును చిలకా గోరింకల వలె కలసిమెలసి తిరుగుట చూచు భాగ్యము నోచుకొనలేకపోయినది పైఁగా కోడలు పలాయన మయినది ఎంత పరాభవమది। నలుగురిలో నగుబాటు। అన్యాయమే అప్రతిష్ఠపాలు। — అంతటితోనయిన ఆపదలు ముగియలేదు భర్తకూడ అదృశ్యుఁడయ్యెను ఎవ్వరికి లేని యిక్కట్టు లన్నియు తనకే। పోనీ ఉన్నకొడుకన్న ఉద్రిక్త హృదయుఁడు। ఉద్ధృతావస్థకు ఉన్ముఖుఁడు ఆక్రందమేన అతని ఆనందము సంతాపమే అతని సంతోషము క్షణము చైతన్య విరాజితుఁడు క్షణము మతి భ్రమణము నందినవాఁడు ఇటీవల కొంత నయమే। పనిపాటలతో చదువుసంధ్యలతో చిత్రలేఖనముతో కాలక్షేపము సేయును అయిన మాత్రము?

భద్రాంబ మాతృహృదయములో సముద్రమథనము సాగినది కాలకూట విషము పొగలు విరఁజిమ్మినది మానసిక శారీరక మథన క్లేశములతో వ్యాధి పాల్పడినది కరఁగుచున్న కంకాళమయినది అటులే జీవితభారము మోయలేక మోయలేక మోయుచున్నది

అట్లు మూఁడు నెలలు గడచినవి

ఆనాఁడు శరత్పూర్ణిమ రోదసీ కుహరమంతట ధవళామృత జ్యోత్స్న స్రవంతి వెల్లవేసినట్లు వెల్లివిరిసినది ప్రకృతి మనోజ్ఞ ప్రశాంతము చిత్రశాలలో రుద్రనాయకుఁడు కుంచెపట్టెను గృహారామ మల్లికానికుంజము నిలువెల్ల పుష్పించినది ఆ నికుంజము మీఁదుగా వీఁతెంచు చిలుగాలి తరగలు మధుర సార్ద్రములై సుగంధిలములై ఒడలు సోఁకి చందన చర్చలు సలుపుచున్నవి నూతన చిత్రరచనార్థ సంలగ్నమనస్కుఁడయిన రుద్రనాయకుఁ డించుక చలించి మల్లెపొదవంక చూచెను అలనాఁడు అందని పూగుత్తికొఱకు నిచ్చెన పై మెట్టెక్కి ఎగిరిఎగిరి ప్రయత్న పరమతతో ప్రక్క మోమిడిన బాలకాత్యాయని జ్ఞప్తికి వచ్చెను

నాఁడు కాత్యాయని బాలిక। నేఁడు వివాహిత। నాఁడు కాత్యాయని ప్రణయ ముముక్షురాలు। నేఁడు పరిణయ బద్ధురాలు। అహా। బాల్యవిచేష్టా పరకౌశలములు భావిజీవన చిత్రమాత్ర వ్యంజకములా — అను భావన కలిగి రుద్రనాయకుఁడు ఉస్సురనెను ఎత్తెదుట కలిపిన వర్ణమిశ్రములు వ్రాయు

పత్రములు పలకరించెను. నిశ్చల సమాధి భగ్నహేతు ద్వంద్వ విపరీత చాంచల్యము గుర్తెఱిఁగి సుందర కుసుమ పఱచుకొని పరియత్నించు చున్నాఁడై హృదయస్థితి భావావేశ జ్ఞానతుఁడై కుంచె కదలించెను.

చిత్రాకృతి పొడఁకట్టినది. అది గరుడవాహనారూఢుఁడై గగన విహారము సేయు లక్ష్మీద్వితీయుఁడైన విష్ణుమూర్తి చిత్రించను యావురేకలు పొడకట్టగనె రుద్రనాయకుఁడు వైష్ణవమత సంబంధ చిత్రమా! స్వమత వ్యతిరేకముకదా! అనుకొనెను. అంతలోనె లలితకళామతల్లి మతాతీతము. మత విషయేతర కేవలానంద పరమావధిక కళారంగమున మతదృష్టి అనర్థకము. ఇంతకుముందును ఇదేకదా నా కళానిర్వహణము. ఇప్పుడీ సంకోచమేల కలుగవలెను? ప్రామాణికమే కాని మత ప్రాధాన్య వివక్షలో నాకు పరమేశ్వరుఁడే ఏకైకదేవుఁడు అని తలపోసి హరిద్రావర్ణములో కుంచెను కొలఁదిగా ముంచి, పరీక్షించి చిత్రపరిపూర్తి కుపక్రమించెను. నాలుగు గడియలలో చిత్రము సర్వాంగ సుందరముగా సప్తవర్ణ సంశోభితముగా తయారైనది. దాని వంక రుద్రనాయకుఁడు తదేక ధ్యానముతోఁ జూచెను. కళాంతర సంస్పర్శనలో కవితాహృదయము కదలినది.

'పరస్పర దరస్మితావలోకనము మూర్తికట్టిన లక్ష్మీనారాయణుల అనుబంధము రాగరంజితము. తరంగ రాగోద్భాగ తార్క్ష్యతీక్ష్ణ సభక్తింగలిత పక్షాంతరి మొక మెలికలు పడిన పచ్చల తోరణమువలె భాసించునప్పటికి అది యొక బంధము! ఏమి! అప్రయత్నముగా అనుబంధ బంధురమ్యములు చిత్రమున చిందులాడినవి!' అని మురిసిపోవుచు తన చిత్రమువంకనె తన్మయుఁడై రుద్రనాయకుఁడు చిత్రశాలలో కాలక్షేపము సేయుచుండెను.

కేలూఁతగాని కాలానలేక ఎటులో భద్రాంబ చిత్రశాలకు వచ్చినది. ఆమెను చూడఁగనె, రుద్రనాయకుఁడు 'అమ్మా!' అని చేయిపట్టుకొని కూర్చుండఁ బెట్టెను.

'నాయనా!'

భద్రాంబ నీరసముగ అన్నది.

'అమ్మా!'

రుద్రనాయకుఁడు ఆందోళన పడెను.

'అబ్బ! —!'

భద్రాంబ బరువుగ నిట్టూర్చి క్షణమాఁగి 'హేలాంబిక ఏమైనదోకదా!' అన్నది.

'— '

భద్రాంబ కొడుకువంక చూడలేకపోయెను. ఎంతకుదిగితినా యని ఆ తల్లి కటకట పడినది.

ఏమి చేయుదుము నాయనా। మన దురదృష్టము అన్నట్లు కాత్యాయని అత్తవారింటికి వెళ్ళునట।

వెళ్ళునా ?

మరే తెలిసినది ఒకసారిపోయి నా బదులు దానిని చూచిరా నాయనా। వీలయితే మా అమ్మ కనిపించి పొమ్మన్నదని చెప్పుము తమ్ముడుకూడ గ్రామములో లేడట పాప మా కాత్యాయనిని నేను కన్నారజూచి ఎంతకాలమైనదో ?'

అయిన నీకే వెళ్ళునది

ఏమి వేళాకోళమురా కదలలేకుండ నుంటినికదా।'

'వారి కొంపకు నే వెళ్ళను '

అదికాదు నాయనా। నే నింక ఎంతకాలమో జీవింపనురా; మరల ఎన్నాళ్ళకు కాత్యాయని అత్తవారింటినుండి వచ్చునో। ఒకసారి చూడవలెనని ఆశగానున్నది పోనీ నన్నే పంపించు '

'నిన్నా ?

కంటతడిబెట్టి ఆర్ద్రగళముతో అతిదయనీయముగా అడిగిన తల్లి అవస్థకు రుద్రనాయకుడు ద్రవీభూతుడై భయవిస్మయ భావము ప్రకటించెను

భద్రాంబ మరల అశ్రువులు నించినది

'అమ్మా। తప్పక కాత్యాయనిని రమ్మని చెప్పి వచ్చెదను ఇంటిలోనికి పద అసలే నీకు నీరసముగ నున్నది ' అని రుద్రనాయకుడు తల్లి చేయిపట్టుకొని మెల్లగా నడిపించుచు లోనికి దీసికొనిపోయి ఆమెను పరుండబెట్టెను

వెళ్ళెదవు కదా ?

భద్రాంబ మరల దీనముగా అడిగినది

రుద్రనాయకుడు క్షణము మాటాడలేదు తల్లి అవస్థగనిన తప్పక వెళ్ళవలెనని తలంపు కాత్యాయనీ ముఖసందర్శన మనిన ఎందుకో సంకోచము ఒకప్పుడు కాగల భార్య అనుకొన్న కాత్యాయని నేడు పరకీయ మీదుమిక్కిలి ఇప్పుడామె కాపురమునకు వెళ్ళుచున్నది కాత్యాయని మనసు వాని మగనితో కాపురముచేయదని ఎందుచేతనో రుద్రనాయకుని నిశ్చితాభిప్రాయము కనుకనె తాను దృష్టికి దూరముగుట తదీయదాంపత్య సహకారి కాగలదని రుద్రనాయకుని భావన అట్టిచో తల్లి ఇప్పుడు తప్పనిసరి యనుటే గాక త్వరపెట్టుచున్నది కాత్యాయనీనామస్మరణమే తనకు వివశతామూలకము ఇంకామెను జూచిన తనకెట్టి తియ్యనిబాధ కలుగునో యని అతని మనోవేదన। తల్లిమాత్రము అదే వివేదన తాను వెళ్ళ దలచును వెళ్ళరాదనియు దలచును విభిన్న సంకల్పముల విషాద సంఘటనతో నతని హృదయము ఉత్తాల

వీచీ మధ్య గండశిలవలె కలఁగి కరఁగిపోయినది ఆత్మ. ఆననీ దయనీయ దీనదృగంచల చంచలాశ్రుధార లాతని మనసు కోత పెట్టెను. కాలమేఘ త్రుటితేరమ్మరకళికాశ్రీవలె మెరదు మెరసినది. కాలు కదిలినది.

౨౬

నిశ్శబ్దప్రకృతి మునిమాపువేళ ఎందారఁబోసినట్లు వెన్నెల ఎల్లన గ్రోవివలె ఎల్లి తెమ్మెరల సంగీతము రుద్రనాయకుఁడు గృహప్రాంగణమునకు వచ్చెను. వాతావరణ మొకసారి వానికి పరాగప్రసరమై హిమానీస్నానమై సుగంధబంధురమై మనసున చల్లదనము నించెను. శీతలతావిశిష్ట తదావరణ వాతావరణ ప్రభావ మృదులానుభూతి మూలకమయిన అతని హృదయ మప్పుడు వర్షానంతర ధవళ మల్లికాదళ ప్రఫుల్లతేజః పరిస్వచ్ఛము ఐహిక వ్యామోహ కల్లోల జలధినిద్రాణదశా నిశాంత నిశ్చలతరంగ నిర్మలతా సంలగ్నము కాంతికిరణ ప్రసరణ సుకుమార లహరీలావణ్య పరిస్ఫుటము. అట్టి రుద్రనాయకుఁడు సహాయాత గంధవహాంకూర సమ్మార్జన మార్గుఁడై మాతుల గృహము సమీపించెను. అయఃకవాటబంధనము జరుగని సింహద్వారము తలుపులు తెఱచికొని హజారమున ప్రవేశించెను.

అదే సమయమున మధ్యద్వార తోరణాలంబాలోలమై చిఱిరి రాగములు చిందెడి అల్లికసనిగల అపలినాసతకాంత ఘటము కొలగించుకొని కాత్యాయని వీణాపాణియై యటకు వచ్చినది. అపూర్వ తేజస్సుకుమార సౌందర్యవిభవాభిరామయై ఆమెకనుపించి అతర్కితముగా రుద్రనాయకుని అంతరంగములో మధురభావోదయ మైనది. ఉపాస్థితనా స్వల్పవివేక ప్రబోధితుఁడై తనకుఁగలిగిన భావమున కతఁడె సిగ్గుపడెను. ఆమెకు కనిపించుటే అతనికి అపచారమని పించినది. అతనివంక దృష్టి ప్రసరింపఁజేయని కాత్యాయని అపర సరస్వతివలె అద్భుత భరతనాట్యభంగిమలో సుందరాసీనయై వీణాతంత్రులు కదిపినది. తన్నిక్వణనస్వర మంథరవలె రుద్రనాయకుని గుండె దూసికొని పోయెను. ఇంకను కాత్యాయని సంకల్పించు స్వరసమ్మేళన రతిని యొదలు అస్వాధీనమై అజ్ఞాతముగా గగుర్పొడిచెను. హృదయము మధురస్పందనము నించెను. అనిర్వాచ్యమధురవిచిత్రానుభూతి కలిగెను. సీటిజడగ చిటిలినట్లుల లేమొగ్గ పెటిలినట్లుల ఆమె కొనగోటి మీటుల కోమలవిపంచీరవములు వీనులు సోఁకి అంతరాంతర స్నాయువులు పులకెత్తెను. రుద్రనాయకుఁడు మాట అనఁబట్టలేక పోయెను.

కాత్యాయనీ!'

ఒకటే పిలుపు ఒకటే చూపు

కాత్యాయని త్రుళ్ళిపడినది

బావ!

అప్రియత్వముగ ఆమె పెదవులు అదిరినవి

రుద్రనాయకుఁ డామెవంక కనుఱెప్ప కదల్పక చూడ నాగెను ఆమెలో ఒకానొక నూతనశోభావికాసము పొడకట్టెను ఆమె అపాంగరమ్యరోచిస్సులలో అనిదంపూర్వదర్శితదివ్యదీధితు లేవేవియో గోచరించినవి అనేక సమ్మోహనాస్త్రములై ఆ కాంతిరేఖలు రుద్రనాయకుని కట్టివైచెను అంతకంటె కాత్యాయని కాతరాతురయై నిలిచెను అటులిద్దఱు త్రుటిసేపు తటిత్ప్రభా సమిరితు లయిరి తదవస్థాలబ్ధ తత్పరితాన్యోన్యకృత విచిత్రాజ్ఞాతగాథలై సన్నికట పరస్పరాభిముఖులయిరి అనాలోచనముగా రుద్రనాయకుని బాహులతలు కొనలుసాఁచి ఎగఁబ్రాకెను అంతలో అనాలోచనము గానె కాత్యాయని వెనుకంజ వేసినది భయాందోళన దోలాయమాన మానసయై బావా! అని మఱల అఱచినది రుద్రనాయకుఁడు తదామంత్రణ మంత్రముగ్ధుఁ డయ్యెను మంత్రవశంవద ఫణిరాజ సదృశముగా రుద్రనాయకుఁడు మఱొకయడుగు ముందునకు వేసెను

ఇట కూర్చుండునది బావా! ఇప్పుడే వచ్చెదను పొయ్యిమీద పాలు పొంగుచున్నవో ఏమో!' అని కాత్యాయని సమాధాన నిరపేక్షముగా లోనికి నిష్క్రమించెను అటే రుద్రనాయకుని దృష్టి అంకితమై పోయెను కాత్యాయనీ తరుణ వయస్సృద్ధస్నిగ్ధ తనూవిలాస పునస్స్మరణ వ్యాకీర్ణుఁడయిన అతని మేధాసీమలో ఐంద్రియ వ్యాళములు పుట్టలు పోయసాగినవి

కాత్యాయని! కాత్యాయని!!

ఒకటే అంతస్స్మరణ ఆదియే సహస్ర నామార్చన మతనికి అపూర్వమయిన కాత్యాయనీరూపరేఖలు పరంపరగా నతనిలో మెఱుఁగు తీగలయి మనసు సోగలు కురిసినవి

ఇంతలో కాత్యాయని గుమ్మములోనికి వచ్చినది వాలుజడ వక్షోభాగము మీదికి లాగి వంచినతల యెత్తక జడకుచ్చులు సవరించుకొనుచు వింతవైఖరిలో ద్వారబంధమున కానుకొని నిలిచినది

ఆ దృశ్యము రుద్రనాయకుని ఎదలో తలిరాకుసూదులను తాకించెను అతని మోము మీదుగ మిణుగురుపురుగు మిలమిల మెరసి ఎగిరి పోయినటు ఆమెలోని ఆకర్షణమె అతనికి అక్షరాభ్యాస మయినది

అంతవరకున్న కాత్యాయని మఱల లోనికి వెళ్లెను ఆమె వైఖరి రుద్రనాయకునకు అర్థముకాలేదు నిగర్హణమా అని కూడ శంకించుకొనెను కాని కాత్యాయనిలో ఒక క్రొంగ్రొత్త వికాసము రుద్రనాయకుని అంతరంగ

మున అచ్చుపడిపోయెను అతఁ డటునిటు చూచునంతలో మరల ఆమె సాక్షా
త్కారము ఈ సారి ఆమెచేతిలో రజత థాలిక యొకఁడు కలదు అందు రత్న
రాశులవలె అనేక రసవత్ఫలములు।

'ఇవన్నియు నెందుకు?

రుద్రనాయకుఁ డమాయకముగ అడిగెను

'గృహస్థ ధర్మము

కాత్యాయని ఆతిథ్యమర్యాదకు ఉపక్రమించినది

భక్తితోఁ దెచ్చితిని బావా। నీవు తీసికొనకున్న నామీద ఒట్టే। అని
కులుకు వోయినది

రుద్రనాయకుఁడు మాటాడలేదు

'ఏదేమి బావా। ఆగ్రహమా?'

కాత్యాయని ఆదరపూర్వకముగ అడిగినది

అప్పటికిని రుద్రనాయకుఁ డదే మూకముద్ర

కాత్యాయని హృదయమున కాలమేఘములు కదలినవి నిగూఢమథన
ముతో తెచ్చికోలు వికాసముతో ఆమె చేయూర ఫల మందీయబోయినది ఆ
నవ యమున ఆమె కొనవేళ్ళు మేనసోకి వీణాతంత్రులు కదులుచున్నట్లు కుదుపు
తగిలి రుద్రనాయకుఁడు ఉలికిపడెను

కాత్యాయని అతనిచేతిలో ఫలముంచి మరల లోనికి పోయెను రుద్ర
నాయకునకు మతిపోయినంత పని అయినది విద్యుల్లతవలె విరిసి క్షణములో
మటుమాయమగుట విస్మయము కలిగెను అతని భృకుటి ముడతలు పడెను.
స్పృహ తప్ప స్మృతి తెక్కలు విప్పినది గృహిణియైన కాత్యాయనితో
పరిణయనియే అతనికి కన్నులఁ గట్టెను వివేక తేజస్స్ఫురణ మొగ్గుపడెను.
మరల కాత్యాయని వచ్చినది ఆమె తెచ్చిన పాయసపాత్రి రుద్రనాయకున
కందిచ్చెను ఆ పాత్రి నందుకొనువేళలో తాను లిఖించిన చిత్రపటములో
శ్రీకృష్ణునకు వెన్నముద్ద లందిచ్చు రాధిక జ్ఞప్తికి వచ్చి రుద్రనాయకుఁడు
కాత్యాయనివంక నిశితముగ చూచెను

'మీ నాన్నగారు మమ్మెంత వెలివేసిన నీకయిన దయలేదా బావా?

కాత్యాయని జాలిగా అడిగినది

రుద్రనాయకుఁడు మౌనతపస్వియే।

'పోనీ బావా। కనీసము సువర్ణకంకణము బహుమానము వచ్చినదని
యైన చెప్పఁదగమా?'

మా అక్క నెప్పుడు తీసికొని వచ్చెదవో అదైన చెప్పు బావా
అక్క।

రుద్రనాయకుఁ డప్పు డులికి పడెను
'అవును బావా!
కాత్యాయని ధాటిగ అన్నది
దాని పేరెత్తకు"
రుద్రనాయకుఁడు ఖండితముగ చెప్పెను
'అదేమి బావా!
అంతే!'
కాత్యాయని అర్థము కాలేదు

పుట్టింటికి వెళ్ళిన మా అక్కను తీసికొని రమ్మనుటే అపచారమా? పోనీలే బావా! నా మనశ్శాంతికొఱకైన అక్కను మన్నించుటలేరన్నమాట — అంతేగా?

కాత్యాయని గారాముగ ఇంచుక కోపము ప్రకటించెను ఆ కోపమున ఆమె వదనశ్రీ ఒక వింతసొబగును ఒలికించెను తద్దర్శనము రుద్రనాయకుని వివశునిఁ జేసెను అమాంతము లేచెను అతని కనుల నీలిపాపలలో కాత్యాయని మేని మెఱుఁగులు ప్రతిఫలించినవి అతని అస్పష్టవీక్షణ పరంపరకు కాత్యాయని కంపించిపోయెను ఆయుద్వేగమున ఆమె పల్లెవాటు జారెను అజ్ఞాతదశా విగళితాంశుకము సవరించుకొనుచు ఆమె సిగ్గుల మొగ్గలు చిందినది పొగమంచు తెర తొలఁగి పొటమరించు గోరంటపూవులాగు గోర్వెచ్చని లజ్జాహాసముచేసెను రుద్రనాయకున కది మదిరాసవపాన మాదకతాపాదకమై ఇహలోక స్పృహ నశింపఁజేసెను తత్క్షణము 'కాత్యాయనీ!' అనుచు ఆమె చేయి పట్టుకొనెను హఠాత్తుగా బావా! అని కాత్యాయని చేయి విదల్చుకొని దూరముగ తొలఁగి పోయెను

'నాపైన నీకు ప్రేమలేదా?'
రుద్రనాయకుఁడు సూటిగ ప్రశ్నించెను

అదేమి బావా! నీయెడ నాకు ప్రేమ లేకపోవుటేమి? అది భగవంతుని యెడ భక్తికంటె అత్యధికమే! అట్లే ప్రతిఫలాపేక్ష రహితము

"వేదనా హృదయమునకు వేదాంతమే గతి'
'కాదు బావా!'
"ప్రాణేశ్వరుఁడు నేర్పిన పాఠములా
"అసలే కాదు నా జీవితము నాకు నేర్పిన గుణపాఠములు"
"బలిపీఠములను'

కాదు బావా! ప్రతినిత్యము నిన్ను దర్శింపవలెనని నీతో మాటాడవలెనని నీ చిత్రలేఖనము చూచి మురిసిపోవలెనని నాకు నాఁడును నేఁడును ఉత్కంఠయే'

తనూ వినూత్న శోభకు చలించిపోయితినే। ఛీ! కల్మషహృదయుఁడనైతిని। ఆమె వివాహిత అను జ్ఞానమే నాలో నశించినది ఆమెను స్పృశించుటకు నా కేమి అధికారము కలదు? మనశ్చాంచల్య మెంతటి మహోగ్ర బలీయమైన అధికారిముందరను గాఁబోలు।—

కాత్యాయని ఏమి కిటుకులు నేర్చినది। ఆమె సులభగ్రహణీయ కాని సుస్వభావ। అంతేకాదు అతిలోక శీలవతియే అగుత। ఎట్టి ఆత్మనిగ్రహ శక్తికల దామెకు? ఎంత విజ్ఞాన సముపార్జన చేసినది। బహుగ్రంథపరిచయ భాగ్యవశమున నేను ఆర్ద్రమనస్కుఁడనై భార్యా రంజకుఁడ కాఁదలఁచితిని కాత్యాయని తద్భిన్న సహజవాసనా బలమున భర్తృపాలిత అయినది మా మనః పరిణామములు లోకమునకు విస్మయ జనకము లగును సాధారణ మానవులకు అభూత కల్పనా విశేష మనిపించును గాక; ఉత్తమ సంస్కార సంపత్తి కల వారికి స్పష్టమగును కదా।—

ఈ విధముగా రుద్రనాయకుఁడు ఎచ్చెచ్చిగ ఆలపోసించుచు వీథినిబడి రథ్యకు వచ్చెను అట శిలావేదిపై నిరువురు మాటాడుకొనుచుండిరి అన్యథా మనస్కుఁడయ్యు రుద్రనాయకుఁ డటు చెవి నప్పగించెను

'కళింగ యుద్ధము పూర్వచరిత్ర ప్రసిద్ధము అలనాఁడు అశోకచక్రవర్తి భూతదయానుభూతికి హేతుభూతము ఈనాఁడును గణపతిదేవ చక్రవర్తికి సర్వమత సమదృష్టిని పరిపోషించు సంప్రదాయ సమ్మతమయిన మత సామరస్య సిద్ధాంతగవేషణాపరత్వపు చింతనకు కారణమైనది

ఎందువలన?

ఏమున్నది కళింగాధిపతి నాపయనాయకుఁడు ఉద్దండ పరాక్రమశాలియై అశేషసేనావాహినితో రణభూమికి వచ్చెనుగాక। కాకతి సేనావాహిని గూడ తద్ధిక్కారము సమర్థము కాకతి సేనావాహినికి గజసాహిణి జాయప నాయకుఁడు భగీరథుఁడు అతనికి నేను సారథిని దురదృష్టవశమున నాపయ నాయకునకు కుడిభుజము మన రాజ్యములోని మహానుభావుఁడు।

ఎవరు।'

సైంధవ సదృశుఁడు

'ఆ రాజద్రోహి పేరు?

'కృష్ణనాయుడుగారు।'

'ఎవరా ఉపసేనాధిపతి

'అవును మహాసంగ్రామ రంగమున మడుగునఁబడిన మదేభమువలె విజృంభించిన మహావీరుఁడు గజసాహిణి జాయపనాయకుని ప్రత్యర్థి గణపతి దేవ చక్రవర్తిగారి ఉపసేనాధిపతియే ఆ మహానుభావుని కత్తి కదలికలో ఎదిరి సేన ఛిన్నభిన్నమయినది అతని పౌరుషానల జ్వాలాఘాటికి మేటివీరులే భస్మీ

భూతులయిరి కాని కృష్ణనాయకుఁడు ఆకలిగొన్న హర్యక్షము వికటాక్షిల మృగరాజ దంష్ట్రాగ్రములవలె కృష్ణనాయకుని ఖడ్గాంచలము నాయపనాయకుని మెడమీఁద పడఁబోయినది అంతలో హేమాద్రిరెడ్డి — కాదు ప్రభువేషకుఁడు — శుంభముకాక తప్పలేదు

ఆ॥

రుద్రనాయకుఁడు నిలువున కూలిపోయెను అతని సన్నాహయవములు వ్యస్తులై కాలికి గాయువలె ఎట్లు తప్పెను

'ఇఁక మిగిలినది — కాకతిగణపతిదేవచక్రవర్తి సార్వభౌమత్వాధికుఁడుగా కాపయనాయకుఁడు కై మోద్పుల — అందుకు వారిని వేంగి విషయాధినాథులుగా మన ప్రభువులు నియోగించిరి ఈ మహాసంగ్రామమునకు మూలకారణము మత దుర్మమత యని చక్రవర్తికి అవగాహన మయినది మతోన్మాద మహావిప్లవ నిర్మూలనకై గణపతిదేవ చక్రవర్తి బద్ధకంకణులయిరి అసలు వ్యక్తులు అటులు రక్షితులే। ఎటువచ్చి ఆత్మబంధువులయిన బావమఱఁదులే—'

రుద్రనాయకునికి మఱి మనస్కరించలేదు కత్తివలె దూసికొని కదలెను

౨౮

కాలమొక యవనిక దాని పతనోత్థానములు లిప్తమాత్రములు అనేక సంఘటనల యవనికాభ్యంతరమున ఐంద్రజాలికములు।

కృష్ణనాయకుఁడు రణరంగమున నిహతుఁడయ్యెను ఆ వార్త విని భద్రాంబ అసువులఁ బాసెను రుద్రనాయకుఁడు ఒంటివాఁడయ్యెను అంతే కాదు చదువునకు స్వస్తి చెప్పెను చిత్రలేఖన కృషి చిత్తగించవలెను వదలి వచ్చినది మనస్తిమితత్వ మతనికి మందగించినది సరిగా ఇంటిపట్టున ఉండఁడు నిద్రాహారములు ముందే విప్పచ్చరము లయినవి నిలుకడ శూన్యము నిరాశానిస్పృహము లతనిలో నిరాఘాటకములు అనేక వికారముల కిప్పు డతఁ డాలవాలము అతని వైఖరి భాస్కరభట్టారకునకు భయజనక మయినది ఐహికమయిన రాగద్వేషములకు దైవాకమైన సుఖదుఃఖములకు అతీతులయిన భాస్కరభట్టారకులకు రుద్రనాయకుని హృదయవీధీశిథిల శోకాలయములో జ్ఞానదీపములు వెలయించుట ప్రత్యేక ప్రత్యహకృత్యమైనది

సంసార మన్నది సుఖదుఃఖముల అద్వైత స్థితి సౌఖ్యమున పొంగిపోవుట దుఃఖమున కుంగిపోవుట అజ్ఞానమూలకము ఆత్మ పరిపాకలభ్యమయిన వివేకముతోడి ధైర్యావలంబనమె ధీరోదాత్తము అదియే ప్రాజ్ఞలక్షణము''

అనేక పర్యాయములిట్లు భట్టారకులు శిష్యుని హెచ్చరించిరి అది రుద్రనాయకునకును ప్రత్యక్షర సత్యమనిపించినది కాని తదవస్థ అతనికి

దుస్సాధము హృదయము భగ్నమై మనస్సు వికలమయి రుద్రనాయకుఁ డానాటికానాఁడు కృశీభూతుఁడగుచు నిశీథముల సైతము నిశాచరివలె వీథీవిహారములకు పాల్పడెను ఒకసారి అర్ధరాత్రమున రుద్రనాయకుఁ డాసీనుఁడైన రథ్యకు సమీపములో ఎవరో బాటసారు లిరువురు కబురులు చెప్పుకొనుచుండిరి రుద్రనాయకుఁడు వారి సంభాషణ మాలకింపనాగెను

ఒక బాటసారి — అన్నమయ్యగారి దసలా గోదావరీ తీరము '

రెండవ బాటసారి — నాసిక మొదలు నదీసంగమపర్యంతము తీర ముందునదే।'

మొదట బాటసారి — నిజమే కాని రాజమహేంద్రవర ప్రాంతమందలి ఎట్టిన గ్రామ మందు వెలసిన వీరభద్రేశ్వరస్వామి ఆయన ఇలవేల్పు '

రెం బా —'ఆయన ఓరుగల్లున కేలవచ్చిరి

మొ బా — ఆయన సహజయాత్రాశీలి మొన్నటివఱకు ఓరుగల్లున నుండిరి ఇంతలో శ్రీశైలము వెళ్లిరి అచట మాత్రమాయన స్థిరవాసముండెనా? శ్రీశైలములోని శ్రీ మల్లికార్జున స్వామిని కొంతకాలము సేవించి కృష్ణాతీర మందలి ఎలనాఁటిలోని చిట్టిపాలెము సమీపములో నున్న విశ్వామిత్రాశ్రమమునకు విచ్చేసిరి అత్రికాలయనఁగా నదియే ఆ సత్రశాలలోనె యథావాక్యము అన్నమయ్యగారు సర్వేశ్వరశతకము శపథపూర్వకముగా పూర్తి చేసిరి '

రెం బా — శపథమేమిటి? "

మొ బా — ఎఱుఁగరా? అదొక ఆశ్చర్యకరమైన సంగతి

రెం బా — 'ఏమంత విశేషము?'

మొ బా — విశేషమే। సత్రశాలలో శ్రీ మల్లికేశ్వరస్వామి సంసేవనమున అన్నమయ్యగారు సత్కావ్యరచనకు ఉపక్రమించిరి అది కేవలము భక్త్యావేశముకాదు భవ్యకవితావేశము ఆయన శపథమే అందులకు నిదర్శనము

ఒక్కొక పద్య మొక్కొక తాళపత్రమున వ్రాసి, అది కృష్ణానదిలో విడిచి ప్రవాహమునకెదురీది పత్రము వచ్చిననే సూత్రబద్ధము చేయుట అట్లుకాక, తాటియాకు ప్రవాహమున వాలు మొగము పట్టెనా వెంటనే తాను శిరచ్ఛేదము చేసికొనుట — అన్నది శపథము '

రెం బా — 'అబ్బ ।— ఏటిలోపడిన ఆకు ఎదురు వచ్చుట సంభవమా ।'

మొ బా —'సంభవమైనచో సర్వేశ్వరుని మాహాత్మ్యము అన్నమయ్యగారి సద్భక్తి తెల్లమగును లేనిచో లేదు

రెం బా — అట్లు జరిగినదా?

మొ బా —"ఎనుబది పత్రములకు పైఁగా ఏటి కెదురు వచ్చినవి '

రెం బా — నిజముగానా? '

ఆ బాటసారి ఆశ్చర్యన్తబ్దుఁడయ్యెను ఆరంతయు రుద్రనాయకునకు అద్భుతావహమై ఆకర్ణనాసక్తిని ద్విగుణీకృత మొనర్చెను

మొ బా — 'ఒకపత్రము ప్రవాహమున కెదురురాలేదు

రెం బా -- రాలెదా ,'

మొ బా --"లేదు వెంటనే అన్నమయ్యగారు అన్న మాటప్రకారము గంటము వదలి గండకత్తెర చేఁబట్టిరి ?"

రెం బా — ఏమి ?'

మొ బా — 'ఆయన మస్తకచ్ఛేదమునకు నమాయత్తపడు నంతలో గోపాలకుఁ డొకఁడు తనకు దొరికినదని తాళపత్ర మొకఁడు తెచ్చియిచ్చె నఁట। ఆ పత్రమున మఱొక పద్యము వ్రాయఁబడి యున్నది '

రెం బా — 'మఱొకపద్యమా ?'

మొ బా — 'అపుడు మొదట అన్నమయ్యగారు

మ తరులం బువ్వులుఎందెలై యొదవి తత్తజ్జాతితోఁబండ్లగున్
హర మీపాదపయోజ పూజితములై యత్యద్భుతంబవ్విరుల్
కరులౌ నశ్వములౌ ననర్ఘమణులౌఁ గర్పూరమౌ హారమౌఁ
దరుణీరత్నములౌఁ బటీర తరులౌఁ దథ్యంబు సర్వేశ్వరా।

అని వ్రాయఁట కాని

మ ఇక పుష్పంబు ఫలప్రదద్వయముపై పొప్పంగ సద్భక్తి రం
జకుఁడై పెట్టినపుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్నఁ బా
యక కాలత్రితయోపచారములఁ నిన్నర్చించుచున్ బెద్దయై
ష్ఠకుఁడై యుండెడువాఁడు నిజగుట రాఁజిత్రంబె సర్వేశ్వరా।

అని గోపాలకుఁడు తెచ్చిన పత్రమునం దున్నదఁట

రెం బా — ఆ గోపాలకుఁ డెవరో ?'

మొ బా — ఇంకెవరు ? భక్తజనమందారుఁడు సర్వాంతర్యామియు నగు నా సర్వేశ్వరుఁడే ।'

రెం బా — ప్రపత్తి ఎట్టిదును సత్ఫలకమే ।

మొ బా — అన్నమయ్యగారి సద్భక్తి అట్టిది అటుపై శతకము నిర్విఘ్నముగ పరిసమాప్తమయినది "

రెం బా — 'ఏదా శతకములోని మేఱొక పద్యము చదువుఁడు '

మొ బా — 'సర్వేశ్వరసద్భక్తి యెట్టిదో ఆయన తెలిపిన పద్యము చదివెదను

రెం బా — 'అంతకంటె వలయునదేమి ?"

మొ బా —

మ. ఉరుసంసార గజేంద్ర దుర్ధర నవ్యూథ ప్రతాపోగ్ర కే
సరి దుష్ప్రాప శరీరబంధ విపులాత్మాఘ ప్రజచ్ఛేద వి
స్ఫురితక్రూర కుఠారధార దురితప్రోద్భూత జీమూత దు
స్తరసంఘాత విఘాతమారుతము నీసద్భక్తి సర్వేశ్వరా!'
రెం బా — 'చక్కగఁ జెప్పిరి
మొ బా — కాదా మరి?
రెం బా — ఇఁక శయనింతము లేనిచో వేకువను పయనింపలేము
మొ బా — అవును''

బాటసారు లట్లు శిలాతలములపై లాతలు తలాడలుగా మేనులు వాల్చిరి

రుద్రనాయకునకు వారి సంభాషణము సంపూర్ణముగా వినఁబడెను సాక్షాత్పరమేశ్వరకృత పద్యగ్రథన కథనము సంతోష ప్రదమైనది సర్వేశ్వర సద్భక్తి విశేష మతని హృదయమున గాటముగ నాటుకొనెను ఆ రేయి నిదురలో సైతము సంసార గజేంద్ర దర్పదళన ప్రతాపోగ్రకేసరి దురిత జీమూత విఘాత మారుత మనియే కలవరించెను

తెల్లవారినది అంధతమిస్రచ్ఛటావళి పటాపంచ లయినట్లు సంశయానేకము పరాస్తమై రుద్రనాయకుఁడు ప్రాభాతగోష్ఠాప్రభవములో అధ్యయనాదికము ప్రారంభించుకొని అతి దాక్షిణ్యానమానులైన భాస్కరభట్టారకులను దర్శించెను ఆయన రుద్రనాయకుని సానుకంపముగఁ జూచిరి

రుద్రనాయకుఁడు ప్రాంజలి ఘటించి పలుక సాగెను

గురుదేవులకు నమోవాకములు మీరు నా విన్నప మాలించి అభ్యనుజ్ఞ ననుగ్రహింపవలెను'

ఏమది?

మానవజన్మమునకు చరమలక్ష్యము మాహేశ్వరసాన్నిధ్యము కదా! ఇఁక మీ అనుజ్ఞ అయిన ఏకాంతజీవిత విశేషమంతయు శివధ్యాన మగ్నుఁడనై ఆత్మము పావనము చేసికొందును'

'ఏవిధముగ?

ఏకాంత గుహాంతరమునకో లేదేని ఏ ప్రశాంత ఋషివాటికకో పోయి కేవల తపోనిష్ఠ నందఁగోరెదను

'ఋషివాటిక లెక్కడఁ గలవు

'గోకర్ణ మరములు తత్సదృశములని నా తలంపు'

అదియా? — ఏదే—అటులేల నిమ్ము సంసారపంకిలంకలితమైన మానవ మానస సరోవరమున స్వచ్ఛసరోజ సంపుల్లదళశోభిల్లసన మెవ్వరికిని లభ్యానందమె కాని అంతవఱకు నేను దేశికుఁడ నను గౌరవము నీకు కలదు

ఆశ్రమాభివృద్ధికి విద్యావ్యాసంగములకు ప్రభువులు తప్పక ఇతోధిక ప్రదానము లొసంగుదురని మదాశయము భవతు ఇక మీరు పూజానిష్ఠకు ఉపక్రమింపుడు జయశంకర, భక్తవశంకర॥'

ఆచార్యప్రోక్తముగ భక్తులందరు తమతమ ఆశ్రమములకు దారితీసిరి మఠాచార్యులు మాత్రము పర్ణశాల వాకిట శిలావితర్దిపై ఆసీనులయిరి ఆయన జ్యోతిర్మయనములతో లలాటత్రిపుంద్రములతో మేని భసితంపు వెలుపూత నిగనిగలతో మౌళికీలితప్రసాద మందారసుమములతో రుద్రాక్ష భూషలతో ప్రత్యక్ష కైలాసపతివోలె భాసమానుడై యుండెను

అంత నొక యువకుడచటికి వచ్చెను

ఎవరవు నాయనా ?

నూతనాగంతకుని మఠాధిపతి ప్రశ్నించెను

ఒక జిజ్ఞాసువను।

ఎందు నిమిత్తము నీ జిజ్ఞాస ?

జిజ్ఞాస యన్నిమిత్తమో తన్నిమిత్తమే।

విశ్వేశ్వర శివాచార్యుల కా సమాధానము ఆశ్చర్యజనకమైనది

నీ పేరు ?'

అనిమాత్రము అడుగగలిగెను

రుద్రనాయకుడు

'నివాసము ?'

'ఓరుగల్లు

ఇంతదూర మేల వచ్చితివి ?'

ముముక్షువునకు సుఖదుఃఖములట్లు జిజ్ఞాసువునకు సమీపదూరములు సంభావ్యములా ?

అయిన ఆశ్రమప్రవేశ లభిలషింతువా ?'

తమ రనుగ్రహించిన తప్పక

ఓరుగంటినుండి వచ్చితి నంటివి। ప్రభువులు రాజధానికి వచ్చిరా? ఇంకను పర్యటనలో నుండిరా ?"

'ప్రభువిషయము సామాన్యప్రజ కెట్లు తెలియును ?

మఠాధిపతి క్షణము స్తబ్ధుడయ్యెను ప్రశ్నమున కెదురుప్రశ్న మొసగు బాలకునిపై నొకవంక కోపము మరొకవంక ఆతని ఆత్మధైర్యమునకు మహానందము కలిగెను పెద్దలయెడ విధేయత ప్రకటించు నాతనిపై భరి దుస్సహమై కూడ నిశ్శంకానిర్భర మనఃప్రవృత్తి మఠాధిపతికి మనస్సులో సంతోష హేతువైనది స్వచ్ఛందశీలురు ఆత్మప్రత్యయము కలవారు తప్పక ఆశ్రమవాస యోగ్యులనియు కేవల నిష్ఠాగరిష్ఠు లగుదురనియు విశ్వేశ్వరం శంభువునకు

విశ్వాసము కలిగెను. వెంటనే రుద్రనాయకుని ఆశ్రమవాసిగఁ జేయ నిశ్చయించు కొనెను.

'రుద్రనాయకా! నీవు శివదీక్ష పొందినచో తప్పక నీ ఆశయము సిద్ధించును. పవిత్రాశ్రమ జీవనమున పరమేశ్వర సాక్షాత్కారము సులభము. దీక్షాదక్షత అట్టిది. అభీష్టమేని చెప్పుమనెను.'

'నే నిచటికి వచ్చినది ఆశ్రమ జీవనమునకే. అటుపై మీ అనుజ్ఞ.'

'అనుజ్ఞ సులభమే. ఆశ్రమవాసము క్లిష్టము. మఠ ధర్మము, మఠ నియమము పాటించుట అవధారావశ్రితము. అందుకు పరీక్ష అవసరము.'

'సిద్ధముగ నున్నాఁడను.'

'ఏకాగ్రత తెలుపక తెలియుచున్నది. ఎంతయు సంతోషము. మా గోళకీమఠముల నియమములు చెప్పెదము. అవి పాటింతునని ప్రతిజ్ఞ చేయవలయును.'

'మనసా ప్రతిజ్ఞ చేయుదును.'

'మంచిది. మఱియుఁ వినుము. మఠదీక్షమమత సామాన్యము. ఆచరణము దుర్ఘటము. అది సుకరమగుటకు కొన్ని నియమములు అవసరము. అవియే మా మఠనిష్ఠలు. దీక్షాయుక్తునకు ద్వంద్వములపై నాసపోవలయును. మదమాత్సర్య గర్వాదు లుండరాదు. కుత్సితస్వభావము, క్రోధశీలము, మాత్సర్య గుణము త్యాజ్యములు. శాంతము, ముఖవికాసము, సద్వర్తనము, సద్గుణశీలము అత్యావశ్యకములు. ధర్మార్థసాధనబుద్ధి అవసరము. ఇఁక ముఖ్యముగా శివుఁడే దైవమని ఎఱుఁగవలెను. మహేశ్వర మహోత్సవాదులు చేయవలెను. నిత్య శివార్చన నిష్ఠ గురుపరిచర్యాదిక భయభక్తులు ముఖ్యములు. అందుకు అభిమతి మేనా?'

'అభిమతములా అని అడుగనేల? అయ్యా! అవి మానవునకు మానవత్వము నిలుపు మహాధర్మములే కదా!'

'మానవత్వమే కాదు, మాహేశ్వరత్వము మానవునకు అత్యంతావశ్యకము. ఈశ్వరాంశ ఏరూపముననేని పూజనీయమే. గర్భశత్రుపై నెప్పటికి లింగ సహాయుఁడైనచో ఆప్తమిత్రునివలె చూడవలెను. శివభక్తిం గాతుఁను మృత సదృశులట్లు ఎవ్వరైననుసరే వర్జింపవలెననదే. బసవేశ్వరభక్తి పేరశాస్త్రార్థ సంపాదితమే. దూషణ భూషణములకు అతీతావస్థ నందుకొనవలెను. ఎవరేమనిన పరమేశ్వర శరణమె కర్తవ్యము. పరకాంతాపరకీయవిత్త ప్రలోభములు పరిహార్యములు.—ఇవి మఠధర్మములు. ఇఁక మఠనియమములు వినుము. ప్రతి నిత్యము జంగమార్చనముచేసి ప్రసాదము గొనవలెను. కూలిభక్తుఁను శ్రీవణ ప్రవణముగా నుతియింపవలెను. ఇఁక సర్వకాలసర్వావస్థలందు గురుస్వరూపము మఱువరాదు. లింగధారివి కావలెను. ఇఁక సర్వము సర్వేశ్వరమయము. అతఁడు

సర్వమును వ్యాపించు చైతన్యమూర్తి। అతడే తండ్రి। పార్వతియే తల్లి భక్తులందరూ వారి బంధుజనులు ఇట్లనుట నానాపురాణాగమార్థ ప్రకారము జగజ్జననీజనకులు పార్వతీపరమేశ్వరులు ప్రజలందరు వారి ప్రజలు జాతి భేదము లేదు ఈ నియమములు పాటింతునని శపథము చేయవలెను అట్లు ప్రతిజ్ఞచేసినచో లక్ష్మీపతి నీకు చిన్మయదీక్ష నొసంగి హస్తమస్తక సంయోగమును పంచాక్షరీ మంత్రోపదేశమును చేసి లింగమునకు ప్రాణకళాన్యాసము చేసి నిన్ను లింగధారిని చేసెదను ఏమందువు?

నియమపాలనమున కిదే నా ప్రమాణము
సాక్షాత్పరమేశ్వర సాక్షిగా?
'సాక్షాత్పరమేశ్వర సాక్షిగా
అయిన లోనికి రమ్ము

శిలావేదికనుండి శివాచార్య మఠాధిపతి లేచెను రుద్రనాయకుడాయన అడుగుజాడలలో ఆశ్రమప్రవేశము చేసెను

౨౯

తీర్థయాత్రలైన పిదప గణపతిదేవచక్రవర్తి రాజధానికి వచ్చెను ప్రాయప నాయకుడు సత్వర సమాలోచన సమావేశ మొకటి యేర్పాటుచేసెను ఆ సభకు ఆహూతులు మహాప్రధాని గోవిందనాయకుడు మంత్రిసత్తముడు శివ దేవయ్య సర్వసేనాని మేచయనాయకుడు మాత్రమే। అందఱును రహస్య మందిరమునకు వచ్చిరి అభ్యుచితాసనములు అలంకరించిరి అనంతరము గణపతిదేవచక్రవర్తి పురుషవేషధారిణి రుద్రమదేవితో సభకు వచ్చెను పరస్పర ప్రత్యభివాద సంరంభమంచే నుపవరించిరి చక్రవర్తి ప్రత్యేకపీఠము నధివసించెను ఆ చెంతనే రుద్రమదేవియు ఆసీనురాలైనది

అత్యవసర రహస్య సమావేశమునకు కారణము? గణపతిదేవ చక్రవర్తి అమాత్యశేఖరులను ప్రశ్నించెను

ఎవ్వరును సమాధాన మీయలేదు అమాత్యశేఖరులు అధోముఖులై పరస్పర నిరీక్షణములతో పరామర్శించుకొనిరి

ప్రాయపనాయకుడుమాత్రము ప్రభువునెడ దృష్టిసంలగ్నము చేసెను

"మేము తీర్థయాత్రలకు వెడలితిమి ఏమేని రాజధానిలో విపరీతములు జరిగినవా? ఏవేని విపత్తులా?"

అప్పటికిని మంత్రులు మౌనవ్రతము మానలేదు ప్రాయపనాయకుడు మాత్ర మొకసారి మోమెత్తి చక్రవర్తివంక, రుద్రమదేవివంక దృష్టిప్రసారము చేసెను

'ఏకీభావము కుదిరిన మూకీభావముతో మీరు నాకు సూచించునది సుబోధకము గాకున్నది. ఆప్తులెవ్వరేని ఆపన్నులా ? రాజ్యాంగ వ్యవహారముల చలన మేదేని వాటిల్లినదా ? రాజ్యము సుభిక్షముగా లేదని ప్రజలు తలపోయుదురా ? శత్రురాజుల సమర సన్నాహములుగాని తెలిసినవా ? అంతఃకలహములేవియైన ఆకస్మిక సంభవములా ? ఏమది ? దేనికిని సమాధాన మీయరు ? మౌనధ్యానమునకే సత్వర సమావేశమా ? అగుచో రహస్య మందిరమేల ? చక్రాంగ దేవళమున తాంబూలవారమే !

చక్రవర్తి భయాంకోళనము ఛలోక్తిగా మార్చెను. అయినను వారు చలింపలేదు.

ప్రధానామాత్యా ! రాజ్యాంగ వ్యవహారములు సురక్షితములేనా ?

గోవిందనాయకునివంక దృష్టినిలిపి ప్రభువు ప్రశ్నించెను.

మా అనుభవమునకు రుద్రమదేవి భిషజావిభవము తోడు పడగా రాజ్యాంగ వ్యవహారములు సురక్షితములుగాక యుండునా ప్రభూ ?

'మరి ? — శివదేవయ్యగారూ !'

దేశము శివేతరముకాదు గదా ?

అనగా శివేతరమత ప్రాధాన్యము లేదని మాకు హెచ్చరికయా ?

'అనపేక్షితార్థమయ్యునది ప్రత్యక్షరసత్యము. కాని ప్రాధాన్య వివక్షను మాత్రము కాదు పర్యాప్తవిషయికము

ఇతరమతములు ఇతఃపూర్వమువలె ప్రవర్ధమానము లగుటకు మన ప్రభుత్వము దోహద మొనగుచున్నదికదా !

నిస్సంశయముగ !

అయిన సమాలోచనీయాంశ మెయ్యది ? — మేచయ నాయకులుగారూ ! మన సైన్యము సమరాయత్తముగ నున్నదా ?

స్వప్నమునందైన సంసిద్ధము.

'ఏమోయి జాయపనాయకా ! ఎందులకీ సభ ఏర్పాటు చేసితివి ? సమావేశకర్తవు నీవును మౌనమే వహించిన సమాలోచన మేముందును. ఒకవేళ మా తీర్థయాత్రాదికము ప్రభుత్వ బాధ్యతా ప్రతికూలమని గాని మా నిగూఢ కర్తవ్య ప్రబోధనమా

సమస్తజనుల సౌఖ్యమే లక్ష్యమైన సామ్రాజ్యాధిపతుల ప్రజాక్షేమ సమాచార స్వయం పరిశీలనము శంకావహ మెట్లు ?

ఏదియునుకాదు. ఎందులకీ సమావేశము ? 'సత్వర సమాలోచనము, రహస్యసమావేశము !! అతిముఖ్య ప్రకృతిగత పరిమితము !!' అంటివే ! — ఏమమ్మా రుద్రమ్మా ! అని గణపతిదేవ చక్రవర్తి పురుషవేషధారిణి పుత్త్రికా రత్నమును సంప్రశ్నముగా చూచెను. ప్రభువిలోకన మటు ప్రసరించుడు

ముఖ్యజనుల ముఖారవిందములు ప్రఫుల్లములైనవి. అప్పుడు జాయపనాయకు నెదద జాలువారిన అంతస్తోషతుషారములు హిమానీ సరిన్నిధులు.

మా రుద్రమకాదా మౌనమే! ఏమమ్మా! నేనున్నపుడేగాక నా లేని వేళలనైతము రాజ్యాంగ వ్యవహారములు రక్షదక్షములు చేయ నీకును క్రొంగ్రొత్తగ నున్నదా నేటిసభ?' అని గణపతిదేవుడు ఆప్యాయముగ పలికెను.

తదంగీకార సూచకముగా రుద్రమదేవి తలవంకించెను. అప్పుడు జాయపనాయకుని అధరము హర్షకంపనమందెను.

గణపతిదేవచక్రవర్తి అది గమనించెను.

ఆమె పరిపాలన దక్షతకు ప్రధానామాత్యు లెంతగా మెచ్చుకొనిపోవుదురో మీకు అపరిచితము కాదు. అయినప్పటికి—

జాయపనాయకుడు జాగరూకుడై అర్థోక్తిగ పలికెను.

'సంశయించెద వేమి? చెప్పుమది'

గణపతిదేవుడు త్వరపెట్టెను.

రుద్రమదేవి యౌవరాజ్యపట్టాభిషేకము

అనిమాత్రము జాయపనాయకుడు అనగలిగెను.

అనుక్షణమె గణపతిదేవచక్రవర్తి అమాత్యశేఖరు లందరివంక సవిమర్శగా జూచెను. అందఱును ఔత్సుక్యమూర్తులై కనిపించిరి.

అర్థమైనది జాయప్పా! ఇదా నీ ఆంతర్యము?

'అమాత్య శేఖరుల ఆమోదమును'

జాయపనాయకు డందిచ్చెను.

గణపతిదేవచక్రవర్తి గంభీరముద్ర తాల్చెను. అందఱును మౌనమునే ఆరాధించిరి. నిశ్శబ్దము ఘనీభవించినది. మెల్లగ చక్రవర్తి లేచెను. అందఱును నిశ్చేష్టులయిరి. రుద్రమదేవి కపోలముల మాత్రము అలంతి కోపము సాభిప్రాయముగా దాగుడుమూత లాడినది.

అమాత్యులకు నాయెడ భక్తిభావజ్ఞత యంత పొడమనందుకు రుద్రమకు పాషాణ పితృహృదయభ్రాంతి కలుగనందుకు అదృష్టశాలిని!' అని మాత్రము సాంత్వనముగ పలికి గణపతిదేవచక్రవర్తి గద్దియడిగెను. పితృమూర్తి అడుగుజాడలను రుద్రమదేవి అనుసరించినది.

'ప్రభుహృదయము దురవగాహము'

గోవిందనాయకుడు జాయపనాయకుని జూచి అనెను.

నిర్హేతుక మనుట తప్ప!"

జాయపనాయకుడు చివాలున కదిలెను. ఎవరిమట్టుకువారు రహస్యమందిరము వీడిరి. ఎవ్వరికిని ప్రభువునకు నిజతనయా పట్టాభిషేక విముఖత్వ మెందునిమిత్తమో బోధపడలేదు. అనేక పర్యాయము లంతకుమున్ను ప్రసం

గికముగా పట్టాభిషేక విషయము తెచ్చిరి. అప్పుడు నిప్పుడు గణపతిదేవ చక్రవర్తి పైఖరి పట్టాభిషేక సందర్భమున నొకచే। అంతటి పరాఙ్ముఖతకు ఆస్కారములేదని అమాత్యుల అభిప్రాయము. ఎప్పటికైన రుద్రమదేవి పట్టాభిషేకము అవశ్యముకదా జాగేల? అని జాయపనాయకుని గుంజాటనము.

ఎందునిమిత్తమీ పరాఙ్ముఖత్వమో అందరికిని సమస్యయే యైనది. ఎన్నాళ్ళకుంటియో తెగని సమస్య। తిరిగి పరిశ్యైక్య సమాలోచనమునఁగూడ ప్రభువైఖరి యథాపూర్వమే। అందులకు హేతువు అగమ్యము. అవుమకాదన సాహస మెవ్వరికి? అట్లని కాలచక్రము మందగతి వహించునా? దివసములు మాసములై మాసములు ఋతువులై ఋతువులు సంవత్సరములై కాలచక్రపు టిరుసు విసురులో కదలుచున్నది. ఒకసారి గణపతిదేవచక్రవర్తి దర్శనార్థము జాయపనాయకుఁడు స్వయముగా రాజమందిరమునకు వచ్చెను. అప్పుడొక అంతరంగికుఁడు ప్రభువునకిట్లు చెప్పుచుండెను.

కణిగిరిసీమలో మరొక విచిత్ర సంఘటనము — ఆ సీమలోని ఆలవలపాడునకు ప్రభువు యాదవ సంతజుఁడైన కాటమరాజు। కాటమరాజునకు కావలసినంత గోగణము కాని వానికిఁ దగిన పచ్చికబీడు లేదని పాలితసీమలో పశుగ్రాసములు కనుక సమీపస్థమయిన నెల్లూరు మండలమువారితో కాటమరాజొక యొడంబడిక చేసికొనెను. ఆ మండలమునకుఁ జెందిన శాద్వలభూమిని పశుగ్రాసార్థము కాటమరాజు గుత్తకు పుచ్చుకొనెను. అందునిమిత్తము మనుమసిద్ధి మహీపాలునకు కొంత కప్పము చెల్లింప నిర్ణయము. సామంత నృపుఁడైన కాటమరాజు సైనికసంపత్తి పిలవాఁడే। అంతేకాదు కాటమరాజు వైష్ణవుఁడు అట్లు కొంతకాలము శైవమతాభిమాని మనుమసిద్ధికి అవసరార్థము కప్పము చెల్లింపుచునే యుండెను. ఉన్నట్టుండి కాటమరాజు కప్పము కట్టుటకు నిరాకరించెను. నెల్లూరుమండలములోని శాద్వలభూమిమాత్రము ఏడలేదు. మనుమసిద్ధి కతని అకస్మాత్ విప్లవము క్రోధకారణమైనది. అయినప్పటికి యుద్ధదీక్షకన్నుకంటె సంధిప్రశాంతత దేశాభ్యుదయమని భావించి అన్నమభట్టను బ్రాహ్మణమంత్రిని రాయబారిగ పంపెను. కాటమరాజు దురహంకారియై రాయబారమును మన్నింపలేదు. కప్పము కట్టనక్కరలేదని ఖండితముగ చెప్పెను. కావలసిన రణభూమికి వచ్చి మనుమసిద్ధి కర్తవ్యనిర్ణయము చేసికొనవచ్చును। అని కబురంపించెను.

మనుమసిద్ధి మంతివడెను. యుద్ధము తప్పదని తలఁచెను. సేనలు సిద్ధమైనవి. మహాసంగ్రామము ప్రారంభమయినది. కాటమరాజు కూడ సమసైన్యయుతుఁడై రణభూమికి వచ్చెను. మనుమసిద్ధి సేనలు ఖడ్గతిక్కన అధ్వర్యమున కదలివచ్చినవి. ఎదిరి సేనలు చూడఁగా మడమత్రిప్పని మహావీరుఁడు ఖడ్గతిక్కనకు భయముకలిగెను. కాటమరాజెంత కాలముగా

యుద్ధప్రయత్నమున నున్నది అప్పు డర్థమైనది తొలినాఁడు పోరు ఉభయ సేనలకు మహాఘోరముగ జరిగినది ఎందఱో వీరులు మృతులయిరి మఱెందరో క్షతగాత్రులయిరి కాటమరాజు సేనకంటె మనుమసిద్ధి సేనలోని వారెక్కువమంది మడిసిరి ప్రయత్న పూర్వకముగ వచ్చిన ప్రతిపక్షులను ఎదిరించి నిలుచుట కార్యాంతరముగ కదనభూమికి కదలివచ్చిన మనుమసిద్ధి సేనాపతి ఖడ్గతిక్కనకు కష్టమనిపించినది కదనరంగమనిన క్రీడారంగమువలె ముందునకువచ్చు ఖడ్గతిక్కనకే భయకారణమైన కాటమరాజు సేనావాహిని తలంచుకొన్న మనుమసిద్ధి సేనలకు గుండె తల్లడమందినది

కేవల భుజబలమే గాక బుద్ధికౌశలమును గల సేనాపతి ఖడ్గతిక్కన నాఁటిరాత్రి దీర్ఘముగ ఆలోచించెను ఇప్పు డమాంతము ఇతర రాజుల సాహాయ్యము లభింపదు లభించునాశ యున్నప్పటికి వ్యవధిలేదు కాటమరాజు సేన చూడఁగా లెక్కకు మీఱియున్నది తక్కువ సైనికులు కల తా నిట్టియెడ నిష్కారణముగ యుద్ధరంగమునకు ఆహుతి యగుటకంటె ఇంకను బలగమును చేకూర్చుకొని కొంతకాలము వేచి సమయము కనిపెట్టి అప్పుడు శత్రు సంహారమునకు సన్నద్ధుఁడగుట సముచితమని భావించెను ఆనాఁటి యుద్ధములో నిహతులు కాక మిగిలిన అల్పసంఖ్యాకులతో ఖడ్గతిక్కన యుద్ధధర్మ నిపుణముగా వెనుదిరిగెను

మనుమసిద్ధి కది మఱింత అపమానకరమైనది ఇంటికి వెళ్లుచున్న ఖడ్గతిక్కనకు కబురంపించెను ఖడ్గతిక్కన ఇంటికి వెళ్లెను వెళ్లునరికి వీరమాత దిష్టి' తీయనదఁట। వీరపత్ని చానమ్మ ఖడ్గతిక్కనను స్నానమునకు లెమ్మనినది ఖడ్గతిక్కన స్నానమునకు వెళ్లునరి కచట నులకిమంచము అడ్డుగ జలపాత్రలు కనిపించెను మంచముకోటిపయి పసుపుముద్దకూడ కలదు ఖడ్గతిక్కన అప్రతిభుఁడయ్యెను వీరపత్ని అచటికి వచ్చినది మూగ చూపులతో ముఖము ముకుళించుకొనిపోయిన భర్తను జూచి

ముగ్గు రాదువార మైతిమి' అన్నది చానమ్మ

ఎటులో తిక్కన స్నానమైన దనిపించి లేచెను భోజనమునకు కూర్చుండెను తల్లి వడ్డన చేయుచున్నది

' విరిగిన పాలు వేసితిరేమి ,'

ఖడ్గతిక్కన ప్రశ్నించెను

"ఇంటిలో పాలు విరిగినవి యుద్ధములో మగవాడు శౌర్యసాహసములు విరిగినవి ' అన్నది వీరమాత

ఖడ్గతిక్కన మఱి ఆఁగలేదు సరాసరి యుద్ధరంగమునకు అశ్వారూఢుఁడై పరిగెత్తెను అప్పటికే మనుమసిద్ధి పునరాయత్త పఱచిన సేనలు తిక్కన ననుసరించినవి ఈసారి బలాబలములు సమముగ నున్నవి

కాటమరాజునకే భయకారణ మైనది ప్రళయకాల రుద్రునివలె ఖడ్గతిక్కన దుర్నిరీక్ష్య తేజుఁడై ఖడ్గచాలనమున రక్తవృష్టికోయన విద్యుత్ప్రభలు విరియఁ జేయుచుండెను

కుహనాయుద్ధకోవిదుఁడు కాటమరాజు నాఁట 'కులధేనువు నకు కుంకుమ పూజలుచేసి యుద్ధసన్నద్ధము చేసెను ఆ ధేనువు కులదేవత। సాధుగ విక్రుద్ధావతారము దాల్చి గండపరశు ప్రచండములైన శృంగములెత్తి యుద్ధ రంగము నంతటను క్రుళ్ళఁ బొడువనాగినది ఎదిరిసైనికులు కుద్దాలిత కందములవలె భూపతన మందసాగిరి ఎప్పుడు వచ్చివడునో ఎఱుఁగకుండ వాలమెత్తి మేనెల్ల నిక్కించి శూలాగ్రశృంగములతో ఎగిరిపడుచున్న క్రుద్ధగవి యుద్ధమునకు మనుమసిద్ధి సేనలు ప్రతిహతములు కాసాగినవి అదొక అద్భుత యుద్ధంచనము దాని తాకిడికి తాళఁజాలక మనుమసిద్ధి సేనలు భీరువులై పలాయితులగుచున్నను ఖడ్గతిక్కన ఖడ్గచాలనము మానలేదు ఒక్కుమ్మడిగ అతనిపై శత్రుసేనలు విఱుచుకొని పడినవి అంతే। క్రుద్ధగవి అంభాజయ గర్జారావము చేసినది ఖడ్గతిక్కన అశ్వరాజము వార్తావహనార్థము బయలు చేరినది। ప్రతిజనపదమీ వివరములతో ప్రతిధ్వనించు చున్నది "

అనునెడ గణపతిదేవుని హృదయమే కవితిక్కన సోదరుఁడా ఖడ్గతిక్కన। అని ప్రతిధ్వనించినది అంత జాయపనాయకుఁ డాయన వంటపడెను

'జాయపా। వింటివా సామంతుల అన్యోన్యకలహములు। యుద్ధరాక్షస స్వైరవిహారమిటుల సాగు కాలమున మీ రందఱు రుద్రమదేవి పట్టాభిషేకమని తల్లడిల్లుదురు రాజ్యము ప్రశాంతముగా నుండినకదా రాజులకు పర్వదినములైన। పట్టాభిషేకములైన॥ రాజుల యుద్ధము లొకటియెత్తు। ప్రజల మతకలహములు మఱియొకయెత్తు॥ ఇంత క్లిష్టముగ దేశముండగా యౌవరాజ్యపట్టాభిషేకము మనము తలపెట్టిన మఱియొక సమస్య కల్పించినవార మగుదుము కనుక మత సామరస్య ప్రయత్నము మన కర్తవ్యము' అని చక్రవర్తి నిశ్చితముగా తెలిపెను

దక్షిణాపథమునకు కేంద్రము — కాకతీయసామ్రాజ్యమునకు రాజధాని యైన ఏకశిలానగరమున మతపండిత మహాసభ జరిగింపవలెను మతసమస్యకు పరిష్కార సాధనములు రాజుల కరవాలములు కావు పండితుల మేధా ప్రాభవములు। యావద్భారత మతపండిత మహాసభను సాధ్యమైనంత త్వరలో అమాత్యశేఖరుల ఆదేశానుసారము ఏర్పాటు చేయునది ' అని గణపతిదేవ చక్రవర్తి ముదల యొసఁగెను

శిరోధార్యము

జాయపనాయకుఁడు నతశీర్షుఁడై కార్యాచరణలగ్నమనస్కత ప్రకటించి అనంతరకరణీయములకు సమకట్టెను

౩౦

సిద్ధార్థి ఉగాది పర్వదినము ప్రాక్చిత్రకారుని కుంచెలో ఉషశ్శ్రీలు నగిషీలై నవవినవి వగరు చివుళ్ల మెసవిన పుంస్కోకికలు వసుధైక పులకోత్సవముగ వైతాళికగానములు సలిపినవి సుక్షేత్రములలో ఏరువాక సాగినది కుంకుమాంకుర కిసాలరాలగనలక్ష్మి సమస్తవైభవోపేత సామ్రాజ్య రాజేశ్వరికి పేరంటము చెప్పినది ఏకశిలానగరములో పీథివిటంకతోరణ పంక్తులవలె విహరమాణజన కుతూహలోన్నయన పంక్తులు వాసన్ముఖము లయినవి అవి యావద్భారత మతపందిర మహాసభాప్రాభవ సాక్షిదృక్ష సమీక్షా దక్షములు।

స్వయంభూస్వామిని సందర్శించ ఆనసమ్మర్దములో హార్దమార్దవ మచ్చొత్తు అపూర్వతేజస్సుతో విభూతిరేఖావికాసముతో రుద్రాక్షభూషలతో కాషాయవస్త్రధారియై కనిపించు కుమారజ్యోతిర్మూర్తి ఎవరో కాదు రుద్రనాయకుడే। అతడు ఆలయప్రవేశముచేసి స్వయంభూస్వామికి సాష్టాంగ దండప్రణామ మాచరించెను అటుపిమ్మట ఏకాంతప్రదేశవిలోకనేచ్ఛామతియై ఆలయ పురోభాగమునకు వెడలెను అట ప్రాగుత్తర దిశగా సప్తశివలింగ మందిరమున్నది అక్కడకు జనులెవ్వరును రారు గత దివసదేశమార్గాయాస నివృత్తికై రుద్రనాయకుడటు వెడల తన్మందిర మధ్యమున నొక పురుషాకృతి లీలగా దోచి కుతూహలమగ్నమానసుడై త్వరితగతిని సమీపించెను

అస్థిపంజరమాత్ర శరీరియై ధూళిధూసరితమైన వస్త్రములతో దట్టముగ పెరిగిన ధవళశ్మశ్రువుల పెనవైచుకొను పలితకేశజటాజూటముతో గాజువారిన కన్నులతో శిలావిగ్రహ సదృశముగ నున్న తత్పురుషాకృతి సజీవ వ్యక్తిగ రుద్రనాయకునకు పొడకట్టెను ఎవరైయుండునని మిక్కిలి సమీపమున కేగి తేఱిపాఱ చూచునెడ ఆ వ్యక్తి కన్నులు మిటకరింపుచు వ్రేళులు సంజ్ఞకరింపుచు కనుపట్టెను రుద్రనాయకుని కాతని రూపము జ్ఞప్తికి వచ్చినది

"చయనులుగారూ।'

సంభ్రమాశ్చర్యములతో రుద్రనాయకుడు సంబోధించెను

ఆమాట విని అగ్నిహోత్రచయనులు ఫక్కున నవ్వెను అస్థిపంజరమె నవ్వినట్లనిపించిన రుద్రనాయకుడట్టె స్తబ్ధుడై నిలిచెను

'దౌర్భాగ్యదేశము। ఆర్షమత మడుగంటిపోవుచున్నది

అగ్నిహోత్రచయనులు లదేపనిగా నవ్వసాగెను ఆ కఠోర వికటాట్టహాసము కుఠారమువలె రుద్రనాయకుని గుండెపై పడినది అమాంత మతని అంతరస్నాయువులు జలదరించినవి

పాపము—మతోన్మాది।'

రుద్రనాయకుని జాలిగుండె దడదడ లాడినది మఱి అక్కడ క్షణముండలేకపోయెను సరాసరి రుద్రనాయకుఁడు ఆలయ ప్రాంగణమునకు వచ్చెను యాతాయాత భక్తవరుల సమ్మర్ద మింకను సడలలేదు అక్కడ ఎవరో నూతన వ్యక్తులు మాటాడుకొనుచుంటిరి

ఒకఁడు మీ దేయూరు?

మఱొకఁడు కాంచీపురము

ఒకఁడు ఇంతదూరము వచ్చితిరి మీ రేమైన మఠ పండితులా?

మఱొకఁడు నే నేపండితుఁడను గాను

ఒకఁడు అయిన తీర్థయాత్రకు బయలుదేఱితిరా?

మఱొకఁడు అదేమియు కాదు స్వమతపథ కారణముగనె వచ్చితిని నేనేకాదు మా కాంచీపురమునుండి వందలాది ప్రజలు వచ్చిరి కారణము వైష్ణవయోగిని!

ఒకఁడు ఎవరామె?

మఱొకఁడు ఆమె ఎవరో మాకును తెలియదు హరినామసంకీర్తనమె ఆమె జీవనము ఆయిదారు సంవత్సరములకు ముందు మా గ్రామమునకు వచ్చినది ఒకరి తోడియు పొంటియు లేక తానంత తానామె దేవాలయాంగణమున ఆసీనయై అటులే హరినామసంకీర్తనమున కాలము గడుపసాగినది ఎవ్వరును మొదట పట్టించుకొనలేదు నిద్రాహారములు మాని అట్లు కాలక్షేపము చేయుగా అందఱికిని ఆమె ఎవ్వరను ప్రశ్నయే కలిగినది

ఒకఁడు ఎన్నివిధములుగ అడిగిన చెప్పలేదు సరికదా వేదాంతము విప్పినది అందఱు నొకటే! విష్ణ్వంశ సంభూతులయిన మానవులలో ఏ నాతన భేదము కాల్పనిక మనుచు నేమేమియో చెప్పసాగినది ఏమి చెప్పిన చెప్పకున్న ఆమెమాత్రము మహానిష్ఠాపరురాలు అందుకనేక నిదర్శనములు కలవు ఒకనాఁ డామె అకస్మాత్కముగా తనకు విష్ణుసాక్షాత్కారమైన దన్నది ప్రాగల్భ్యములు చెప్పుకోవలసిన అవసర మామెకు ఈషన్మాత్రము లేదు నిజమే కావచ్చు ఆనాటినుండి ఆమె బాహ్యమైన హరినామసంకీర్తనమునకు స్వస్తి చెప్పినది మౌనధ్యానమె మోక్షసాధనమని అక్కడివారితో చెప్పి నాఁటనుండి వ్రత మవలంబించినది చార్వాకాది నాస్తికమత నాయకశిఖామణులు అనేక పరీక్షలు చేసిరి ఏవిధముగనైన ఆమె మాహాత్మ్యము మహేంద్రజాల మని ధ్రువపఱచవలెనని వారి సంకల్పము అది సంభవము కాలేదు మాకు మాత్రము వైష్ణవయోగిని మహా వైష్ణవురాలని కేవల విష్ణుపాదారవిందైక ధ్యానమానసయని విశ్వాసమె ఆమె తపశ్శక్తివలన ఎట్టి అంతరాయములు కలుగకుండ కట్టుదిట్టములు చేసితిమి కావలసినన్ని కథలవి యెందుకుగాని అసలుసంగతి మొన్న కాంచీపురమందలి ఆళ్వారు లడచుటకు కాకతీయ సేనలు వచ్చినవి వారివలన

మాకు తెలిసినది నేటి సర్వమత సభావృత్తాంతము అది యెట్లు వైష్ణవయోగినికి హృదయస్థమైనదో నాఁటికి నేఁటికి మొన్నను నోరువిప్ప శైవమత నిరాసము చేయుటకై ఏకశిలకు అవశ్య మేగవలె నన్నది అంతే పయనమైతిమి. ఆమెకు ప్రత్యేక సదుపాయములు కలిగించిరి మీ ప్రభువులు మాకు సంతోష మైనది మా గృహాతిథి వైష్ణవయోగి సన్నిధి వీడరు మే మింకను సమయ మున్నదని కాలక్షేపమునకుఁగాను నగరవిశేషములు చూడ ఇటు వచ్చితిమి '

ఉత్తరుఁడు మంచి పనిగ నున్నది, సరే! ఇది స్వయంభూ దేవా లయము చాల మహత్త్వముగలది లోనికి దయచేయుఁడు

ఒకఁడు చిత్తము

రుద్రనాయకున కతనిఁ బిలచి ఏదియో అడుగవలె ననిపించినది కాని అట్లు చేయలేకపోయెను ముందున కడుగువైచెను ఘంటాపథము చేరు కొనెను అక్కడ రాజభటు లిద్దఱు పూర్వపరిచితులవలె కనబడగా వారిని పిలిచి ఇట్లు ప్రశ్నించెను

మీరు హేమాద్రిరెడ్డిగారిని ఎఱుఁగుదురా?

సేనాపతి రెడ్డిగారా?'

అవును'

'ఎఱుఁగకేమి? ఇప్పుడాయన ఇక్కడ లేరు

'ఎక్కడ కలరు?"

మహానగరమున'

'ఆదేమి?'

'యుద్ధములో చంపబడిన కృష్ణనాయకుఁడు వీరస్వర్గ మలంకరించిన దొంగవాటుగ చంపినరెడ్డి నరకలోకము చేరుకొనఁడా అనఁగా భావమేదిని చంపిన పాపమునకు పశ్చాత్తాపము చెంది ఆత్మపరితాపముతో ఆయనగారు 'హరీ! అనిరయ్యా! అనెను

వెంటనే రెండవ రాజభటుఁడు ఏమిరా! హరీ యనెనా? శివా యనెనా?" అని అమాంతము కత్తిదూసెను మొదటివాడును కత్తి కలిపెను అంతవఱకు అన్యోన్యముగా వచ్చినవారు భటులు త్రుటిలో పరస్పరము హంత లయిరి

రుద్రనాయకునకు రక్తసంసిక్తమైన భూతలమది రక్తదర్పణమువలె భాసించినది అందు వైష్ణవధ్వజ ప్రతిష్ఠాపన, శివతాండవ ప్రతిబింబములు ప్రతిఫలించి రుద్రనాయకుఁ డస్తవ్యస్త హృదయుఁ డయ్యెను అప్పు డతనికి భాస్కరభట్టారకులు జ్ఞప్తికివచ్చిరి

"మతలక్ష్యము భౌతికముగా విశ్వకళ్యాణము ఆధ్యాత్మికముగా పర బ్రహ్మైక్యము అది ఏమఱవలదని నా ఆదేశము "

మీ దీక్షావచనమే నాకు వేదవాక్కు '

అలనాటి సంఘటన కన్నులం గట్టినది అతని హృదయము శతధా శకలితమైనది సర్వమతసమన్వయ సభాధ్యక్షస్థానము సమస్యాపరిష్కారము కాగలదాయని నిరీక్షాముద్ర నిలిపెను

సాయంకాలమైనది సర్వమతసమన్వయ సభావేదిక సమాసన్నమైనది ఏకశిలానగర ప్రాకారశిఖరాగ్ర ఘంటానాదములు మ్రోగుచున్నవి సభాంగణము వెల్లివిరిసినది సభావేదికపై ప్రత్యేకాసనములలో వివిధ మతప్రవక్తలు విచిత్రాసీనులయిరి రుద్రమదేవీ సమేతముగా గణపతిదేవచక్రవర్తి సభకు వచ్చెను ప్రధానామాత్యుని ప్రకటనపై శివదేవయ్య ఆధ్యక్షత వహించెను పక్షపాతములేకుండ సభాప్రారంభమున సర్వమత ప్రార్థనలు గావించిరి ఆర్షమతస్థులు వేదగానము చేసిరి బౌద్ధులు బుద్ధస్తుతుల జైనులు జినస్తుతి సలిపిరి శైవులు పంచాక్షరీమంత్రము జపించిరి వైష్ణవులు నారాయణ నామోచ్చారణము గావించిరి అనంతరము ఆస్తికనాస్తికులు అనాదిప్రసిద్ధమైన ఆర్షమత ప్రాధాన్యము నుగ్గడించిరి సర్వమతశాఖలు తత్తత్కల్పితము గావించిరి వార్తమానికార్షము కించిన్న్యూనమై పండిత సంఘాదరాపేక్షమై యుండె వెంటనే 'అశాస్త్రీయమది' అనుచు ఔత్తరాహ మతప్రవక్త దిగ్గున లేచెను

ఆర్షమతము ఈశ్వరసృష్టి వేదము అపౌరుషేయము మానవ ప్రమేయము తన్మతబాహ్యము ఆర్షము నేడు వ్యాసమనుట అవివేకమూలకము యథాతథముగానైన ఆర్షమతానుసంధానమే సర్వజన సుఖదాయకము ఆర్షమత సంస్కరణావశ్యకము తదానుకూల్యముకూడ ఆభాసము అను మతప్రవక్త మాటలకు నాస్తిక మతప్రచారకుడు నవ్వుచు లేచి ఆర్షమతము స్వార్థ మాత్రోపయోగి ధర్మస్థాపనము దైవవిశ్వాస మూలకము దైవమే అభూత కల్పన నిరాకారనిర్గుణ బ్రహ్మకు సాకారసగుణ కల్పనమనుట మహేంద్రజాలము హేతుహేతుమద్భావము లేక అంధవిశ్వాసములతో కూడిన ఆర్షమతమొక అనర్థసాధనము ప్రజాశ్రేయస్సు ప్రధానమైన ప్రభుత్వము జడప్రవృత్తికి మూఢప్రవృత్తికి మూలభూతమైన ఆర్యమతమును ఆదరింపదు అనెను అంతట రాజమర్యాదానుసారముగా యవనికాంతరమున ప్రత్యేకాసీనయైన వైష్ణవయోగిని కాంతపట మించుక తొలగించి కంఠము విప్పినది ఇంతలో రుద్రనాయకుడు సభలోనికి వచ్చెను అల్లంతదూరాన మల్లుతెరమాటున చంద్రబింబమువలె వైష్ణవయోగిని ముఖ మాతనికి అస్పష్టముగా కనిపింపనట్లే దృష్టి నిలిపెను

మతము సత్యసమ్మతము చిన్మయము మతసహిష్ణుతయే మాధుర్యము ఏ మతమైన పరమాత్మైక్య పరమావధికము కొందరికి శివసాయుజ్యమువలె మఱికొందఱికి విష్ణుపారమ్యము శైవవైష్ణవములు రెండును ఫలప్రదములే

కాని ఆర్షమతములోని చాతుర్వర్ణ్యవ్యవస్థ తొలగించి సంస్కరించినది మొదట శైవమే కావచ్చు ఆచరించినది వైష్ణవము ఆచరణమే అత్యవసరము గనుక తత్త్వ శిరోధార్యము వైష్ణవము అన్నది వైష్ణవయోగిని

రుద్రనాయకుని హృదయ ముద్రిక్తమైనది ప్రత్యాఖ్యాన పంశుప్రభలు మెఱసినవి కాని సహస్రకిరణ సముజ్జ్వల భాస్కరమూర్తివలె సభావేదికపై భాస్కరభట్టారకులు భాసించిరి పౌరుషావేశము పరాఙ్ముఖమైనది మూలల దృష్టి ప్రత్యేకాననమువంక ప్రసరించినది అవ్యక్తయోగిని కంఠము అతి పరిచిత మనిపించినది అంతేకాదు ఎదిగా హేలాంటిక కంఠస్వర మనిపించి నది కాని వైష్ణవయోగిని కనిపించనిది వినిపించున దిప్పుడు విశ్వేశ్వర శివాచార్యుల జలదగంభీరస్వరము

ఆమె బాలిక అనుభవము తక్కువ ఆమె వాక్కులు అప్రమాణములు అర్థరహితములు ఈశ్వరుడే సర్వేశ్వరుడు సత్త్వరజస్తమోగుణమూర్తి విష్ణ్వాదులు కింకరులు మాత్రమే తర్కసహములైన శైవాగమములన్నియు అపవాదములేని సిద్ధాంతములు అన్యమతస్థుల ఖండనమండనములు అజ్ఞాన విలసితములు సర్వేశ్వరసంసేవనమే సామ్రాజ్యమునలేదు సర్వమానవకోటికి మోక్షసాధనము

సర్వమత సమన్వయసభలో శైవ వైష్ణవ ప్రధానమతభేదములు పడగలు విప్పినవి హరహరమహాదేవ్ అని శైవులు వీరావేశమెత్తి విజయనాదములు చేసిరి వైష్ణవులు సర్వమ్ జగన్నాథ మని స్వగతించుకొనిరి బౌద్ధులు జైనులు మూగనోముపట్టిరి ఆర్షమత పండితులు అనార్ష చతుస్సాగరములను పుడిసిలిం బట్టు అంతరంగములలో అగస్త్యమహర్షులయిరి సముద్రమథనమునాటి హాలాహల జ్వాలాతోరణములు వెలిగినంగాని అమృతకలశము ఆవిర్భవించదని నాస్తికుల కలవరము రాజసభలో సభ మొదలై రసాభాసమగు పరిస్థితి కలిగినది ప్రతిపక్ష రక్షణ లేకుండగనె హఠాత్తుగ వింజమాకితినట్లయినది కారణము సభావేదికపై నొక తేజోమూర్తి సాక్షాత్కారము

అందరి దృష్టులు ఆశ్చర్యస్పృష్ట లయినవి

ఎవరా తేజస్వి?

బ్రహ్మసరస్సు ప్రతిఫలించు విశాలఫాలతలము దివ్యదీధితులేవో దిద్దితీర్చెడి కర్ణకుండలముల రత్నప్రభలు రాశులైన కపోలయుగళి జ్యోతిః పుంజ తేజఃస్ఫులింగములు సుద్యోతకమగు ఆకర్ణాంత విశాలలోచనములు కలిగి మూర్తీభవించిన పరబ్రహ్మస్వరూపమేయన సాక్షాత్కరించిన మహా వ్యక్తి మహాకవి తిక్కనసోమయాజి।

'శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత్వకిచ్చ మెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్।

కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదాస్తన్యమ్
తవ స్వాదు వద ప్రభో మే—

"కరుణారసము పొంగి తొరఁగెడు చాడ్పున
శశిరేఖ నమృతంబు జాలువార
హరినీల పాత్రిక యందు చందనమున
గతి వాణి ధవళపంకజము మెఱయ
గుటయైన చెలువున నెఱపిన లోక ర
క్షణ మనంగ గళంబు ఛాయఁదోఁపఁ
ప్రథమాద్రిఁ దోతెంచు భానుబింబమునా ను
రమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప
సురనదియును గాళిందియు బెరసినట్టి
కాంతిపూరంబు శోభిల్ల శాంతమూర్తి
మనమనంబు లానంద మగ్నముగఁ జేయ
నెలమిసన్నిధి సేయు సర్వేశ్వరుండు।

సాహిత్యము సంగీతమై సంగీతము సాహిత్యమై మహాకవి వాణి సుకుమార లజ్జవలె కవిరాయిత భాషణమై మతసమన్వయముఁ హరిహరాభేదము ధ్వనితము చేసినది సభాసామస్త్యము సంభ్రమాశ్చర్య చకితమైనది అప్రయత్నముగ రుద్రనాయకుని అంజలిఘటితమై అంతరంగము

గంటముచేతఁబట్టి నెరకంటను నేర్చితివయ్య నెమ్మి పే
రంటము సల్పగా హరిహరంబగు దైవము నేకరూపమే
జంటకలందితివు హరిచందన మెంతటి సోమయాజివో
మంటపహోమకుండముల మాయగ రుద్రలలాటరూక్షతల్।

అనుకొన్నది గణపతిదేవ చక్రవర్తి మేను గరువారినది అమాంతము లేచి మహాకవి తిక్కనసోమయాజికి నతశీర్ష నమస్కృతి చేసె సభాముఖుఁడై

పరమధర్మము ప్రతిపాదితమైనది హరిహరనాథుఁ దేకవ్యక్తి జగత్పిత దివ్యస్వరూపమది దివ్యమానవుని నవ్యదర్శనము హరిహరనాథోపాసనమే కాకతీయ మహాసామ్రాజ్య లక్ష్మికి రక్షకవచము తద్వర

పరిరాత, ధర్మాద్వైతి మహాకవి సాక్షాత్ మండలద్రిష్ట తిక్కనసోమయాజి గారికి సువర్ణాభిషేకము, రుద్రమదేవికి పట్టాభిషేకము —' అని ప్రకటించెను

సహృదయులైన సరస్యులకు సంజీవనీ స్పర్శమైనది అనసామాన్యము జయజయధ్వానములతో సంపూర్ణామోదము తెలిపికొనిరి రుద్రనాయకుఁడు మాత్రము వాగ్రూపమైన దివ్యదర్శనమునకు శాశ్వతమైన రూపకల్పన చేయ చిత్రరచనావేశ మందెను మూర్తిభావనలో మూగ హృదయము రాగపీఠ యైనది భక్త హృదయమువలె భావహృదయము మయూర నృత్యము చేసినది రసానుభూతి ఉన్మత్తునివలె రాజవీధుల త్రిప్పినది రాత్రియైనది భావోష్మలత సమాధిలబ్ధమైనది సరాసరి చిత్రశాలకు వచ్చెను ఆశ్చర్యము। సరిక్రొత్తగా నున్నదా చిత్రశాల నిత్యసంస్కార మున్నటులే నిగనిగలాడినది ఇతరస్పృహ లేకుండ కుంచె తీసెను ఏదో తలంపు తటిల్లతవలె మెరసి ధ్యానముద్రలో కుంచె పైకెత్తెను అప్పు డత డొక మౌని। హరిహరనాథ స్వరూప సాక్షాత్కారలీలా ముముక్షువు। అట్టి తన్మయముద్రా తారాకాంతరమున అతి భాసమైన దొక అద్భుత కళా ప్రతిబింబము। అది రంగు అందిచ్చు హేలాంబిక అమృతపాణి।

'హరిహరాద్వైతము వలెనే దాంపత్యము సుఖదు। భావాద్వైతము'

భాస్కర భట్టారకుని అభిభాషణము

చిత్రశాల కొంతసేపు చిత్రప్రశాంతమయినది

'మనస్సొక చిత్రశాల చిత్ర విచిత్రములైన భావములకది నిలయము ఆ భావముల ఆకారరేఖలు చిత్రములు ఆ చిత్రములు మతుల ఆదేశపత్రములు। అవును హరిహరాద్వైతమువలెనే వైష్ణవ యోగినీ వీరశైవ దాంపత్యము కాత్య — కాదు — హేలాంబికా।"

రుద్రనాయకుని రుద్ధస్వరము

శకుంతలా దుష్యంతులవలె చిరకాల వియోగానంతరము ఆకస్మిక పునస్సమాగమము అనాటి ప్రశ్నలకు ప్రత్యక్షసమాధానము సరే కానిమ్ము హరిహరనాథుని చిత్రరచనకాబోలు। అటులే శిఖర శేఖరమైన శిల్పమొకటి నిర్మించునది '

'గురుదేవుల ఆజ్ఞ "

రుద్రనాయకుఁడు శిరమువంచి అంజలి ఘటించి అల్లిన కుంచె రంగులో ముంచెను హేలాంబిక హేలావిలాసముతో అలవోకగా నవ్వినది కుంచె విచిత్రముగ కులుకువోయినది భాస్కరభట్టారకులు భాస్వన్ముఖులై యిట్లనిరి

'ప్రపంచమే ఒక చిత్రశాల

——